# దసరా యజ్ఞ సప్తకం

(5-11 అక్టోబరు 1997)

# DASARĀH YAGNA SAPTHAKAM

**5-11 October 1997**






PRASHAANTHI NILAYAM

**శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్**

ప్రశాంతి నిలయం (పోస్ట్) 515 134.

అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్

గ్రామ్స్ : బుక్‌ట్రస్ట్, ఫోన్ : 87375, 87236

యస్.టి.డి. 08555, ఐ.యస్.టి.డి. 0091-8555

ఫ్యాక్స్ : 87236 / 87390

ఇంటర్నేషనల్ స్టాండర్డ్ బుక్ నెం. 81-7208-233-9

కన్వీనర్, **శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్**
ప్రశాంతినిలయం, ఇండియా - 515 134 వారిచే ఇండియాలో ప్రచురింపబడినది.

వెల : రూ. **27-00**

డి.టి.పి : **రాజేష్ ఫోటోస్టాట్**, అనంతపురము. ☎ : 33038
ముద్రణ : **రమేష్ ప్రింటింగ్ ప్రెస్**, అనంతపురము. ☎ : 22688

# విషయసూచిక

# మనవి

ఈ ఈశ్వరసంవత్సర దసరాపండుగలలో భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబావారి సర్వాధ్యక్షతను ప్రశాంతినిలయంలో వేలాది మంది దేశవిదేశీయ భక్త సమక్షంలో వేదపురుషసప్తాహజ్ఞానయజ్ఞం లోకకల్యాణం, ఆధ్యాత్మికాభివృద్ధికొరకు, వైభవోపేతంగా జరిగినది.

ఈ విశిష్టసప్తాహయజ్ఞ సందర్భంగా వారంరోజులపాటు (5-11 అక్టోబరు 1997) ప్రతిరోజూ సాయంత్రపు వేళ బాబావారు జ్ఞానబోధయజ్ఞాన్ని స్వయంగా చేశారు. శ్రీవారు పండితపామరరంజకంగా, అతి సులభశైలిలో వేద, వేదాంత రహస్యాలను, అంతరార్థాలను - చిన్నకథలు, ఉదాహరణలతో వివరించారు. మనదేహాన్ని, కర్మేంద్రియాలను, జ్ఞానేంద్రియాలను, మనస్సును, బుద్ధిని, చిత్తాన్ని, అహాన్ని నిగ్రహించి వాటి ద్వారా స్వధర్మకర్మాచరణ, ఆత్మవిచారణ, దైవాన్వేషణలు కావిస్తూ మనదైనందిన జీవితాన్ని ఒక యజ్ఞంలా గడపాలి అని బాబావారు బోధించారు. ప్రేమ, సేవ, త్యాగాలే ఈ యజ్ఞరహస్యమని ఉద్ఘాటించారు.

ఈ సాయిదసరాయజ్ఞంలో దానాలు, ధర్మాలు, దక్షిణలు విరివిగా యుంటాయి. వీటితోబాటు ఈసారి సాయిసుజలదానయజ్ఞం కూడా జరిగినది. పూర్ణాహుతిరోజున, వందలాది గ్రామాలలోని, లక్షలాది ప్రజల దాహార్తిని తీర్చే చారిత్రాత్మకమైన శ్రీ సత్యసాయి సుజల పథకాన్ని పూర్తిచేసి, అనంతపురం జిల్లా ప్రజలకు బాబావారు దానం చేశారు!

శ్రీవారి దివ్య ప్రవచనాలు భక్తులకు వరప్రసాదాలు; అవి సప్తసాధనసోపానాలు, సప్తజ్ఞానభూమికలు. బాబావారి సప్త అనుగ్రహ సంభాషణలు దసరాయజ్ఞ సప్తకం అనే ఈ గ్రంథ రూపాన్ని పొందినవి.

శ్రీ సత్యసాయి పుస్తకములు మరియు ప్రచురణల సంస్థ ఈ పుస్తకాన్ని బాబావారి దివ్య పాదారవిందములకు అర్పిస్తూ, భక్తజనులకు అందించుచున్నారు.

జైసాయిరామ్!

**కన్వీనర్**

శ్రీ సత్యసాయి పుస్తకములు మరియు
ప్రచురణల సంస్థ, ప్రశాంతినిలయం

# దేహతత్త్వం : శరీరమాద్యం ఖలు ధర్మసాధనం

రక్తము మాంసశల్యముల రాశియు దేహము మీరు కాదు సు
వ్యక్తముకాని కోరికలు వ్యర్థమనస్సును మీరు కాదు గా
ముక్తికి బంధకారమగు మోహపు భ్రాంతియు మీరు కాదు మీ
శక్తిని మీరెరుంగ గల శాశ్వితుడౌ పరమాత్మ మీరె గా!

ప్రేమాత్మస్వరూపులారా!

***దహ్యతీతిదేహః***

శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఇవి మానవుని ఉపాధులు. ఈ ఉపాధుల రహస్యము గుర్తించిన మానవుడే ఆత్మతత్త్వమును అర్థము చేసుకోగలడు. తాను ధరించిన ఉపాధుల తత్త్వమే తాను తెలుసుకొనలేకుండిన అంతర్భావమైన అఖండమైన ఆత్మతత్త్వాన్ని మానవుడు ఏరీతిగా గుర్తించగలడు? మొదటిది శరీరము. దీనికి దేహము అని మరొకపేరు. ''దహ్యతీతి దేహః'' దహింపబడేది దేహము. మరణించిన

తరువాత దహింపబడేది  ఇట్టి దేహతత్త్వమును మనము నిత్యజీవితంలో అనుభవించే నిత్యకర్మలందు  చక్కగా గుర్తించవచ్చు దేహమనగా ఆకారమని మీరు భావించవచ్చు. కేవలం ఆకారము మాత్రమే కాదు   ఇది

మలినపుకొంప రోగముల మ్రగ్గెడు సేవక గంప జాలసం
చలనము పొందు యంప భవసాగరమీదగ లేని తెంప అం
బుల పాది తెమ్ముచూడ మన మెప్పు దలంపగ దేహమింక ని
శ్చలమని నమ్మబోకు మనసా! హరిపాదము లాశ్రయించవే!

ఈ దేహమునకు మరొకపేరు కూడా ఉన్నది; శరీరము. జీర్ణింపబడేది శరీరము. ఇది మొట్టమొదట ఒక మాంసపు ముద్దగా ఉంటుంది; తదుపరి కోమలమైన స్వరూపాన్ని ధరిస్తుంది  యవ్వనములో అందముతో ప్రకాశిస్తుంది. వృద్ధాప్యములో అనేక వికారములు పొందుతుంది  ఈ శరీరము దినదినమునకు జీర్ణమై కట్టకడపటికి ఒక వికారస్వరూపాన్ని ధరిస్తుంది. కనుక ఈ శరీరమునకు ఈవిధమైన పేరు వచ్చింది.

***చిత, చింత, చితి:***

శరీరమనగా జీర్ణించునది. ఈ శరీరమునకు 'చిత' అని పేరు పెట్టారు. చిత అనగా అగ్ని. అగ్ని మరణించినవారిని దహిస్తుంది. చింత ఇది జీవించినవానినే దహించి వేస్తుంది. చితకు, చింతకు ఉన్న వ్యత్యాసమిదియే.  అగ్ని మరణించిన దేహాన్ని భస్మము చేస్తుంది. చింత జీవించిన వానినే మరణింప చేస్తుంది. రెండు విధములుగా మనము విచారించిన ఇది మానవునకు అపకారియైనదే కాని ఉపకారి కాలేదు.

శరీరము ఒక దిబ్బవంటిది. నిత్యము మన గృహము ఊడ్చి యింత చెత్తను తీసుకుపోయి ఒక గుంతలో వేస్తే, ఒక నెల అయిన తరువాత ఆ గుంత నిండుగా పెరిగిపోతుందీ చెత్త. ఇది జడమైనది అయితే ఎట్లా పెరుగుతున్నది?  అని సందేహము కలుగుతుంది. దేహము కూడా

చైతన్యరహితమైనదే. ఇందులో సత్‌చిత్ ఆనంద స్వరూపము ఉండటంచేత చైతన్యముగా రూపొందుతున్నది. ఇంతమాత్రముచేత, క్షీణించుచున్నది, వృద్ధి చెందుచున్నది. అనుకోవటం చాల పొరపాటు. దినము దేహానికి ఆహార సదుపాయము నందిస్తున్నాము ఈ ఆహారము చేతనే ఈ దేహము పెరుగుతున్నది. ఊడ్చిన చెత్త గుంతలో వేసినప్పుడు దిబ్బ ఏవిధముగా పెరుగుతుందో అదేవిధముగా దేహమునకు ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము ఆహారము నందించటంచేత ఈ దిబ్బకూడా పెరుగుతున్నది. ఇది పెరిగినంత మాత్రమున చైతన్యవంతమైనది కాదు. చైతన్యమైన దివ్యతత్త్వము ఈ శరీరములో ఉండి అన్నింటిని నడుపుతున్నది. కనుక శరీరము యొక్క తత్త్వాన్ని మనము చక్కగా గుర్తించటానికి ప్రయత్నించాలి.

**శరీరమొక క్షేత్రం:**

''శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'' మానవుడు ధర్మాన్ని ఆచరించే నిమిత్తమై ఈ శరీరమనే ఒక ఉపాధిని ప్రసాదించాడు. ఇది కేవలం పనిముట్టు మాత్రమే గానీ ప్రాణసహితమైన జీవితముకాదు. భగవద్గీతయందు దీనిని క్షేత్రమని ప్రబోధించారు. క్షేత్రమనగా ఏమిటి? దివ్యమైన దైవత్వమునకు నిలయమైన దానిని క్షేత్రమని అంటారు. కాశీవిశ్వేశ్వరుడు ఉండటంచేత కాశీ క్షేత్రమన్నారు. ఈవిధంగా భారతదేశములో ఉండిన మహనీయుల స్థానములను క్షేత్రములని పిలుస్తూ వచ్చారు. క్షేత్రమునకు పొలము అని రెండవ అర్థముంటున్నది. పొలములో పంటలు పండించాలంటే అనేక సదుపాయములు చేయాలి; దున్ని, నీరు పెట్టి, దుక్కిచేసి, విత్తనములు నాటినప్పుడే పంట పండుతుంది. ఎట్టి విత్తనములు నాటుదుమో అట్టి పంటయే పండుతుంది.

ఇది చేతు అది చేతు యింకెన్నియో చేతు
ననుచు ఊహలు అల్లి అలసిపోకు

ఏ విత్తులను నాటి ఇచ్చోట నుంటిరో
ఆ ఫలమ్ములె మీకు అందుచుండు
విత్తనమొకటైన వేరైన ఫలములు
లభియించుట ఎట్లు సాధ్యమగును?

క్షేత్రం - క్షేత్రజ్ఞుడు :

ఈ దేహముతో ఏ కర్మలు ఆచరింతుమో అట్టి ఫలితములు మనకు తప్పునవి కాదు. కనుక మంచి కర్మలాచరించి మంచి ఫలములు పొందటానికి తగిన సంకల్పము చేసుకోవాలి. క్షేత్రము దైవత్వమునకు నిలయమైనది. ఈ క్షేత్రములో క్షేత్రజ్ఞుడున్నాడు. క్షేత్రజ్ఞుడే ఆత్మ. క్షేత్రమే దేహము. ''క్షేత్రక్షేత్రజ్ఞ చాపిమాం విద్ధి'' అన్నారు గీతలో ఈ రెండు దైవముతో కూడినటువంటివే. క్షేత్రజ్ఞుడు ఉండిన మందిరము క్షేత్రము. అదియే పవిత్రమైనది. కనుకనే మందిరము యొక్క ప్రథమ స్థానమునకు నమస్కరించి తదుపరి మూలవిగ్రహమునకు నమస్కరిస్తాము కదా!. క్షేత్రమనగా దివ్యమైన దైవత్వమునకు మందిరమని అర్థం.

ఈవిధముగా దేహమును అనేక రకములుగా వర్ణించి ప్రజల ఆరాధనకు అవసరమైన మార్గములను ప్రబోధిస్తూ వచ్చారు మన ప్రాచీనులు. ఎట్టి వేదాంతి అయినప్పటికి, ఎట్టి పరిపూర్ణ జ్ఞాని అయినప్పటికి, ఎట్టి వేదశాస్త్ర యితిహాస పురాణముల ప్రమాణము అందుకున్నప్పటికిని మొట్టమొదట తెలుసుకోవలసినది దేహము యొక్క తత్త్వమే. ఈ దేహము అనేక జన్మల కర్మఫలములను గైకొని వస్తుంటుంది. ఈ జీవితమునకు మూలాధారమైనది దేహమే. సర్వకర్మలను ఆచరించటానికి మూలాధారము దేహమే. మన తెలివితేటలను పెంచుకొనుటకు దేహమే మూలకారణము. కనుక దీనిని ప్రధానమైన ఉపాధిగా పేరు పెట్టుకున్నారు.

## దేహం పూర్వ జన్మ కర్మల కంఠమాల:

జనని గర్భమునుండి జన్మించునప్పుడు
కంఠమాల లవేవి కానరావు
మంచిముత్యపుసరుల్ మచ్చునకు లేవు
మేల్మి బంగరుదండ మెడకు లేదు
రత్నాల హారముల్ రంజిల్లగా లేవు
పచ్చలు కెంపులు పొదగ లేదు
వజ్రాలహారముల్ వర్థిల్లగా లేవు
గోమేధికంబులు తోడలేవు
కలదు కలదొక్కమాల మీ కంఠమందు
పూర్వజన్మాల కర్మలు పొందుపరచి
ఎన్నిచేసిన అవియన్ని యెంచియెంచి
మంచిదైనను చెడ్డైన త్రుంచకుండ
బ్రహ్మమీకిచ్చి పంపును బరువుమాల
కర్మలన్నియు చేర్చిన కంఠమాల

ఏ ఒక్కటి మైనస్ చేయటంగానీ ప్లస్ చేయటంగానీ ఉండదు. ఉన్నది ఉన్నట్లుగానే మీకందించి పంపిస్తాడు బ్రహ్మ. అయితే మనము ఇక్కడ కొన్ని సాధనలు చేయవలసి ఉంటుంది. దుష్కర్మలు దూరము చేసికొనవలెనంటే సత్కర్మలాచరించాలి. సత్కర్మలు మనము అభివృద్ధి గావించుకోవాలంటే దుష్కర్మలు దూరము చేసుకోవాలి. మనం నిమ్మ విత్తనములు నాటుతాము. మామిడి పండు కాస్తుందా? మామిడి విత్తనములు నాటుతాము నిమ్మఫలము కాస్తుందా? లేదు లేదు అటులనే మనము చేసిన సర్వకర్మలకు ఫలితము, వాటికి తగినట్లుగానే దైవము అందిస్తుంటాడు. కనుక మన అదృష్టమునకు, దురదృష్టమునకు మనము

ఆచరించే కర్మలే కారణములు. దుష్కర్మలు దూరము గావించే నిమిత్తమై దైవకర్మలు నిరంతరము ఆచరిస్తూ దైవస్మరణ నిరంతరము చేస్తూ దైవ యజ్ఞము గావించుతూ రావాలి. మానవుడు పుట్టినది మొదలు గిట్టునంతవరకు క్షణక్షణము యజ్ఞమునే చేస్తున్నాడు.

**సమాజసేవయే యజ్ఞం:**

యజ్ఞమనగా ఏమిటి? పేరు చాలా పెద్దదే గానీ మన నిత్యజీవితములో మనము చేసే సర్వకర్మలు యజ్ఞ స్వరూపమే. యజ్ఞము చేయాలనుకుంటే గొప్ప తపస్సు చేయనక్కరలేదు.

న తపాంసి న తీర్థాని నశాస్త్రాణి జపానహి
*సంసార సాగరోత్తారే, సజ్జనం సేవనం వినా*

తపస్సు చేయనక్కరలేదు. తీర్థయాత్రలు సలప నక్కరలేదు. జపములు ఆచరించనక్కరలేదు. ఎదుటి మనిషి సేవలు మనం చేస్తుంటే, ఎదుటివాని బాధలు మనం నివారణ గావిస్తుంటే దాని ఫలితము మనకు లభ్యమవుతుంది. సజ్జనుల సేవలు మనం చేయాలి. అట్టి సేవయే సమాజసేవ. సమాజసేవ వల్ల మనకు లభించేది ఏమిటి? సర్వేశ్వరానుగ్రహము మనం పొందగలము.

ప్రతి మానవుడు తన కర్మలు తాను ఆచరిస్తూనే ఉన్నాడు. ఒక కర్మ తరువాత మరొక కర్మ ప్రారంభిస్తున్నాడు. ఒకటి చేసిన తరువాత సమాప్తి అయినది కదా యని తృప్తి పడే స్వభావము కాదు మానవునిది. ఇంకా ఎన్నియో ఎన్నియో చేయాలని ఆశపడుతుంటాడు. కనుక మానవ జీవితమంతయు కర్మమయమైనది. ఈ కర్మమయమైన మానవత్వము ధర్మమయమైనది. ఈ ధర్మమయమైన మానవత్వము బ్రహ్మ మయమైనది. బ్రహ్మము కర్మము ద్వారానే లభ్యమవుతున్నది. కర్మ ఏరీతిగా మనం సల్పాలి? సర్వ కర్మలు భగవత్ప్రీత్యర్థముగా సల్పాలి. ఇది నేను చేస్తున్నాను అనే భావము వస్తే ఆ ఫలితము నీకే లభ్యమవుతున్నది. అది మంచి

ఫలితము కావచ్చు చెడ్డ ఫలితము కావచ్చును. ఇది యజ్ఞము కాదు. ఏది చేసినా భగవత్ప్రీత్యర్థముగా చేయాలి. అదే నిజమైన యజ్ఞముగా రూపొందుతుంది కర్మఫలాపేక్ష లేకుండా చేసేదంతా యజ్ఞముగా రూపొందుతుంది.

### *యజ్ఞాలు ఆధ్యాత్మిక జ్యోతులు:*

నిర్విరామకృషిచే, నిరంతర తాపత్రయములచే, అంతులేని ఆశలచే, ఆర్థముకాని ఆవేదనలచే, అప్రాప్యరూప ప్రాప్తికై ప్రాకులాడే మానవునికి దిక్కును చూపే చక్కని దీపికలు ఆధ్యాత్మిక జ్యోతులు. సముద్రము లో లైట్‌హవుస్ అని ఉంటుంది. అది ఓడలకు స్టీమరుకు గుర్తుతెలిపే Light house. అదేవిధంగా సంసారమనే సాగరములో నిర్విరామ కృషి సల్పుతున్న మానవునకు, నిరంతరము తాపత్రయములు పడుతున్న మానవునకు దిక్కును చూపే జ్యోతులే ఆధ్యాత్మిక జ్యోతులు. ఈ సత్యమును ఈనాడు గుర్తించుకొనలేక ఆధునికయుగమందు ప్రతిమానవుడు దైవత్వమును విస్మరించి, మానవత్వమును విశ్వసించి అనేక విధములైన యిక్కట్లకు గురౌతున్నాడు. దైవము తప్ప మరొకటి ఈ జగత్తులో మనకు కానరాదు. సత్యమే దైవము. ఇట్టి సత్యమును విస్మరించినప్పుడు మానవుడు యింక దేనిని విశ్వసించగలడు?

### *దేహశుభ్రతతో బాటు భావ శుభ్రత అవసరం:*

దేహాన్ని జలముతో శుభ్రము చేసుకోవాలి. మనస్సును జ్ఞానముతో శుద్ధము చేసుకోవాలి. మానవజీవితమును సార్థకము చేసుకోవటానికి విద్య, తపస్సులచే శుభ్రము చేసుకోవాలి. కేవలం దేహాన్ని శుభ్రపరచుకున్నంత మాత్రమున చాలదు. బయట శుభ్రముతో బాటు అంతఃశుభ్రము కూడా కావాలి. బయట దినమునకు పది పర్యాయములు స్నానము చేసినంతమాత్రమున దైవత్వము మనకు ప్రాప్తించదు. ఏవిధంగా శరీరమునకై

ఆహారమును మూడుపూటలు భుజిస్తున్నామో అదేవిధముగా మనస్సుకు మూడుపూటలా ఆహారమునందించాలి. దీనినే ప్రాతఃసంధ్య అనగా తెల్లవారిలేచిన తక్షణమే భగవంతుని స్మరించటము, భజించటము, ఆరాధించటము జరపాలి. మాధ్యాహ్న సంధ్య అనగా భుజించుటకు పూర్వము భగవంతునికి అర్పితము గావించి తదుపరియే మనం భుజించాలి. భగవంతునికి అర్పితము చేయక పూర్వము అది సామాన్యమైన ఆహారముగా ఉంటుంది. పరమాత్మకు అర్పితము గావించిన ఆహారము ప్రసాదముగా రూపొందుతుంది. ఇది భగవత్ దృష్టిలోపడింది కనుక సర్వము పరిపూర్ణమై పవిత్రముగానే ఉంటుంది. రాత్రి తిరిగి భుజించి పవళించే సమయములో భగవంతుని ప్రార్థన చేయాలి. శరీరమునకు ఎన్నో అనుకూలములు చేసుకుంటున్నాముకాని, మానసిక పరిశుద్ధతకు మనము ఏమాత్రము కృషి చేయటం లేదు. శరీరమునకు తగిన విశ్రాంతి మందిరములు మనము నిర్మించుకుంటున్నాము. కానీ, మానసిక ప్రశాంతి నందించే మందిరములు ఎక్కడా కనిపించటం లేదు. **Rest house** ఏమిటి? దేహానికి రెస్టుహౌస్ కాని, మనసుకు ఎక్కడుంది రెస్టు. దైవానికి అర్పితముగావించినప్పుడే దీనికి సరైన రెస్టు చేకూరుతుంది. అదియే నిజమైన శాంతి. ఇట్టి శాంతిని మనం పొందాలనుకుంటే దైవారాధనలో మనం కాలమును అధికముగా ఖర్చు పెట్టాలి. ఈనాటి మానవుడు 99 భాగములు కాలమును వ్యర్థము చేస్తున్నాడు. కాలము భగవత్స్వరూపము - ''కాలాయనమః కాలకాలాయనమః. - కాల దర్పదమనాయనమః, కాలాతీతాయనమః కాలస్వరూపాయనమః, కాలనిర్మితాయనమః'' సర్వము కాలమే. ఈకాలమును మనం పవిత్రము గావించుకున్నప్పుడు మన కర్మలన్నీ పవిత్రమై పోతాయి.

ఏ పని అయినా చేయి. ఏమాట అయినా చెప్పు. దీనిలో స్వార్థము లేకుండా మనం చూచుకోవాలి. ఈనాటి మానవుడు ఏ పనిచేసినా వెలుపల

స్వార్థము ఉంటున్నది. ఏ పని చేసినా స్వప్రయోజన మనేది దీనికి వెనుక తాండవమాడుచున్నది కారణం ఏమిటి? మానవుని హృదయకుహరములో స్వార్థమనేది గాఢముగా నిల్చిపోయింది. స్వార్థము కాదు సాధించవలసినది, పరార్థమును సాధించాలి. ఆశలు కాదు మనం సాధించవలసినది. ఆశయాలను సాధించాలి. దేహాభిమానము కాదు మనం పెంచుకోవ లసింది, దేశాభిమానమును పెంచుకోవాలి. ఈ దేశములో ఇది ఒక దేహము. దేశమే లేక దేహమెక్కడిది? మొట్టమొదట దేశక్షేమాన్ని మనం ఆశించినప్పుడే దేహక్షేమము సంభవిస్తుంది. ప్రాచీనకాలము నుండి భారతదేశము అన్ని దేశములకు శాంతి భద్రతల నందిస్తూ వచ్చింది. కనుకనే నాటికీ నేటికీ ''లోకాస్సమస్తా స్సుఖినోభవంతు'' అనేది ఆర్యసాంప్రదాయమై ఉన్నది. కనుక సర్వుల క్షేమాన్ని మనం ఆశించాలి. మనము సమాజములో ఒక వ్యక్తిగా రూపొందాము. సమాజము క్షేమంగా ఉన్నప్పుడే మన వ్యక్తిత్వము క్షేమంగా ఉంటుంది. నీవు ఒక్కడే సమాజములో పుట్టలేదు. నీవు ఒక్కడే ఈ సమాజములో నిలువలేవు. కనుక నీ యిష్టానుసారము పోవుటకు వీలుకాదు. సమాజము యొక్క ధర్మమును అనుసరించనప్పుడు నీవు అరణ్యములో పోయి కూర్చో. ఇక్కడెందుకున్నావు. కనుక మనం సొసైటికి తగినట్లుగా నడచుకోవాలి. సమాజ ధర్మమును మన ప్రాణసమానంగా భావించుకోవాలి. కానీ ఈనాటి యువకులందు ఈ పవిత్రమైన భావములు ఏమాత్రము కనిపించటంలేదు. ఇది నా యిష్టము. నా స్వేచ్ఛ కొలది నేను పోతాను. ఎవరు అడిగేవారు అంటారు. ఎవ్వరూ అడుగరుకానీ అడగవలసిన వారే అడుగుతారు. ఎవరెరుగకున్న ఈశ్వరుండెరుగడా? నీవు చేసేవి, నీవు ఆడేవి, ఎవరికైనా తెలియకుండా ఉండవచ్చుకానీ భగవంతునికి తెలియకుండాపోవు. అతనే నిన్ను దోషిగా నిలబెడతాడు. అలాంటి పనిష్మెంటు రాక పూర్వమే సరైన

మార్గములో ప్రవేశించాలి. ఏమిటి స్వేచ్ఛ అంటే? ఇష్టప్రకారము కుక్కలు తిరిగినట్లు తిరగటమా? కాదు, కాదు స్వేచ్ఛ అనగా స్వ+యిచ్ఛ, ఆత్మ యిచ్ఛయే స్వేచ్ఛ. భగవద్గీతయందు స్వధర్మము పరధర్మమని రెండూ చెప్పాడు. స్వధర్మమంటే ఏమిటి? పరధర్మమంటే ఏమిటి? స్వధర్మము ఈశ్వరధర్మము. పరధర్మమనగా దేహధర్మము. దేహధర్మము కోసంకాదు నీవు వచ్చిఉండేది. స్వధర్మమును ఆత్మధర్మమును నీవు అనుసరించు. నీ Conscienceను నీవు అనుసరించు, అప్పుడే నీ స్వధర్మము సార్థకమవుతుంది. కానీ ఈనాడు స్వధర్మమంటే ''నేను క్షత్రియుడను, నేను బ్రాహ్మణుడను, వైశ్యుడను, శూద్రుడను ఈ ధర్మమును నేను అనుసరించాలి'' అని భావిస్తున్నారు. ఇవి వర్ణధర్మాలు కానీ స్వధర్మాలు కావు. స్వధర్మము అన్నాడుగానీ వర్ణాశ్రమధర్మాలు అనలేదే? కనుక మనము ఈనాడు అనుసరించవలసినది ఆత్మధర్మమే.

***నవవిధభక్తులు:***

ఈశ్వరాపేక్షకు అనుగుణంగా మన జీవితమును నడిపించుకోవాలి. ఈశ్వరానుగ్రహము పొందే నిమిత్తమై ఈ శరీరము నందించాడు. ఈ శరీరమును మొట్టమొదట సార్థకము గావించుకోవాలి. ఈ దేహాన్ని మనము సరైన మార్గములో ప్రవేశపెట్టాలి. సర్వధర్మములు దేహరీతిగానే జరిపించాలి. దేహమే లేక ఏ కర్మలూ మనం ఆచరించలేము. జపము చేసినా, యోగము చేసినా, యాగముచేసినా దేహముతోనే చేయాలి. నవవిధభక్తులు దేహమునకు సంబంధించినవే.

*శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం*
*వందనం అర్చనం దాస్యం స్నేహమాత్మనివేదనం*

ఈ నవవిధ సాధనలను శరీరముతోనే మనం ఆచరించాలి. ఈ శరీరముతో ఆచరించిన తరువాత మిగిలినది ఏది? అదియే సాక్షీభూతమైనది.

దీనికి ఎట్టి సాధనలూ అక్కరలేదు. ఈ శరీరాభిమానాన్ని కొంతవరకు పోగొట్టుకొనే వరకు మాత్రమే ఈ సాధనలు మనకవసరము ఈ కలియుగమందు 99 భాగములంతా దేహాభిమానముతోనే జీవిస్తున్నారు. కానీ ఆత్మాభిమానముతో జీవించటం లేదు ఆత్మాభిమానం మనం కొంతవరకు సాధించాలి. ఈ దేహమంటే ఏమటి? దేహము స్వతః సిద్ధముగావచ్చినదా? ఈ దేహములో మరెవరైనా ఉన్నారా? ఎవరూ నివసించేవారు లేకపోతే ఇల్లు ఎందుకు కట్టుకుంటాం మనం? ఒక్కతూరి చూడండి, సామాన్యంగా చదువుకున్నవాడుగానీ, చదువులేనివాడు గానీ ఒక పెద్ద భవనమును చూస్తే వీడెవరో శ్రీమంతుడు అని అనుకుంటాడు. ఒక గుడిసె చూస్తే వీడు ఒక సామాన్య మానవుడని అనుకుంటాడు. ఇల్లును చూసి వాని గొప్పతనము, చిన్నతనము మనము నిర్ణయిస్తున్నాము. మానవదేహము మహాపవిత్రమైనది. ''జంతూనాం నరజన్మ దుర్లభమ్''. మానవశరీరము చాలా దుర్లభమైనది. ఇలాంటి మానవత్వము ఎంత గొప్పది! దేనివల్ల గొప్పది? ఇందులో ఆత్మ అనే దేవుడు ఉంటున్నాడు. కనుకనే ఈ దేహమునకింత విలువ ఇచ్చారు. ఈ విలువను మనం సార్థకం చేసుకోవాలి. కానీ మానవత్వం ఈనాడు దేహాభిమానమును వదలటంలేదు. కరెంటు లేని వైరు, నీరులేని పైరు, అధ్యాపకుడు లేని బడి ఉండి ప్రయోజనమేమిటి? దేవుడులేని గుడిలో ఎవరైనా పూజలుచేస్తారా? పంతులు లేని బడిలో పిల్లలు కూర్చుంటారా? లేదు, కాబట్టి ఇక్కడ దేవుడున్న గుడి కాబట్టే అందరు ప్రేమిస్తున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్కపేరుతో ఆరాధిస్తూ వస్తున్నారు. ''ఏకం సత్ విప్రాః బహుధా వదంతి''. ఉన్న ఒకే యజమానిని కోడలు వచ్చి ''మామగారూ'' అని, కుమారుడు వచ్చి ''తండ్రిగారూ'' అని, భార్య వచ్చి ''ఏమండీ'' అని పిలుస్తుంది. మనుమడు వచ్చి ''తాతగారూ'' అని పిలుస్తాడు. వీరందరూ వివిధ నామములతో పిలుస్తున్నారేకాని ఉన్న వ్యక్తి ఒక్కడే.

ఒక్కొక్కరు వారివారి సంబంధాన్ని పురస్కరించుకొని జ్ఞానులు, యోగులు, భక్తులు, సాధకులు, ఒక్కొక్కపేరుతో ఆరాధనలు సల్పుతూ వస్తున్నారు. ఒకరు ''ఆత్మ'' అని పిలుస్తారు. ఒకరు ''జ్యోతి స్వరూపుడా!'' అని పిలుస్తారు. ఈవిధంగా ఒక్కొక్కరి భావమును పురస్కరించుకొని భగవంతుడావిధంగా వారికి దర్శనమిస్తుంటాడు. భగవంతునికి ఎట్టి రూపమూ లేదు. నామరూపరహితుడు. భక్తుల మిమిత్తమే నామరూపములు ధరిస్తున్నాడు. అన్నింటి యందున్నది ఒకే దివ్యత్వము. చాల మంది పిల్లలకు తెలుసు చక్కెరతో బొమ్మలు చేసి బజార్లో అమ్ముతుంటారు. కొన్ని ఒంటెలు చేస్తారు, కొన్ని ఏనుగులు చేస్తారు. ఏనుగు ఒక అణా, ఒంటె ఒక అణా అని ఈవిధంగా అమ్ముతుంటారు. అంతా ఒక వెలయే. చూపించేది ఏనుగు, ఉన్నది చక్కెర విలువ మనము యిచ్చేది చక్కెర కోసమేగాని ఏనుగు రూపానికి కాదు. దీనికి ఒక చిన్న కథ ఉంటున్నది. ఒక పరమభక్తుడైన శ్రీమంతుడు 20 తులాలు పెట్టి కృష్ణ విగ్రహము చేయించుకున్నాడు. ఇంకొక 20 తులాలుపెట్టి గోవును చేయించుకున్నాడు. ఇంకొక 20 తులాలు పెట్టి నెమలిని చేయించుకున్నాడు. ఇంకొక 20 తులాలతో కప్పులు, ప్లేట్లు చేయించుకున్నాడు. పూజచేస్తూవచ్చాడు. కాని భగవంతుడు మధ్యమధ్య కొన్ని పరీక్షలు పెడుతుంటాడు. ఇతడు దరిద్రుడుగా రూపొందాడు. ఈ విగ్రహములను మరొక శ్రీమంతునికి అమ్ముటకు వెళ్ళాడు. కృష్ణుణ్ణి తూకము వేశాడు. ఇది 20 తులాలు దీని వెల ఇంత. గోవును తూకము వేశాడు. దీనివెల ఇంత. నెమలిని తూకము వేసి దీని వెల ఇంత. అన్నింటి వెల సమానంగానే వేశాడు. పూజిస్తూఉన్న సాధకుడు, ఏమయ్యా! నెమలికి ఒకే విలువ; కృష్ణునికి ఒకే విలువ; ఎంత అన్యాయమిది అన్నాడు. ''అయ్యా! నేను కృష్ణునికి కాదు విలువ ఇచ్చేది. నెమలికి కాదు ఇచ్చేది విలువ. తూకమునకు ఇస్తున్నాను''. అదేవిధంగా నీవు ఎలాంటి వాడైనా నీ భక్తికి విలువ

ఉంటుంది. నేను శ్రీమంతుడనని, విద్యావంతుడనని, మేధావినని గర్వించుటకు వీలులేదు నీ తెలివితేటలు నీ దగ్గరుంచుకోవచ్చు. నీవు చేసిన పనికి విలువ యిస్తున్నారు. అదేవిధముగా భగవంతుడు మనం చేసే సాధనలకే విలువ ఇస్తుంటాడు. ఈ విధమైన సత్యము ప్రతిమానవుడు గుర్తించుటకు ప్రయత్నించాలి. మొట్టమొదట దేహం యొక్క విలువ గుర్తించడానికి ప్రయత్నించాలి. దేహానికి ఉన్న విలువ చక్కగా గుర్తించుకుంటే యింద్రియములను సులభముగా గుర్తించుటకు వీలవుతుంది.

**దేహము వేరు, నీవు వేరు:**

అనేక పర్యాయములు పిల్లలకు చెబుతూ ఉంటాను. మనము యోచన చేస్తున్నాము. ఇది నాచెయ్యి, నాకాలు, ఇది నాతల, ఇది నాకడుపు, నాచేయి, నాతల మరి నేనెవరు అని ప్రశ్నించుకోవాలి? నేనెవరో మీకు తెలియటం లేదు నేనెవరో తెలియనప్పుడు నీచెయ్యి అని ఎట్లాతెలిసింది? నేను అనేది ఈ దేహానికి సెపరేట్‌గా ఉంటుంది. ఇది నా కర్చీఫ్ అన్నప్పుడు కర్చీఫ్ నా నుండీ వేరుగా ఉంది కదా! అదేరీతిగా ''నా దేహము'' అనుకున్నప్పుడు దేహము నీ కంటె ప్రత్యేకమైనది. నీవు దేహము కాదు. అక్కడే చిన్న విషయములోనే ప్రత్యక్షంగా అర్థమౌతున్నది. విద్యార్థులు చక్కగా గుర్తించవలసిన విషయము. 'బాయ్ ఎపుడు వచ్చావంటే? నిన్న సాయంకాలము వచ్చాను' అంటాడు. దేహమే నేను అనుకొని సాయంకాలము వచ్చానంటున్నావు. కానీ, కడుపు నొప్పి వస్తే; నా కడుపు నొప్పి అంటున్నావు. అక్కడ నీకు, కడుపునొప్పికి వ్యత్యాసమైపోయింది. నిన్న వచ్చింది దేహమా నీవు? ఈనాడు పడే కడుపు నొప్పా నీవు?. ఇదేవిధముగా మానవుని జీవితము లోపల నిత్యము దేహాభిమానములు వస్తుంటుంది. తాను దేహమా లేక మనసా? మనసా లేక యింద్రియములా? నిర్ణయము చేసుకోలేక పోతున్నాడు మానవుడు. మొట్టమొదట దేహము

మన ఉపాధి అని గుర్తించాలి. మన జీవితమునకు కావలసిన సౌకర్యము చేసుకొనే నిమిత్తమే దేహము మనకు ప్రాప్తించింది. ఏమిటి దేహమునకు అనుకూలములు. 'భిక్షాన్నం దేహరక్షార్థం, వస్త్రం శీత నివారణం' దీనికోసమే దేహము పని చేయాలి. తట్టలోని పదార్థము పొట్టలోకి చేరాలంటే చేతికి నోటికి పని పెట్టాలి కదా! చేయి, నోరు నీ దేహమే. ఈవిధంగా దేహముతోనే పొట్టను నింపు కోగల్గుతున్నావు. కనుక ప్రతిదానికి స్వప్రయత్నంతోనే జీవితమును గడపు నిమిత్తము వచ్చినావు. ఇంతటితో కాకుండా దైవ కార్యములోపల నీవు దేహమును ప్రవేశపెట్టాలి. కనుక మనము చేసే కర్మలన్నియు జన్మసార్థకము గావించుకొనే నిమిత్తమై, దేహాభిమానము దూరము చేసుకొనే నిమిత్తమై దైవాభిమానము పెంచుకొనే నిమిత్తమై ఆచరించే సత్కార్మలుగా విశ్వసించాలి.

**అంతర్మథనంతో జ్ఞానాగ్ని:**

ఈనాడు మీకు తెలుసు, యజ్ఞము ప్రారంభించక పూర్వము రెండు కట్టెలచేత చిలికి 'అగ్నిని' సృష్టించారు. ప్రాకృతమైన అగ్నిచే యజ్ఞము ప్రారంభించాలి. కృత్రిమమైన అగ్నికాదు. తిలలయందున తైలము ఎట్లా ఉంటున్నదో; పూలయందు వాసన ఏవిధంగా ఉంటున్నదో; ఫలమునందు ఏవిధంగా రసము ఉంటున్నదో కట్టెయందు ఆవిధముగా అగ్ని ఉంటున్నది. అయితే ఒక కట్టెతో అగ్ని లభ్యము కాదు. ఒక కట్టెకు మరొక కట్టె రాపిడి చేయాలి. దేహము, మనస్సు రెండింటినీ మథనం చేసినప్పుడే జ్ఞానాగ్ని మనకు లభ్యమవుతుంది. మనలో జ్ఞానాగ్ని రావాలంటే దేహముతో పాటు మనస్సు అంకితము చేయించాలి. అంతవరకు మీరు పోనక్కర లేదు. కరెంటు తో లైట్లు వెలుగుతున్నాయి. బల్బులు నెగటివ్‌లు లోపల ప్రసరించేది పాజిటివ్; ఈ పాజిటివ్, నెగటివ్ రెండూ ఏకమైనప్పుడు మనకు లైట్లు వస్తున్నవి. అదేవిధంగా మనయందు అంతర్భూతమైన

దివ్యశక్తి అనే పాజిటివ్ ఉంటున్నది. ఈ పాజిటివ్ వలన కన్నులు చూడగల్గుతున్నాయి, చెవులు వినగల్గుతున్నాయి, నోరు మాట్లాడగల్గుతున్నది, చేతులు పనిచేయగల్గుతున్నాయి అన్నింటికి మూల కారణము లోపలనున్న దివ్యశక్తియే. ఆ దివ్యశక్తియే అందులో లేకపోతే కన్ను చూడలేదు, చెవి వినలేదు. చూచే కన్నులు, వినే చెవులు, తలచే మనస్సు, నడిచే దేహము అంతా దివ్యశక్తి యొక్క ప్రభావమే. కారు ఉంది. స్విచ్ వేసి స్టార్ట్ చేస్తాము. స్విచ్ వేసి లైటు వేస్తాము. హారన్ వేసి ఎవరైనా ముందు ఉంటే పొమ్మంటాము. ఇవన్నీ బ్యాటరీ ద్వారానే జరుగుతున్నవి ఆ బ్యాటరీ లేక లైట్లు వెలగవు. హారన్ ఇవ్వదు. కారు నడువదు. అట్లే మన దేహమనే ఈ కారుకు ఒక బ్యాటరీ ఉంటున్నది. అదే దివ్యమైన శక్తి. అది ఉండటంచేత సర్వాంగములు పనిచేయగల్గుతున్నాయి. లేకపోతే ఒక్క అంగము పని చేయలేదు.

***అహంకారానికి మందులేదు:***

నేను చేస్తున్నానని అహంకార పడుతున్నాడు మానవుడు. దేనికీ అహంకారము? ఎక్కడదీ అహంకారము? ఈ అహంకారము పెద్ద అజ్ఞానమే. ఎవ్వరూ అజ్ఞానముతో అహంకారము పెంచుకోకూడదు. ఈ అహంకారము పెద్ద వ్యాధి. ఇంతే కాదు దీనికి ప్రక్క అసూయ అనే పెద్ద వ్యాధి ఉంటుంది. ఈ ప్రపంచంలో అన్ని రోగములు. నివారణ చేయుటకు మందులున్నవి గానీ ఈ అహంకారము నివారణ చేయుటకు మందు ఎక్కడా కనిపించటం లేదు. కట్టకడపటికి పతనమే సరైన మందు. పతనమైన తరువాత కండ్లు తెరచి చూస్తాడు. అప్పుడు చూచి ప్రయోజనమేమిటి? ఈవిధంగా మానవుడు అహంకారముచేత, అజ్ఞానముచేత, అమాయకత్వముచేత, తన దివ్యత్వమును తాను గుర్తించుకోలేక పోతున్నాడు. దేహాభిమానమే దీనికి మూలకారణము.

దేహాభిమానము ఉండవలసిందేకాని, ఎంతవరకో అంతవరకే మితిమీరి దేహాభిమానం పెంచుకోకూడదు. మన ఆకలికి అన్నం కావాలి. అయితే ఎంత ఆకలో అంత ఆహారమే మనం భుజించాలి. అమిత తిండి అతిహాని, ఎక్కువ తింటే మనకే బాధ. మిత తిండి అతిహాయి. ప్రతి దానికి మితము ఉంటున్నది. "నశ్రేయోనియమంవినా" అన్నారు. ఈనాడు నియమనిష్ఠలు ఏ మాత్రము లేవు. ప్రాచీనులు నియమించిన నియమములను గాలికి వదిలారు. ప్రాచీనుల సాంప్రదాయములో మనం నడుచుకోవాలి. ఆనాటి వారికి ఏ విద్యలు లేవు. ఈనాటి విద్యలు పెద్ద పెద్ద డిగ్రీలుగా ఉంటున్నాయి. ఆనాడు నిశ్చల చిత్తముతో నిర్మల భావముతో నిస్స్వార్థభావము తో ''నారాయణ'' అని పలికేవారు. ఈ ప్యూరిటీ మనలో ప్రవేశించాలి. చలించని మనస్సును, భ్రమించని దృష్టిని మనం అభివృద్ధిచేసుకోవాలి. అప్పుడే తగిన శాంతి మనకు లభ్యమవుతుంది. అందరూ ఈనాడు ప్రపంచములో శాంతి, శాంతి, శాంతి అంటున్నారు. పెద్దపెద్ద కోటీశ్వరులకు కూడా శాంతి కావాలి. నిజంగా కొనుక్కొనేటట్లుగా ఉంటే డబ్బుపెట్టి కొనుక్కోవచ్చు కదా! కానీ, ఇది కొనేది కాదు. ఫ్రెండ్స్ గిఫ్ట్ ఇచ్చేది కాదు. అమెరికన్స్, రష్యన్స్ చంద్రమండలమునకు పోతున్నారు.

*హస్తమున అణుబాంబు ఉంచుక*<br>
*అరచుచుందురు శాంతి శాంతి యని*<br>
*చంద్రుచేరగలిగి కూడను*<br>
*చెందజాలరు శాంతి సుఖములు*

చంద్రుని దగ్గరకు పోతేనేమి? చీమ దగ్గరకు పోతే ఏమి? రెండు ఒక్కటే. శాంతి లేని వాడు ఎక్కడ ఉండి ఏమి ప్రయోజనం? శాంతి గల వానికి సర్వము శాంతి మయమే. కనుక శాంతి, శాంతి, శాంతి అని మూడుపర్యాయములు చెబుతూవచ్చారు. దేహశాంతి, మనోశాంతి,

ఆత్మశాంతి అధిబౌతికము, అదిదైవికము ఆధ్యాత్మికము అన్నారు. మూడింటి యందు మనకు శాంతి ఉండాలి మానసిక శాంతి ఉంది. కానీ శరీర ఆరోగ్యము లేకపోతే, మానసిక శాంతి మనకు శాంతి నిస్తుందా? లేదే! శరీరము ఆరోగ్యముగా ఉంటున్నది. తుష్టిగా సంతుష్టిగా ఉంటున్నది. కానీ మానసికంగా శాంతి లేకపోతే ఈ తుష్టి పుష్టి ఎవరికోసం? కనుక మూడింటియందు మనకు శాంతి ఉండాలి. ఆ మూడింటియందు శాంతిని అందించే వాడు భగవంతుడొక్కడే. ఈ మూడు మార్గములందు దైవమును విశ్వసించటం చాల అవసరము. కనుక ప్రాకృత పనులందుగానీ, పారమార్థిక పనులందు గానీ, దైవత్వము చాలా అవసరము. కనుక ప్రాకృత పనులందుగానీ, పారమార్థిక పనులందు గానీ, దైవత్యము చాలా అవసరము

సముద్రము ఉప్పొంగుతున్నది. అలలు ఎన్ని రకములుగానో పెరుగుతున్నాయి. అలల యొక్క రూపనామములు వివిధముగా కనిపిస్తున్నాయి. ఒక అల ఉన్నట్లు మరొక అల లేదు. అలల రూపనామములు వేరుగానీ అలలోని సముద్రజలము ఒక్కటే కదా! ప్రాతిభాసికము, పారమార్థికము, వ్యావహారికము ఈ మూడూ ఎక్కడ? సముద్రములో జలము ఒక్కటే అది పారమార్థికము. కానీ అలగా వచ్చినపుడు అది వ్యావహారికము, అలలలోని నురుగు ప్రాతిభాసికము. నురుగులోను ఉప్పే వుంది, అలలలోను ఉప్పే వుంది. సముద్రజలములోను ఉప్పే వుంది. అన్నింటియందు ఏకత్వమే. కనుక ఏకాత్మభావాన్ని మనం అనుసరించాలి. ''ఏకం సత్ విప్రాః బహుధా వదంతి'' అదే ఈనాడు మనం ఆచరించవలసినది. ఏదైవ నామమైనా పరవాలేదు. ఏ రూపమైనా పరవాలేదు. రూపనామములు ప్రధానము కాదు. అన్నింటి యందున్న దైవము ఒక్కడే.

## అందరూ దైవస్వరూపులే!

విశ్వం విష్ణు స్వరూపము. అంతా విశ్వవిరాటస్వరూపమే. ''సహస్రశీర్షాపురుషః సహస్రాక్షసహస్రపాత్''. ఇదే విశ్వస్వరూపము. ఆనాడు విప్రులు ఈ వేదమును అభ్యసించే సమయములో ప్రపంచమంతా చేరి మూడు కోట్లమందే ఉన్నారు. కనుక వారిని ముక్కోటి దేవతలు అన్నారు.

అనగా ఒక్కొక్కవ్యక్తి ఒక్కొక్కదైవస్వరూపమే. ఇప్పుడు 500 కోట్లపైన అయిపోయినారు. కానీ యిప్పుడు కూడా మూడుకోట్ల దేవతలనే అంటున్నాము. కాదు, కాదు ఇప్పుడు 500 కోట్ల దేవతలున్నారు. అందరు దైవస్వరూపులే. ''ఈశ్వరస్సర్వభూతానాం, ఈశావాస్యమిదం జగత్'' అంతా ఈశ్వరుడే. ఈ సత్యాన్ని గట్టిగా మనము విశ్వసించి అందరిని దైవస్వరూపులుగా భావించాలి.

పరుల తిట్టినంత పాపఫలంబబ్బు<br>
విడువదెన్నటికి విశ్వమందు<br>
పరులు పరులు కాదు పరమాత్మ అగునయా!

పరుడనుకొని మనము తిడుతున్నాము. కనుక ఎవరినీ మనం దూషించ కూడదు. ఎవరిని హాస్యాస్పదము చేయకూడదు. అందువల్లనే వేదము నందు ''సర్వ జీవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి'' అన్నారు. ఎవరికి నమస్కారము చేసినా కేశవునికే చెందుతుంది. ఇంతటితోనే కాదు. ''సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతిగచ్ఛతి''. భూషిస్తే భగవంతుని కెట్లా చేరుతున్నదో, దూషిస్తే అది కూడా భగవంతునికి చేరుతుంది. కనుక దూషణ, తిరస్కారములకు అవకాశము ఇవ్వకూడదు. అందరినీ దైవస్వరూపులుగా విశ్వసించాలి. ఇదియే నిజమైన ఆధ్యాత్మికము. పూజ చేస్తే కాదు ఆధ్యాత్మికము. జపము చేస్తే కాదు ఆధ్యాత్మికము. ధ్యానము చేస్తే కాదు ఆధ్యాత్మికము. కొందరు ధ్యానములో కూర్చుంటారు. దేహము కూర్చుందిగానీ మనస్సు మార్కెట్టుకి వెళ్లిపోతున్నది. ఎందుకీ

ధ్యానము? ఇలాంటి ధ్యానము బదులు ఇంట్లో పనులు చేసుకోవచ్చు కదా! జపము చేస్తుంటారు. రాం రాం రాం అని ఎప్పుడొచ్చారండీ! అంటారు. ఈ జపము బదులు ఏకాంతముగా కూర్చొని స్మరించు. యీ ధ్యానమువల్ల, జపమువల్ల, యోగమువల్ల భగవంతుడు లభ్యమవుతాడని అనుకోవటం చాల వెఱ్ఱితనము. అందరియందు దైవమున్నదనే సంకల్పము గట్టిగా ఉంటే తప్పక నీ లక్ష్యమును సాధిస్తావు.

### ప్రవృత్తి నుండి నివృత్తికి పోవాలి:

కేవలము భౌతికమైన కర్మయే ప్రధానం కాదు. ఇది ప్రాకృతమైనది. ఇది కేవలం జగత్తునకు సంబంధించినది. ఇది ప్రవృత్తి లక్షణమే! ఈ ప్రవృత్తిని ఏనాటికైనా వదలి నివృత్తిని పట్టవలసిందే. మనముచేసే సర్వసాధనలు ప్రవృత్తి లక్షణాలే అయితే ఈ ప్రవృత్తి నుండే నివృత్తికి పోవాలి. ఎప్పుడుపోయేది? దేహాభిమానము కొంత క్షీణించిన తర్వాత నివృత్తికి వెడతావు. రెండు ఒక్కటే. వర్షము కురుస్తుంది. నీటిబిందువులు పడుతుంటాయి. కానీ, మధ్య మధ్య వడగండ్ల పడతాయి. నీరు పడితే దెబ్బ తగలదు గానీ, వడగండ్లు పడితే దెబ్బ తగులుతుంది. ఈ వడగండ్లు లోనిది నీరే కదా! దీనికింత పవరు ఎట్లా వచ్చింది. ఇక్కడ అనేకత్వము ఏకమైపోయింది. అనేక నీటి బిందువులు ఏకమై పోయినాయి. కనుక దీనికింత శక్తి వచ్చింది. ఈ యూనిటీ వలననే యింత డివినిటీ బయలు దేరింది. కనుక ఐకమత్యము చాల అవసరము. ఈ యూనిటీ రావాలంటే ప్యూరిటీ అభివృద్ధి చేసుకోవాలి. తప్పక మనకు డివినిటీ వస్తుంది.

### సంసారం నిన్ను పట్టలేదు. నీవేదాన్ని పట్టావు:

ఈనాడు బాహ్యమైన దాంట్లో కాలమును వ్యర్థముచేస్తున్నామే కానీ దైవ విశ్వాసము పరిపూర్ణముగా ఎవరియందూ కనిపించుట లేదు. ఆ విశ్వాసమే ఉంటుంటే ఇలాంటి దోషములకు అవకాశమే ఉండదు. ఒక

నిముషములో ఉన్నట్టు కనిపిస్తుంది మరొక నిముషములో జారిపోతుంది. గాలిని ఏవిధంగా పట్టటానికి వీలుకాదో అదేరీతిన మనస్సు కూడా జారిపోతుంది, కారిపోతుంది, ఊడిపోతుంది. ఇంతటితోనే కాదు, పారిపోతుంది కూడా! ఇలాంటి మనస్సు ను మనము ఏరీతిగా సాధించాలి ఆనాడు అర్జునుడు కూడా ''చంచలం హి మనః కృష్ణ ప్రమాది బలవద్దృఢం'' ఎవరికి ఇది ప్రమాదము? దైవవిశ్వాసము లేని వారికి ప్రమాదము కానీ దైవవిశ్వాసమున్న వారికి ప్రమాదమే కాదు మనస్సును మనకై మనము పట్టుకొని బాధపడుతున్నాము. ఇప్పుడు ఈకత్తి చేతితో పట్టుకున్నాను. ఐదు వ్రేళ్ళతో గట్టిగా పట్టుకున్నాను బిగపట్టి ఉంటున్నాయి. బిగపట్టటంచేత వ్రేళ్ళు నొప్పిగా ఉంటాయి. విడిచిపెట్టు, నొప్పిలేదు. పట్టుకోవటంవల్ల బాధ కలుగుతున్నది. ''స్వామీ! నేను ఏమిచేసేది సంసారము నన్ను పట్టి బాధిస్తున్నది'' అంటారు. సంసారము నిన్ను పట్టలేదు; నీవే సంసారాన్ని పట్టావు. సంసారమునకు కాళ్ళు లేవు, చేతులు లేవు, ముక్కు లేదు, నోరు లేదు. అన్నీ ఉండేది నీకే. నీవే దాన్ని పట్టి పీడిస్తున్నావుగానీ అదినిన్ను పట్టి పీడించడంలేదు. కనుక సంసార బాధలు పీడిస్తున్నాయని అనుకోవటం చాల అజ్ఞానము. సంసారమునే నీవు పట్టావు. అది నిన్ను పట్టలేదు. ఇవన్నీ స్టంటు మాటలు. నీవు దానిని పట్టి వదిలించుకోలేక ఈవిధమైన అవస్థలకు గురౌతున్నావు. నిన్ను నీవు సమర్థించుకుంటున్నావు. నిన్ను నీవు సమర్థించుకోవటమే పెద్ద పాపము. పాపమంటే ఎవరినో బాధపెట్టడం కాదు. నీ తప్పులు నీవు సమర్థించుకుంటున్నావు. అదియే పెద్ద పాపము. అయితే నిన్ను నీవు నిందించుకోవటం మంచిది కాదు. నిన్ను నీవు చులకన చేసుకోవటం మంచిది కాదు. నిన్ను నీవు గొప్పగా చూసుకో.

***శాంతిని పంచండి!***

I am Aathma అదియే వేదాంతసారము. ''తత్ త్వం అసి'',

''అహం బ్రహ్మాస్మి'' ఎంత గొప్ప పలుకులు ఇవి ఇలాంటి వన్నీ మనం మరచిపోతున్నాము. అత్యవసరమయినప్పుడు మాత్రం ఉచ్చరిస్తున్నాము. ఇవి యెప్పుడూ అవసరమే. ఒక నిమిషము అవసరం వచ్చి మరో నిముషము అవసరం లేకుండా పోయేది కాదు. చిన్న ఉదాహరణ. నీవు మాట్లాడుతున్నావు, నిద్రపోతున్నావు, భోజనముచేస్తున్నావు, నడుస్తున్నావు,, ఇన్ని పనులు చేస్తున్నావుకానీ నీ ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిల్చిపోతున్నాయా? అయ్యో! పాపం! అతను నిద్రపోతున్నాడు కొంత విశ్రాంతి నిద్దామని ఆ ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆగి పోతున్నాయా? లేదు. ''సర్వదా సర్వకాలేషు సర్వత్ర హరి చింతనం'' ఒక కాలము, ఒక నియమము అక్కరలేదు. మన భావములను సర్వము దైవమయంగా మార్చుకోవాలి. ఈవిధంగా ప్రపంచమంతా మారితే జనులంతా, లోకాస్సమస్తా స్సుఖినోభవంతు అని ప్రార్థన చేయనక్కర లేదు. శాంతి గానే ఉంటారు. ఇంకెందుకు మనం శాంతిని కోరాలి. అది లేదు. కాబట్టి ఇప్పుడు కోరుతున్నాము. కోరేవానికే లేదు శాంతి. ఇంక యితరులకేమి అందించగలడు? కనుక శాంతిని మొట్టమొదట పొందాలి.

ఇంటిలో శాంతిగా ఉండి ఇంటిలోని వారికి శాంతిని పంచు. నీ ఇంటిలోని శాంతి బజార్లో పంచు. బజారులో శాంతి గ్రామంలో పంచు, గ్రామము యొక్క శాంతి టౌను కంతా పంచు. ఇలా పంచుకుంటూ పో! శాంతిని పంచితే ఏ ప్రమాదమూ లేదు. కానీ, యీనాటి మోడరన్ కాలములో ఒకనికి అశాంతి వస్తే ఇల్లంతా అశాంతి చేస్తాడు. ఇంటివారు బజార్లోవారినందరిని అశాంతి చేస్తారు. ఊరంతా అశాంతి చేస్తారు. ఇట్లు చేయడం మంచిది కాదు. అశాంతిని మీరు పంచకండి. శాంతిని పంచండి. ఒక వేళ అశాంతి వస్తే నీకు నీవే బాధపడు. నీ అశాంతిని

దూరముచేసుకో నీ అశాంతిని ఇంకొకరికి పంచకూడదు. ఇదియే పెద్దపాపము. దీనిని సరిగ్గా అర్థము చేసుకోలేక పోతున్నారు. నా అశాంతి నా భర్త కిచ్చాను. నా పిల్లల కిచ్చాను. అనుకుంటే పిల్లలు ఎవరు? భర్త ఎవరు? కట్టుకున్న తర్వాత భర్త అయినాడు. కానీ అంతకు ముందు ఆయన ఎవరు? నీవెవరు? ఇంతకు పూర్వము నీవు ఎవరు? నీ బిడ్డ ఎవరు? ఇవన్నీ మధ్యలో కదలిపోయే Passing Clouds నీ అశాంతి నీ పిల్లల కెందుకు పంచాలి? నీ అశాంతి నీ భర్తకెందుకు పంచాలి? నీ అశాంతిని నీ భార్య కెందుకు పంచాలి. అంతమాత్రము బుద్ధిలేక పోతే మనిషివెట్లవుతావు? అశాంతిని పంచనే కూడదు. పంచే వారంతా మూర్ఖులే. నిజమైన మానవుడు అశాంతిని తనలోనే ఉంచుకోవాలి. తన అశాంతిని తాను పోగొట్టుకోవాలి. శాంతి వస్తుందా నీలో తప్పక పంచు అందరికీ. ఎందు కంటే శాంతిలో ప్రమాదము లేదు. అశాంతిలోనే ప్రమాదముంది. ప్రమాదమున్న దానిని ఎవరికీ పంచకూడదు. ఈవిధంగా ప్రతిమానవుడు ఆధ్యాత్మికములో అత్యంత సులభమైన మార్గమును వెతుకుతూ పోవాలి.

### *భగవంతుడు ఆనందమయుడు:*

ఈనాటి మానవుడు తన కిష్టమైనది అయితే మంచిది అంటాడు. తనకు ఇష్టములేనిది చెడ్డది అంటాడు. ఇంతకంటే మూర్ఖుడు మరొకడు లేడు. నీకు ఇష్టము అయిష్టము ఉండవచ్చు. కానీ భగవత్ సృష్టిలో యిష్టము కానిది ఒక్కటీ లేదు. నీకు మలేరియా జ్వరము వచ్చినపుడు లడ్డు యిచ్చినా చేదుగా ఉంది అంటావు. లడ్డులో చేదు లేదు. నీ నాలుకలో ఉంటున్నది చేదు. నీలో నున్న చెడ్డ నీవు చూసుకోకుండా బయట వారిలో ఉందనుకోవటం ఎంత మూర్ఖత్వము! ఇలాంటివారినే పూర్వకాలము రాక్షసులన్నారు. ఈనాడు మంచి డ్రస్సు వేసుకొని స్టూడెంట్సుగా

ఉండవచ్చుగానీ వీరిలో కూడా అనేక మంది రాక్షసులుండవచ్చు. ఈ గుణములు మనలో రాకూడదు. మానవునియందు రాక్షసత్వం, మనుష్యత్వం, దైవత్వం ఉంటున్నాయి. రాక్షసత్వము నుండి మానవత్వమునకు, మానవత్వము నుండి దైవత్వమునకు పోవాలిగానీ తిరిగి రాక్షసత్వమునకు ఎందుకు పోవాలి? రివర్సు రాకూడదు. ఫస్టుగేర్‌లోనే పోవాలి, టాప్ లెవల్ కు పోవాలి. అదే నిజమైన ఆనందము. ఆ ఆనందమునకు మించిన ఆనందము మరొకటిలేదు. దానినే మహనీయులందరు చెప్పారు.

*బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం*
*ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాది లక్ష్యమ్*
*ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షి భూతం*
*భావాతీతం త్రిగుణ రహితం...*

ఉన్నది ఒక్కటే. ఇన్ని వర్ణనలు చేస్తూ వచ్చారు. మనకు అద్వైతానందము కావాలి. రెండు కాదు, ఒక్కటి కావాలి. అందువల్లనే ''ఏకం సత్ విప్రాః బహుధా వదంతి''. ''ఏకమేవ అద్వితీయం బ్రహ్మ'' అన్నారు. బ్రహ్మ వొకటి అని చెప్పవచ్చు కదా. రెండు కాదు అని కూడా ఎందుకు చెప్పాలి? సత్యాన్ని గట్టిగా చెప్పేందుకే ఈవిధంగా చెప్పారు. ఉన్నది ఒకటే ఒకటి. ఈ విధమైన అద్వైతానందము మనకు కావాలి.

***ఈ దసరా యజ్ఞం విశ్వశాంతికే :***

ప్రేమ స్వరూపులారా! వేదపురుష సప్తాహజ్ఞాన యజ్ఞమని దేశ సంక్షేమ నిమిత్తమై, విశ్వానంద నిమిత్తమై, విశ్వశాంతి నిమిత్తమై మనం ప్రారంభించాము. ఈ విశ్వశాంతి నిమిత్తమై ప్రతి వ్యక్తి ఒక్కొక్క భాగాన్ని వహించాలి. మీకు వేదములు అర్థము కాకపోయినా వేదమును శ్రవణం చేస్తే చాలు. దానిలో Divine Vibration ఉంటున్నది. వేదము ఒక

నాదము. ఆ నాదములో ఉంటున్నది ఆనందము. ఒక పిల్లవాడు ఏడుస్తున్నాడనుకోండి! తట్టను తీసుకొని యిట్లా కొడితే వాడు ఆనందిస్తాడు. ఆ సౌండులోని అర్థము పిల్లవానికి తెలిసిందా? ఆ శబ్దములోనే ఉంటున్నది ఆనందము. భగవంతుని మొట్టమొదట శబ్దబ్రహ్మమయి అన్నారు ఆ శబ్దము సర్వత్రా వ్యాపించింది. కాబట్టి చరాచరమయి అన్నారు అదియే జ్యోతిర్మయి, అదే వాఙ్మయి, అదే నిత్యానందమయి, అదే పరాత్పరమయి, అదే మాయామయి, అదే శ్రీమయి అష్టైశ్వర్య స్వరూపుడు భగవంతుడు.

చూడండి టవలు నేను వదిలితే క్రింద పడుతుంది. టవలు దేనితో చేశారు? కాటన్ తో చేశారు. కాటన్ తీసి ఎగురవేయి. పైకి ఎగరిపోతుంది. కనుక ఎవరు పైకి పోయేవారు? **Light** గా ఉన్నవారు పైకి పోతారు. అందువల్లనే **Less Luggage more comfort make travel a pleasure** మీ జీవిత ప్రయాణములో ఈ భారమును ఎక్కువ చేసుకోకండి. లగేజి తగ్గించుకున్నప్పుడే పైకి పోతావు. మనం లగేజి తగ్గించుకుంటూ పోవాలి. కోరికలుండవలసిందే మానవునికి. అవి లేకుండా బ్రతకటానికి వీలు లేదు. అయితే ఎంత అవసరమో అంత ఉండాలి. లిమిట్‌కి మితిమీరి పోతే చాల భారమై పోతుంది. పరీక్ష వ్రాయటానికి వెళ్ళేటప్పుడు రెండు పెన్నులు పెట్టుకో, ఇంకా ఒకటి కావాలంటే మూడు పెన్నులు పెట్టుకో జేబంతా పెన్నులు పెట్టుకుపోతే ఏమన్నా అర్థముందా! నిజంగా వ్రాసేవానికి యిన్ని పెన్నులు అక్కరలేదు. మన ఆశలకు అంతు ఉంటుండాలి. ఈ ఆశలను అరికట్టుకుంటే ఎంతైనా బాగుపడుతావు. అయితే ఈ ఆశలు గానీ, యీ పిచ్చి బుద్ధులు గానీ అపవిత్ర భావములు గానీ రావటానికి కొంతవరకు తల్లిదండ్రులే కారణము. వారి కర్మఫలితము వలన ఇలాంటి పిల్లలు పుడుతుంటారు. ముందు నీలో దోషం లేకుండా చూచుకో అంతే చాలు. తప్పక భగవంతుడు తన అనుగ్రహముచేత నిన్ను పవిత్రుని గావిస్తాడు.

ఈ ఏడు దినములు శరీర, ఇంద్రియ మనస్సు, బుద్ధి, లక్షణములు చెప్పి తదుపరి ఆత్మతత్త్వాన్ని కూడా చక్కగా బోధిస్తాను. ఇవన్నీ ఉపాధులు. ఈ ఉపాధుల స్థితిగతులు మీరు కనుక్కున్నప్పుడే ఈ పరిస్థితి బాగు పడుతుంది. ఈ భావాలను మీ హృదయాలకు చేర్చుకొని, ఏ ఒకటి రెండు వదలినా, ముఖ్యమైన వాటిని ప్రాణసమానంగా పెట్టుకొని జీవితములో ఆదర్శముగా అనుభవిస్తూ రావాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

తేది : 5.10.97 సాయికుల్వంత్ హాల్



శ్రీ

# ఇంద్రియ నిగ్రహంతో భగవదనుగ్రహం

*త్యజ దుర్జన సంసర్గం భజసాధు సమాగమం*
*కురు పుణ్యమహోరాత్రం స్మరనిత్యమనిత్యతామ్*

ప్రేమ స్వరూపులారా!

దృశ్యకల్పితమైన ఈ జగత్తునందు కనిపించు ప్రతి ప్రాణి ఇంద్రియ భోగములనాశించి, ఇంద్రియ సుఖము నపేక్షించి జీవించుటకు ప్రయత్నిస్తున్నారు. కానీ ఈ ఇంద్రియ సుఖము ఎక్కడ నుండి ఆవిర్భవించుచున్నదనే విషయాన్ని వారు గుర్తించు కోలేకపోతున్నారు. సమస్త ఇంద్రియ సుఖములకు పుట్టినిల్లు దుఃఖమే. పుట్టుక స్థానము ఎట్టిదో దాని పూర్వాపరాధము అట్టిదే ఉంటుంది. దుఃఖమునందు పుట్టి సుఖమును తాను ఏ రీతిగా పొందగలడు? 'అనిత్యం అ సుఖం లోకం ఇమం ప్రాప్య భజస్వమామ్' ఈ జగత్తునందు కనుపించునదంతయు అనిత్యం అ సుఖం. కనుక ఈ సత్యమును మానవుడు గుర్తిస్తేపవిత్రమైన స్థితిని పొందగలడు. తన పుట్టుక స్థానము తాను

గుర్తించుకోలేక పోతున్నాడు. ఎక్కడి నుంచి వచ్చాను? ఎక్కడ నిల్చాను? ఎక్కడకు వెడుతున్నాను? అనే మూడు రహస్యములను గుర్తించుకుంటే మానవ జీవితము సార్థక మవుతుంది.

## ఇంద్రియములను సద్వినియోగం చేయాలి:

ఇంద్రియములకు 'మాత్ర' అని పేరు. 'మీయేతే ఇతి మాత్రః' అని. ఇంద్రియములు, మాత్రలు కొలతలు వేయబడేటువంటివి. కొలతలువేయునని ఇంద్రియములే. ఎట్లా? పప్పుకు తగిన ఉప్పు లేదు అని దీనికి తగిన కొలతలు వేసి చెప్పునది నాలుక. మనిషి చాలా అందముగా ఉంటున్నాడు కానీ ముక్కు చాలా చిన్నది అని కొలతవేసి చెబుతుంది కన్ను. ఈ విధంగా మంచి చెడ్డలనుగుర్తించి ఉచ్చరించునవి యీ ఇంద్రియములు. మాత్రకు మరొక విశిష్టత ఉంటున్నది. ఒక పరిమితములో దీనిని ఉపయోగించు కోవాలి. భగవంతుడుప్రసాదించిన ఈ ఇంద్రియములను పరిమితముగా ఉపయోగించికోవాలి. పరిమితమునకు మించినప్పుడు భగవదాజ్ఞ ఉల్లంఘించిన వాడగుటయే కాక దీని వల్ల అనే కష్టములకు, నష్టములకు, రోగములకు గురికావలసి వస్తుంది. భగవంతుడు ఏ నిమిత్తమై ఏ ఇంద్రియములను ప్రసాదించాడో ఆ ఇంద్రియములను ఆ నిమిత్తమై సక్రమమైన మార్గములో ప్రవేశపెట్టి అనుభవించటానికి ప్రయత్నించాలి.

ఉదాహరణకు ముక్కును తీసికోండి. శ్వాసను తీసుకోవటం కోసమని శ్వాసను వదలటం కోసమని, సుగంధమును తీసికోవటం కోసమని, దుర్గంధమును విసర్జించుట కని ముక్కును ప్రసాదించాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు స్వీకరించి తద్వారా తన ప్రాణములు నిలబెట్టుకొనే నిమిత్తమై నాసికను అందించాడు. అంతేకాక రుచులను చూచి అనుభవించే నిమిత్తమై నాలుక నందించాడు. ఈ విధమైన ఇంద్రియములను మనము దుర్వినియోగ

పరచుకొనుటకు ప్రయత్నిస్తున్నాము. శ్వాసను తీసుకోవటం, శ్వాసను వదలటం. దీని ద్వారా అనేక ఆధ్యాత్మిక ప్రబోధలందిస్తూ ఉన్నాడు. 'సోఽహమ్.' ఇదే అద్వైత మార్గ ప్రబోధ. దీనినే 'హంస గాయత్రి' అని చెబుతూ వచ్చారు. 'సోఽహమ్'. నేనే దైవము అని అంతరార్థము. ఇట్టి భావాన్ని అర్థము చేసుకొని వర్తించమని గుర్తించుకునే నిమిత్తమై ఈ నాసికనందించాడు. కానీ భౌతికమైన ప్రవర్తనలకు లోబడి, భౌతికమైన విషయ వాసనలకు లోబడి ఈ పవిత్రమైన మంత్రమును ప్రబోధింప చేసే నాసికయందు నశ్యము వేసుకుంటే నాసిక ఏమైపోతుంది? ఈ నశ్యము వేసుకోవటం వలన ఉచ్ఛ్వాస నిశ్వాసములు కొంత అడ్డుపడిపోతాయి. తద్వారా పవిత్ర మంత్రమునకుపయోగించే నాసికకు అపవిత్ర మార్గమును ప్రవేశించినట్లవుతుంది. నశ్యము ద్వారా ఊపిరితిత్తులకు కొంత వరకు అడ్డుపడిపోతాయి ఇస్నోఫీలియా, ఆస్త్మా అనేరోగములు కూడా ప్రారంభమవుతాయి. భగవంతుడు ఏ నిమిత్తమై అందించాడో ఆ ఇంద్రియములను విరుద్ధమైన మార్గములో వినియోగపెట్టటం చేత దీనికి తగిన పనిష్మెంటు ఈ వ్యాధియే.

**నాలుక :**

నాలుక నందించింది దేని కోసమని. అందుకోసమే నాలుకను ఎన్నో విధముల వర్ణిస్తూ వచ్చాడు జయదేవుడు.

*జిహ్వేరసజ్ఞే మధుర ప్రియే త్వం సత్యం హితం త్వాం పరమం వదామి*
*ఆవరణ మేధా మధురాక్షరాణి గోవింద దామోదర మాధవేతి.*

ఓ పవిత్రమైన నాలుకా! రుచి ఎరిగిన నాలుకా! గౌరవ మర్యాదలు తెలిసిన నాలుకా! వినయ విధేయతలు పాటించిన నాలుకా! నీవు నిరంతరం గోవింద దామోదర మాధవ అనే నామమును స్మరించే నాలుకా నీవు ఎందుకీ

పెడమార్గము పడుతున్నావు? అట్టి నాలుకతో మనము సత్యమైన పలుకులు పలకాలి. సత్యవాక్కును అనుసరించాలి. పరుల హృదయమును బాధించని పలుకులనుపలకాలి. మధురమైన పదార్థములు భుజించాలి. మత్తు పదార్థములుగానీ, మాంస భక్షణముగానీ, ధూమపానముగానీ' ఇత్యాది దుర్వ్యసనములకు గురయ్యే పదార్థములు దీనిపై ఉంచకూడదు. ఇత్యాది దురభ్యాసములకు లోను కావటంచేత నీ కీర్తిని నీవు కోల్పోతున్నావు. మాంసము, మద్యపానము, ధూమపానము ఈ మూడు మానవునకుచాలా విరోధియైన చర్యలను చేకూరుస్తుంది. తద్వారా అనారోగ్యమేర్పడుతుంది. మత్తుగా ఉండటంచే తన BRAIN చెడిపోతుంది. ఈ విధముగా తెలివితేటలను కోల్పోయిన తరువాత మానవుడు బ్రతికి ప్రయోజన మేమిటి? కనుక ఓ నాలుకా! ఏ నిమిత్తమై భగవంతుడు అందించాడో దానిని సరైన మార్గములో ప్రవేశపెట్టుకో.

'మాత్ర' అనే దానికి 'పరిమితమైన పద్ధతి' అని అర్థము. ఏది వినవలెనో దానిని మాత్రమే వినాలి మనము. వినవలసిన దానిని విస్మరించి వినని దానిని విశ్వసించి ఈ శ్రవణమును నాశనము చేసుకుంటున్నావు. సూరదాసు చెప్పాడు.

*చెవులుండి చెవుటులై అతిమనోహరమైన*
*నీగాన మాలింప నేరరైరి*
*కన్నులుండి గ్రుడ్డులై కళ్యాణకరమైన*
*నీరూపు దర్శింపనేరరైరి.*

కన్నులెందుకిచ్చాడు భగవంతుడు? అడ్డము వచ్చిన వానిని చూడటం కోసమనా. కాదు కాదు. మంచిని చూసే కోసమని. పురందరదాసు కూడా చెప్పాడు.

కన్నులేలరా రాముని చూడని కన్నులేలరా?

ఎందుకీ కన్నులుండాలి? భగవంతుని చూడని ఎందుకీ కన్నులుంటున్నాయి పత్తికాయలవలె. బజార్లోపోయే వ్యక్తులనందరిని చూడటం కోసమా! కాదు కాదు. బజార్లో గైడు పోస్టరును సినిమా. వాల్ పోస్టరులను చూడటం కోసమనా! కాదు కాదు. నీవు రోడ్డుపై నడుస్తున్నావు కనుక రోడ్డును చూడు మొదట. నీవునీ పవిత్ర నేత్రములను అపవిత్ర మార్గములో ప్రవేశపెట్టటంచేత ప్రమాదమునకు గురైపోతున్నావు. చూడు! రోడ్డుపై సైకిలుపై పోతున్నావు. wall poster ను నీవు చూచుకుంటూ పోతే ఏ కారో, రిక్షానోవచ్చి నిన్ను కొట్టి నీకు ప్రమాదం కలిగిస్తుంది. నీవు రోడ్డు చూడాలి గానీ మిగతా విషయములను ఏ మాత్రము గుర్తించరాదు. అప్పుడే నీకు క్షేమము, ఆనందము కలుగుతుంది.

### ఇంద్రియలోలత్వంలో దుఃఖము

ఇంద్రియముల ప్రమాణములు, ఇంద్రియముల యొక్క విలువ ఇంద్రియముల విశిష్టత గుర్తించుకొనుటకు ప్రయత్నించాలి. ఈ ప్రపంచములో ఒక్కొక్క ఇంద్రియమునకు ఒక్కొక్క ప్రాణి లోబడిపోతున్నది. శబ్దమునకు లోబడి జింకలు వశమైపోతున్నాయి. శబ్దమును భరించుకోలేక అదిరి చెదరి పోతుంటాయి. కట్టకడపటికి ప్రాణమును కోల్పోతుంటాయి. శబ్దమునకు మాత్రమే జింకలు జీవితమును కోల్పోతున్నాయి.

### స్పర్శ :

ఏనుగు స్పర్శచేత తాను వశమైపోతున్నది. దేహము పెద్దదేగానీ, బలము చాలా గొప్పదేగానీ, స్పర్శకులోబడిపోతున్నది. ఈ స్పర్శకేవలము భుజబలమును బుద్ధిబలమును ఏమాత్రము యోచించదు.

**రూపము :**

మిడతలు అగ్నిని చూచి తాము కాలిపోతామా? ఏమవుతాము? అనే విచారణలేక అగ్నిలో వచ్చి పడిపోతుంటాయి.

**రసము :**

చేప, మాంసము ముక్క గాలమునకు పెట్టి నీటిలో వేసినప్పుడు దాని నిమిత్తమై వచ్చిచేరి కట్టకడపటికి ప్రాణము విడుస్తుంది. అట్లే ఒక్కొక్క ప్రాణి ఒక్కొక్కదానికి లొంగిపోతున్నది. కానీ ఐదూ ఉండిన మానవుడు ఎంత భద్రము లేకుండా ఉన్నాడో చూడండి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఐదూ మానవునిలో ఉంటున్నాయి. కనుక మానవుడు అన్నింటికి బద్ధుడై పోతున్నాడు. అన్నింటికి తాను వశుడై పోతున్నాడు. అన్నింటికి తాను బానిస అయిపోతున్నాడు. తన జీవితములో స్వేచ్ఛకు ఏమాత్రము అవకాశము లేకుండా పోతున్నది.

ఇంద్రియముల సుఖము ఎక్కడ నుంచి వచ్చింది? అంటే దుఃఖము నుండే వచ్చింది. దుఃఖము నుండి మనకు దుఃఖమే ప్రాప్తిస్తున్నది గానీ సుఖము మనకు ప్రాప్తించదు. (మృత్తిక) మట్టికుండ (స్వర్ణ) బంగారుకుండగా మారాలంటే ఎట్లా అవుతుంది? మనము పుట్టినదే దుఃఖము నుండి. సుఖము ఎట్లా ప్రాప్తిస్తుంది? కానీ మనము ఆ సత్యము గుర్తించుకొనక సుఖము, సుఖము అని ఆరాట పడుతున్నాము. ఎక్కడుంది సుఖము? కేవలము దైవత్వమునందు మాత్రమే ఉంటున్నది. దివ్యత్వమునందు మాత్రమే సుఖము ఉంటున్నది. కనుక ఆదివ్యత్వమును ఆశ్రయించినప్పుడే నిజమైన సుఖము ప్రాప్తిస్తుంది.

మరొక విషయము యోచించాలి. ఈ ఇంద్రియములు పది. ఐదు కర్మేంద్రియములు. ఐదు జ్ఞానేంద్రియములు. ఈ పది ఇంద్రియములకు

ఇం(ద్రియములకు ఎవరు యజమాని. అదె మనస్సు. ఐదు కర్మేం(ద్రియములు, ఐదు జ్ఞానేం(ద్రియములు మనస్సనే దానికి భార్యల వంటివి. ఒక్క భార్య ఉంటేనే జీవితములో అవస్థలు పడలేకపోతున్నారు మానవులు. ఇద్దరు భార్యలుండిన ఉత్తానపాదునికి అనేక కష్టములు చేకూరి కట్టకడపటికి (ధ్రువుని అరణ్యమునకు పంపవలసి వచ్చింది. ముగ్గురు భార్యలున్న దశరథ మహారాజుకూడ యజ్ఞము చేత పొందబడిన (శ్రీమన్నారాయణమూర్తినే అరణ్యమునకు పంపాడు. కారణము ఏమిటి? భార్యలకు వశము కావటంచేత వారిట్టి అవస్థలకు గురౌతూ వచ్చారు. ఇంక పదిమంది భార్యలున్న మనస్సు గతి ఎలాంటిది? ఒక భార్య చెబుతుంది. నన్ను సుందరమైన దానిని చూడటానికి తీసుకుపొమ్మంటుంది. అక్కడకు తీసుకుపోకపోతే నీతో నేను మాట్లాడను అని అంటుంది. నాకు రుచికరమైన పదార్థములనందించమని నాలుక ఆశిస్తుంది. ఆ నాలుకకు రుచికరమైన ఆహారము నందించకుండా పోయినపుడు యితనిపై ద్వేషము కలుగుతుంది నాలుకకు. ఈ విధముగా ఒక దానిని తృప్తిపరుస్తే మరొకటి పూనుకుంటుంది. కనుక ఈ పది ఇం(ద్రియములను తృప్తిపరచటము ఎవరికి సాధ్యముకాదు. అర్జునుడుచెప్పాడు. 'చఞ్చలం హి మనః కృష్ణ (ప్రమాథి బలవద్దృఢమ్' చాలా (ప్రమాదమైనది, చంచలమైనది. ఇది నేను ఉంచుకోలేను అన్నాడు. ఈచంచలత్వము ఎక్కడనుంచి వచ్చింది. మనస్సుకు. ఈ భార్యలు పెట్టే బాధలతో చంచలత్వము (ప్రారంభమైనది. ఈ ఇం(ద్రియములు మనస్సును (భ్రమింపచేస్తున్నవి. మనస్సును ఒక్కక్షణమైనా స్థిరత్వముతో ఉండనివ్వవు. ఇం(ద్రియములు మనకు సుఖమునందిస్తున్నాయని అప్పటికప్పుడు మానవుడు ఆనందిస్తున్నాడే గానీ ఇవి భరించలేని బాధలను కూడా అందిస్తున్నాయి. కానీ ఇంత తెలివితేటలు కల్గిన మానవుడు కూడా ఈ యిం(ద్రియముల సుఖములను ఏ మా(త్రము గుర్తించుకోలేక పోతున్నాడు. భౌతికమైన,

లౌకికమైన, ప్రాకృతమైన, ఆనందమునకే తానులొంగి పోతున్నాడు గానీ, ఇవి చేర్చే స్థానము ఎటువంటిది అనే లక్ష్యాన్ని మరచిపోతున్నాడు

**ప్రజ్ఞానం బ్రహ్మ :**

ఈ భౌతికమైన వన్నీ క్షణభంగురమైనవి. దీనినే శంకరులవారు చెప్పారు. ''మా కురుధన జన యౌవన గర్వం హరతి నిమేషాత్ కాలా స్సర్వం''. ఇదంతా క్షణంలోనే పోతుంటాయి. ఈ సుఖములు, ఈ ఆనందములు, ఈ ఆహ్లాదములు ఒక్క క్షణములో కనుమరుగై పోతుంటాయి. ఇట్టి క్షణ భంగురమైన సుఖముల నిమిత్తమై మానవుడు గొప్ప విలువైన జీవితమును నాశనము చేసుకుంటున్నాడు.

నిజముగా మానవుడు అంటే 'విలువైన వాడు' అని ఉపనిషత్ అర్థము. చాలా విలువైనది మానవత్వం. లోకమునందు మీరు చక్కగా విచారణ చేస్తే మనిషికి ఉండిన విలువ దేనికి లేదు. కాని తెలుసుకోలేక పోవటం చేత మానవుడు అధోగతి పాలైపోతున్నాడు. ఈ ప్రపంచములో ఏది విలువైనది అంటే డైమండ్ అంటున్నాం. డైమండ్ కంటే విలువైనది లేదు. కానీ ఆ డైమండ్ విలువ కట్టే వాడు ఎవరు? మనిషి. బంగారు చాలా విలువైనది. దానికి విలువ కట్టే వాడు మనిషే. గొప్ప గొప్ప పట్టణములలో భూములకు విలువ కట్టే వారు ఎవరు? మనిషే. బొంబాయిలో చదరపుటడుగు రెండు లక్షల రూపాయలు. వీటికంతా విలువ కట్టేది మనిషే. అన్నింటికి విలువ కట్టే మనిషి విలువ ఈనాడు తరిగిపోయింది. అన్ని విలువలు ఎక్కిపోయినాయి గాని మనిషి విలువ క్షీణించిపోయింది. కారణం ఏమిటి? మనిషిలో ఉన్న విలువలు కోల్పోవటం చేతనే మనిషి విలువ తగ్గిపోయింది. మానవుడు ఎంత గొప్పవాడు! ఎంత తెలివి తేటలు గలవాడు! ఎంత ప్రజ్ఞాని! అందువలనే 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని వేదం చెప్పింది. ఇటువంటి మానవత్వంలో

ఈ నాడు ఈ విచారణ చేసే విషయములో చాలా అమోఘమైన తత్వమును పొందలేక పోతున్నాడు. ఇదంతా స్వార్థము, స్వప్రయోజనములకు వినియోగము చేసుకుంటున్నాడు. ఈ స్వార్థ స్వప్రయోజనాలు ఏ నాడు మానవుడు త్యజించునో ఆనాడే తన విలువ తాను పెంచుకోగలడు. కనుక మానవతా విలువలు చక్కగా గుర్తించటానికి ప్రయత్నించాలి. మన ఇంద్రియములు మానవ జీవితమునకు ఆదర్శవంతమైన జీవితమునందించే నిమిత్తమై భగవంతుడు ప్రసాదించిన వర ప్రసాదములే. మంచిని చూడు, మంచిని విను, మంచిని మాట్లాడు, మంచిని తలచు, మంచిని చేయి. ఈ విధముగా సరైన అర్థము తీసుకోలేక పోతున్నాము. ఈ ఐదింటిని మనము సక్రమమైన మార్గములో ప్రవేశపెట్టినప్పుడు మన ఇంద్రియముల పవిత్రత మనమే గుర్తించకోవచ్చు. ఇంత విలువైనవి మనకు అందించినప్పటికిని దుర్వినియోగము చేసుకొంటున్నాడు మానవుడు.

**అతిభాష మతిహాని :**

విద్యార్థి ''స్వామి బోధనలలో ప్రధానమైనది Talk less, Work more" అని చెప్పాడు. పూర్వము మహర్షులందరు మౌనము వహించేవారు. ఈ మౌనము దేనికోసమని? అధికంగా మాట్లాడుటచేత అసత్యము బయలుదేరవచ్చును. ఇతరులకు ఏదైన బాధ కల్గించవచ్చును. లేక మన రహస్యము ఎక్కడైన బయట పడవచ్చును. ఈ విధమైన అంతర్భావములను పురస్కరించుకొనియే మౌనము వహిస్తూవచ్చారు. ఈ మౌనము వలన ఎంత పవిత్రమైన ఉన్నత స్థాయి చేకూరుతున్నది గుర్తించుకోలేక పోతున్నారు. మౌనము చేత ఎంతయో తెలివితేటలను పెంచుకోవచ్చు.

వివేకానంద ఒకసారి పది దినములు విరామములేక మాట్లాడుతూ వచ్చాడు. పదకొండవ దినము తాను నేర్చుకొన్న శ్లోకములు మరచిపోయాడు.

ఎంత ప్రయత్నము చేసినా ఒక్క శ్లోకము జ్ఞప్తికి రాలేదు. ఏమిటి నిరంతరము కంఠస్థము చేసిన శ్లోకములు మర్చిపోవటములో నున్న కారణం ఏమిటి? స్వామి సదానంద వచ్చి 'నరేంద్ర నీవు పొరపడుతున్నావు. అధిక భాషణం చేతనే తెలివి తేటలు మరుగు పడిపోతున్నాయి. నీ జ్ఞాపక శక్తి క్షీణించి పోతున్నాది. కొంత కాలము మౌనము వహించ మన్నాడు. ఒక పదిహేను దినములు మౌనముగా కూర్చున్నాడు. తదుపరి అన్ని శ్లోకములు జ్ఞప్తికి వచ్చాయి. పిల్లలు పరీక్షల కోసమై memory power పెంచుకోవాలని ప్రయత్నము చేస్తారు. కానీ మాట్లాడుతూ ఉంటారు. ఈ మాట్లాడుతూ ఉండటంలో జ్ఞాపకశక్తి క్షీణించిపోతుంది. కనీసం పరీక్షల సమయమందైనా మాట్లాడకుండా ఉండటం మంచిది. జ్ఞాపకశక్తి, తెలివితేటలు అధికంగా అభివృద్ధి అవుతాయి. ఇంతేకాక మౌనం వల్ల ఎన్నియో అభివృద్ధులు మానవునకు గోచరిస్తుంటాయి. ఎంత మౌనము వహిస్తావో అంత యువకుడుగా నీవు మారిపోతావు. మాటలు అధికమయ్యే కొలది అతి త్వరగా వృద్ధాప్యము పొందుతావు.

***ఇంద్రియ నిగ్రహం - భగవదనుగ్రహం :***

ఇంద్రియములలో ఉండిన శక్తులను గుర్తించుకోటానికి ప్రయత్నించాలి. ఈ ఇంద్రియ శక్తిని గుర్తించు కొనలేక మానవుడు తన చేతులారా తన శక్తిని కోల్పోతున్నాడు. ఇంద్రియములు చాలా పవిత్రమైనవి. ఇంద్రియములు చాలా శక్తివంతమైనవి. ఇవన్నీ భగవత్ వర ప్రసాదములే. అయితే భగవత్సంకల్పము చేత ఎంతవరకు ఉపయోగించుకోవాలో అంతవరకు ఉపయోగించుకున్నప్పుడే భగవదనుగ్రహము కూడను అత్యధికంగాప్రాప్తిస్తుంది. అట్లు లేకుండా దీనిని దుర్వినియోగము చేసుకుంటే భగవదనుగ్రహము కూడా క్షీణించిపోతుంది. తన ఆజ్ఞ ఉల్లంఘించినప్పుడు తాను ఏ విధంగా

అనుగ్రహించ గలడు. కనుక ఏ సంకల్పము చేత అందించాడో ఆ సంకల్పమునకు అనుగుణంగా ఉపయోగించుకుంటూ పోవాలి. నీ యిష్టము కోసము దీనిని నిని యోగించుకోకూడదు భగవంతుని ఇష్టమును మనము దృష్టిలో పెట్టుకోవాలి అప్పుడే ఈ ఇంద్రియములు సరైన మార్గములో ప్రవేశిస్తాయి ఇంద్రియములు సక్రమమైన మార్గములో ప్రవేశించినప్పుడు మానవత్వము ధన్యమైపోతుంది

మానవ జీవితమంతయు ఇంద్రియములచేత కట్టబడినది ఇందులో పంచకోశముల చేత మరింత కట్టబడినది అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయ కోశములు అయితే ఈనాడు అన్నమయ, మనోమయ ప్రాణమయములు పశుపక్షి మృగాదులకు కూడా ఉంటున్నాయి. ఈనాటి మానవుడు కూడా ఈ మూడు కోశముల వరకే ప్రయాణము చేస్తే తగిన విజ్ఞానమయ ఆనందమయ కోశములు ఏమి కావాలి. కానీ మానవుడు అన్నమయ, ప్రాణమయ, మనోమయ ఈ మూడు కోశముల వరకే ప్రయాణము చేస్తున్నాడు. విజ్ఞానమయ కోశములో కూడా ప్రవేశిచటంలేదు. ఏనూటికొక్కరో కోటికొక్కరో విజ్ఞానమయ కోశములో ప్రవేశిస్తున్నారు. తదుపరే ఆనంద మయకోశము. అది ఇంతవరకు ఎవరు కనిపెట్టలేదు గుర్తించలేదు. ఆ స్థాయికి చేరుకోలేదు. ఆనందమయకోశము వరకు మన ప్రయాణము కొనసాగిపోవాలి. మధ్యస్టేషనులలో దిగిపోవటం చేత మనం అనేక ప్రమాదములకు గురైపోతాము అనేక కష్టములకు గురైపోతాము. ఎక్కడకు చేరాలో అక్కడకు చేరాలి. కనుకనే

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

( దీనిని మనం తెలుసుకొని సరైన మార్గములో మనం ప్రవేశించాలి) అసత్తు

నుండి సత్‌లో ప్రవేశించాలి. అప్పుడే మనకు శాంతి. అంతవరకు శాంతిలేదు. చీకటినుండి వెలుగునకు ప్రయాణం చేయాలి. ఎప్పుడు చీకటినుండి వెలుగునకు ప్రయాణము చేస్తామో అప్పుడే మనకు శాంతి. మృత్యువునుండి అమృతత్వమునకు చేరినప్పుడే మనకు శాంతి చిక్కుతుంది. కనుక ఈ మూడింటి శాంతి మనం పొందాలనుకుంటే మూడు తత్వములు గుర్తించుటకు ప్రయత్నించాలి. అన్నింటికి మూలాధారమైనది ఈ నాల్గు మార్గములే.

**దుష్టసహవాసం కూడదు:**

'త్యజదుర్జన సంసర్గం' దుష్టుల సహవాసము నుండి దూరము కావాలి. దుష్టులు సహవాసములో మనం ఉండినంత వరకు పవిత్రత పొందలేము. ఎంత గుణవంతుడు, ఎంత బలవుంతుడు, ఎంత విద్యావంతుడు కర్ణుడు.

*'భుజబలంబు గొప్ప బుద్ధి బలంబుండి*
*దైవబలము లేక దీనుడయ్యె*
*కర్ణుడంతటివాడు కడపటికేమయ్యె'*

దుర్యోధన దుశ్శాసనాదులకులోబడి దుష్టుల సాంగత్యముచేత దుష్టచతుష్టయములో తాను ఒకడైపోయాడు. దానమునకు పెట్టినది పేరు కర్ణుడు. ఇతని పేరే దాన కర్ణుడు. అలాంటి కర్ణుడు దుష్టులతో చేరిపోవటం చేత దుస్సంగమునకు గురి అయిపోయాడు. దుస్సంగము చేత మన సద్గుణములు దుర్గుణములుగా మారిపోతున్నాయి. సదాచారములు కూడా దురాచారములుగా మారిపోతున్నాయి. సద్బుద్ధులు కూడా దుర్బుద్ధులుగా మారిపోతున్నాయి. కారణం ఏమిటి? దుష్ట సంగము చేతనే. దుష్ట సంకల్పములు కూడా చెడ్డవే. సంకల్పములలో చేరినప్పటికి తాను చెడిపోవటానికి వీలవుతుంది. దుష్టులను గానీ, దుష్ట భావములుగానీ మన చెంతకు

రాకుండా చూచు కోవాలి పామును విష పురుగు అన్నారు. విషపురుగు అయినా ఒక్కతూరి మాత్రమే కరుస్తుంది. ఈ దుష్టుడు చెంత చేరినప్పుడు క్షణక్షణము వాడు కరుస్తూనే ఉంటాడు. వానికి రాత్రి పగలు అనేదే లేదు. వానికి విధి విధానము లేదు. ఎప్పుడుపడితే అప్పుడు కరుస్తుంటాడు. అట్టి దుష్టుల సహవాసమునకు మనం దూరంగా ఉండాలి. ఇది మొట్టమొదట మానవుడు గుర్తించవలసిన విషయము. ఇదియే ఆధ్యాత్మిక మార్గమునకు ప్రథమసోపానము.

**సంగంలో జంగం, జంగంలో లింగం :**

'భజసాధు సమాగమం' దుష్టుల సంగము మనం దూరం చేసుకున్నాక సత్సంగములో ప్రవేశించాలి. అట్టి సత్సంగము ఎలాంటిది? ఈనాడు ఈ లోకములో సత్సంగమంటే మంచి భక్తులు మంచి సాధకులు అటువంటివారంతా సత్సంగమని భావిస్తున్నారు. సత్సంగమనగా ఇది కాదు. సత్-శాశ్వతమైనది. Being సంగము, పవిత్రమైన దైవ సంగములో మనము చేరాలి. ఆ 'సత్' సర్వులందు ఉంటున్నది. 'వీడు దుష్టుడే' 'వీడు సజ్జనుడే' అని నిర్ణయించుటకు వీలుకాదు. సత్ సర్వత్రా ఉంటున్నది. కానీ నీయందున్న ఆ సత్ ను సద్భావముతో చూడాలి. అదియే అంగములోని సంగము, సంగములోని జంగము, జంగములోని లింగము, లింగములలో ఇదే నిజమైన ఆత్మతత్త్వము. జీవితము ఒక జంగము. సంగమంటే అరిషడ్వర్గము సంగము. ఈ సంగములోని జంగము, జంగములోని లింగము అదే ఆత్మ. అదియే ఆత్మ తత్త్వము. ఆ 'సత్' ఎప్పటికి మార్పుచెందనిది. ఎట్టి మార్పులు ఉండేది కాదిది. సత్‌తో సంగము చేరాలి.

**దైవసామీప్యమే పరోపకారం :**

మూడవది. ''కురుపుణ్యమహోరాత్రం''. రాత్రింబవలు పవిత్ర

కార్యములలో ప్రవేశించాలి. పుణ్యమంటే ఏమిటనుకున్నారు. ''పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం'' అన్నారు వ్యాసులవారు.పరోపకారమే పుణ్యము పుణ్యమంటే ఏమిటి? ఇతరులకు దానం చేయటము, మేలు చేయటం, ఉపకారము చేయటము, యివన్నీ పరోపకారమనుకుంటున్నారు. ఇది కాదు పరోపకారము. ఇది బాహ్య ప్రపంచమునకు పరోపకారము. పర-దైవతత్త్వము. ఉప - సమీపము, కర-చేరిపోవటము - అనగా దైవమునకు సమీపంగా చేరిపోవటమే పరోపకారము. దైవత్వమునకు సన్నిహితముగా చేరిపోవాలి. అత్యంత సమీపములో చేరిపోవాలి. అది పరోపకారము. ఎవరికో యింత అన్నంపెట్టాం, యింత దానం చేశాము బట్టలు యిచ్చాం. యివి మాత్రం పరోపకారం కాదు. పర-ఉప-కర-మూడు పదములుగా విభాగం చేయాలి. పవిత్రతకు సమీపంగా మనం చేరిపోవాలి. ఇది పరోపకారము. ఇదే పుణ్యం. అట్లా చేయకుండా పది బస్తాలు వేసి అందరికి అన్నం దానం చేశాను అనుకుంటావు. కొన్ని వందల చీరలు, పంచలు యిచ్చాము పరోపకారము చేశాము అనుకుంటాము. ఇవన్నీ కేవలం ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరుకు చెప్పుకోవచ్చుగానీ భగవంతునికి చెప్పుకోటానికి వీలుకాదు. కానీ భగవంతుని దృష్టిలో పరోపకారమంటే యిదే. భగవంతునికి సమీపముగా పోవటమే పరోపకారము.

## దైవత్వాన్ని భిన్నత్వంగా భావించటమే పాపం:

''పాపాయ పరపీడనం''. పాపమంటే ఏమిటి? పర -దైవత్వమును త్యజించటమే, దైవత్వమును భిన్నత్వముగా భావించటమే పాపము. ఏకత్వమైన పరమాత్మను భిన్నత్వముగా భావించుకోటమే పాపము. భగవంతుడు ఒక్కడే. ఏ మతము వారు ఏ పేరైనా పెట్టుకోవచ్చును. కానీ భగవంతుడు ఒక్కడే. ఉన్నది ఒక్కడే. అట్టి ఒక్క భగవంతుని భిన్న భిన్నంగా విభజించటమే ఒక పెద్ద పాపము. ఏకంగానున్న భగంతుని అనేకత్వముగా మనం భావించరాదు.

ఈనాటి కలియుగ ప్రభావముచేత ఏకత్వమును అనేకత్వముగా విభజించే మేధావులు అనేకంగా అభివృద్ధి అవుతున్నారు కానీ అనేకత్వమును ఏకత్వంగా చేసే గుణవంతుడు ఒక్కడైనా కనిపించటంలేదు. అనేకత్వము చేయటమే పాపము. ఏకత్వమును విశ్వసించటమే పుణ్యము. ఇట్టి సక్రమమైన అర్థములు తెలుసుకోలేకపోవటంచేత మానవుడు ఎంత కాలము సాధన చేసినా ఉన్న స్థానము నందే ఉంటున్నాడు. మనము ఈనాడు తెలుసుకోవలసింది ఏమిటి భగవంతుడు అనుగ్రహించిన ఇంద్రియములను సక్రమమైన మార్గములో పరిమితమైన మార్గములో ప్రవేశపెట్టాలి. సక్రమము, పరిమితము ఈ రెండింటిని మాత్ర అని చెబుతూవచ్చారు కొలతలు వేసేది, పరిమితము కలిగించేది. అదియే ఇంద్రియముల శక్తి సామర్థ్యములు. ఈ ఇంద్రియములకు పరిమితములేనప్పుడు పెడమార్గము పడతాయి.

## దృష్టిని అంతర్ముఖం గావించు :

ప్రేమస్వరూపులారా! ప్రతి మానవునికి ఇంద్రియములుంటున్నవి. కానీ ఈ యింద్రియములు సరియైన రీతిగా తెలియకపోవటంచేత పెడ మార్గము పట్టించి, జీవితములో అనేక అవస్థలకు గురౌతున్నారు. మనము చేయవలసిన సాధన మరొకటి లేదు. ఏ సాధనలుచేయనక్కరలేదు ఎందుకంటే అన్నీ నీవే అయి ఉంటున్నావు. కనుక నీవు మరొక దానిని చేయనక్కర లేదే. సర్వముతానైన వాడు యింకోదాన్ని చూడ నక్కరలేదు. అంతా తానే అయి ఉంటున్నాడు. నిప్పు ఉంటున్నది. అలక్ష్యము చేయటంచేత నిప్పుపై నివురు వచ్చి చేరిపోయింది. అయితే ఆ నివురు ఎక్కడనుంచి వచ్చింది? నిప్పునుంచే వచ్చింది. నిప్పు నుంచే వచ్చి నిప్పును కప్పివేసింది. ఊదితే నివురు పోయి నిప్పు కనిపిస్తుంది. నిప్పు ఎక్కడనుంచో నీవు తీసుకు రాలేదు. నివురును ఎక్కడికో పంపలేదు. నివురు నిప్పునుండే వచ్చింది. నివురుపోతే నిప్పు కనిపిస్తుంది. అదే విధముగా నీయందే ఉంటున్నది. దివ్యత్వము. దాని నుంచే

పుట్టింది మాయ. ఆ మాయ అనే నివురు నిన్ను కప్పివేసింది. ఇది 'మాయ' అని తెలుసుకుంటే మాయపోతుంది. ఆత్మతత్త్వము కనిపిస్తుంది. నీవు ఏమి సాధనలు చేయనక్కరలేదు ఏ యాత్రలు పోనక్కరలేదు కానీ నీ దృష్టిని అంతర్ముఖముగావించుకో అప్పుడే సత్క్రమమైనది కనిపిస్తుంది.

నిన్నటి దినము శరీరము, ఈనాడు ఇంద్రియములు రేపటి దినము మనస్సు యొక్క తత్త్వము. తరువాత బుద్ధి. ఈ నాలుగు తెలుసుకున్న తరువాత ఆత్మ సాక్షాత్కారమైపోతుంది. ఎందుకంటే ఇవి ఒకదానిపై ఒకటి చేరి ఉంటున్నది. వీటినంతా తీసివేసినప్పుడే ఆ స్వస్వరూపాన్ని సందర్శించుకోటానికి వీలవుతుంది ఆత్మ ఉంటున్నది. దానిపై శరీరము ఉంటున్నది. ఈ శరీరమును తీసివేయాలి. ఇంద్రియములు పక్కకు నెట్టాలి. మనసును మరణింప చేయాలి. బుద్ధిని ప్రక్కకు తోయాలి. అప్పుడే ఆత్మసందర్శన ప్రాప్తిస్తుంది. అయితే 'బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్' బుద్ధి ఆత్మకు అత్యంత సమీపములో ఉండుటచేత ఈ బుద్ధి ప్రకాశము గొప్పగా ఉంటుంది. అత్యంతసమీపానికి వెళ్ళినప్పుడు ఈ ప్రకాశము అధికంగా గోచరమవుతుంది.

**నిన్ను నీవు తెలుసుకొనుటకే చదువులు:**

ఈనాటి పిల్లలందరు ఇంద్రియముల విషయాన్ని ముఖ్యంగా గుర్తించాలి. యువకులకు ఇది ప్రధానమైనది, ప్రమాణమైనది. ఇంద్రియములకు లోబడి కేవలము పశువుల కంటె నీచమై పోతున్నారు. ఏ జీవితములోని ప్రాప్తినో ఈనాడు అనుభవిస్తున్నారు. పశుపక్షిమృగాదులు ఒకనియములో ఉంటున్నాయి

కానీ విద్యావంతుడై, విద్యాధికారియై, మేధావంతుడైన మానవునియందు నియమము లేకుండా ఉంటున్నది. ఎందుకు ఈ చదువులంతా? ఎందుకీ

తెలివి తేటలంతా? పరులను మోసగించటం కోసమా? కాదు కాదు. నిన్ను నీవు తెలుసు కోవటం కోసమే ఈచదువులు కావాలి. నిన్ను నీవు గుర్తించు కోవటం కోసమే తెలివితేటలు కావాలి. ఇవి లేనప్పుడు ఈ తెలివితేటలు ఎందుకు? గ్రంథ పరిచయమంతా వ్యర్థమే.

పుస్తకములు పఠించితిని పూర్తిగ జూచితి సర్వశాస్త్రముల్
నిస్తులమైన విద్యలునేర్చితి నంచును గర్వమేల నీ
హస్తయుగంబుమోడ్చి పరమాత్మను భక్తితొ గొల్వలేనినీ
ప్రస్తుత విద్యలన్నిధాత్రి నిరర్థకము కాదె మానవా!

మనకు కావలసినది యింతకంటె ఏమిటి? మనము తెలుసుకోవలసింది మనయందే ఉంటున్నది.

నిద్దురనుండి లేచి మరి నిద్దురపోయెడు దాది పొట్టకై
హద్దును పద్దులేక వ్యయమందగ జేయుచు జీవితంబునీ
విద్దెలధారపోసి అరవింద దళాక్షుని విస్మరించి ఏ
పెద్దసుఖంబు నొందితివొ ప్రీతిగ యోచన చేయు మానవా!

ఏమి నీవు తెలుసుకున్నది? తెల్లవారి లేచునది మొదలు రాత్రి పడుకునే వరకు పొట్టకోసమై హద్దుపద్దులేకుండా తిరుగుతున్నావు. మానవుడా! నీ మానవత్వము చక్కగా గుర్తించుకో. దివ్యత్వము చక్కగా తెలుసుకో. దైవత్వాన్ని చేరిపో. ఇదే జీవిత గమ్యము.

తేది : 6-10-1997 సాయికుల్వంత్ హాల్

★★★★★

# మనో మూల మిదం జగత్

శివయేవ సదాజీవం జీవయేవ సదాశివం.

వేదైక్య మునయోర్యస్త స్యాత్మ జ్ఞాన చేతసః

ప్రేమాత్మస్వరూపులారా!

శివుడే జీవుడు. జీవుడే శివుడు అన్న ఏకాత్మ తత్వాన్ని ఎవరు గుర్తింతురో వారే పరిపూర్ణ జ్ఞాని. కారణం విశ్వమంతకు ఒకే విభుడు. ఇట్టి సత్యమును గుర్తించిన వ్యక్తి దానిని అద్వైత దర్శనం జ్ఞానం అన్నాడు. అయితే జీవగుణముతో బాటు శివ గుణము కూడా లీనమై ఉంటున్నది. జీవగుణము మనస్సు. ''మనోమూలమిదం జగత్''. జగత్తంతయు మనస్సు

యొక్క కారణమే. మనస్సంటే ఏమిటి? ''సంకల్ప వికల్పకాత్మకం మనః'' నిరంతరము మననం చేయటమే మనస్సు యొక్క స్వరూపము. సంకల్పవికల్పములచే తన స్వరూపము నిరూపిస్తూ వచ్చింది. ఇట్టి సంకల్పవికల్పములుకు విరామ మనేదే లేదు. విరామము లేక నిర్విరామముగా సంకల్ప వికల్పము జరుగుతుంటాయి. అయితే ఇట్టి సంకల్పములు ఒక్కొక్కసారి పరిధి తప్పి వేగ స్థితిని పొంది మానవత్వమును అవ్యక్తము చేస్తుంది. ఈ మనోవేగమును భరించుకొన లేక మానవుడు అస్తవ్యస్తమై పోతున్నాడు.

***మతి, స్థితి, గతి, సంపత్తి :***

మానవుని ఆలోచనలు ఒక్కొక్కతూరి అమితమైన వేగమును, ఉద్వేగమును, ఉత్సాహమును, ఉద్రేకమును, కలిగ ఉంటుంటాయి. ఇట్టి సంకల్పముల వికారముచేతనే మానవుడు కొంతవరకు మనస్తత్త్వమును కోల్పోతున్నాడు. ఈ కలి ప్రభావముచేత మానవుని స్థితిగతులు ఒక విధమైన ఉన్మత్తుని వలె చేస్తున్నాయి. మతి, స్థితి, గతి, సంపత్తి ఈనాలుగు భగవదనుగ్రహ ప్రసాదమే. ఏమానవుడు ఈ మతిని, గతిని, స్థితిని, సంపత్తిని సద్వినియోగ పరచుకొనునో అట్టివాడే మానవత్వముకు కొంతవరకు కట్టుబడి ఉంటాడు. వీటిని అపమార్గములో ప్రవేశపెట్టి, అసభ్యమైన మార్గములో దీనిని అనుభవించి, ఆనందించాలనే సంకల్పము కలిగిన మానవుడు దానవుడుగా మారిపోతాడు.

ఈనాటి లోకములో మందులకు నయముగాని రోగములనేకముగా ఉన్నాయి. ఎట్టిమందులకు అలవికాని రోగములు మరికొన్ని ఉన్నవి. అయితే ఈ రోగము దేహమునకా? మనస్సుకా? అని విచారణ చేస్తే ఇది దేహమునకు కాదు. మనస్సుకే - సమస్తరోగములు మనస్సు ద్వారానే

శరీరమున కంటుచున్నవి. కనుక ఇవన్నీ మనోరోగములే కానీ శారీరక రోగములుకాదు  ఒక చిన్నతలనొప్పి గానీ లేక కడుపునొప్పిగానీ చిన్న చిన్న బాధలన్నీ మనస్సుద్వారానే ఏర్పడుతున్నాయి. ఈమనస్సు ప్రభావము ఎట్టి సంకల్పముతో కూడి ఉండునో అట్టిప్రభావమే శరీరముపై ప్రసరింపచేస్తుంది. ఈసత్యమును మానవుడు గుర్తించుకొన లేక సమస్తరోగములు దేహమునకే గానీ మనస్సుకు కాదు అని నిర్ణయించుకుంటున్నాడు. శరీరరోగములు అమితంగా కనిపించటంలేదు. మనోవ్యాధులే అమితంగా కనిపిస్తున్నాయి. ఇది ప్రాకృతమైన జగత్తు. కనుకనే ఈనాడు మితిమీరిన మతిభ్రమలు అధికమవుతున్నాయి. ప్రపంచములో విచారించి చూచినప్పుడు పిచ్చితనము దినదినమునకు పెరుగుతున్నదే కానీ తరగటం లేదు. కారణము మితిమీరిన ఆలోచనలు. ఈ సంకల్పములు గతి తప్పిన సంకల్పములు. సంకల్పములకు కారణం కన్పించదు. ఇట్టి సంకల్పముచే మానవుడు శరీర అస్థితిని పొందుచున్నాడు.

***రాగద్వేషాలే వ్యాధికి కారణాలు :***

ఈ మనస్సునందు ఒక విధమైన రస స్వరూపము ఉన్నది. ఇది శోకరసము కావచ్చును లేక ఆనందరసము కావచ్చును, ప్రేమరసము కావచ్చును, ద్వేషరసము కావచ్చును. అయితే మానవుని సమస్త సంకల్పములకు, సమస్త వ్యాధులకు మూలకారణము రాగద్వేషములే. మనస్సంతా ప్రతిక్షణము రాగద్వేషములతో నిండి ఉంటుంది. ఈ రాగద్వేషములచే మానవత్వమును మరచి పోతున్నది మనస్సు.

మానవుడు కొన్ని పరిస్థితులందు అరిషడ్వర్గములైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు జీవితమునకు ఒక ఆదర్శమని భావిస్తుంటాడు. ఇది కాదు. మానవునకు పరమ విరోధులు ఈ

అరిషడ్వర్గములు వీటి సంబంధము ఎవరు కల్పించుకొందురో అట్టివారి యందు విషస్వభావమైన రసము ఏర్పడుతుంది. అట్టి రసము మానవుని ప్రతి అణువునందు, కణము నందు ప్రవేశిస్తుంది. మానవత్వములోని దివ్యత్వమును మరిపింపచేస్తుంది. ఇందులోని దుర్గుణములు, దురాలోచనలు, దుష్ప్రవర్తనలు యివన్నీ విషస్వరూపమైన రసములే. ఇట్టి వాడు ఎట్టి పనిచేసినా తాను అపకీర్తులపాలు కాగలడు గానీ సత్కీర్తిని పొందలేడు.

### సచ్చింతన ఆనందమే :

సద్భావములు, సత్ప్రవర్తనలు, సచ్చింతనలు యిత్యాది గుణములచే కూడిన మనస్సు నిరంతరము సంతోషముతో, ఉల్లాసముతో, ఆహ్లాదముతో, ఆనందముతో జీవిస్తూ ఉంటుంది. కనుకనే ప్రాచీనకాలమునుండి మన భారతీయులు నిరంతరము సచ్చింతన చేయమంటూ వచ్చారు. సర్వేశ్వరుని స్మరించమంటూ వచ్చారు. మానవుని యందు ప్రవేశించిన అరిషడ్వర్గములను దూరము గావించమని చెబుతూ వచ్చారు. ఇంద్రియ నిగ్రహమే మానవుని ప్రధానలక్ష్యమని బోధిస్తూ వచ్చారు. కారణం ఏమిటి? మానవత్వమును దివ్యత్వముగా రూపొందింప చేయటానికి ఇదియే మూలమార్గము - మానవుని అంతఃకరణ ప్రేమమయమై ఉండాలి. అంతఃకరణ ప్రేమమయమై ఉండినప్పుడు సమస్తమూ ప్రేమమయంగా, ఆనందమయంగా రూపొందుతాయి. అట్టి మానవునికి ఎట్టి రోగములు ప్రాప్తించవు. కాని ఈ నాటి మానవుడు దినదినమునకు రోగ పీడితుడౌతున్నాడు. దీనికి అనేక రకములైన కారణములు డ్యాక్టర్లు చెబుతున్నారు కాని ఈ కారణములు లౌకికమైన కారణములే. ప్రధాన కారణము మనస్సుయొక్క దుర్భావమే. మనిషి చూచుటకు మంచిగా కనిపించవచ్చు గానీ లోపల దుర్భావములు, దుశ్చింతలు, దుష్ప్రవర్తనలు ఇలాంటివి నిండి ఉంటున్నాయి. ఆ

అనారోగ్యమునకు ఇవియే ప్రత్యక్ష సాక్షులు కనుక మానవునిలో మనస్సు తన యిష్టమైన రీతిగా మారుతూ వస్తుంది.

ఒక చిన్న ఉదాహరణ ఒక గ్రామములో ఒక శ్రీమంతుడైన రైతు ఉండినాడు. అతనికి పశువులు ఉండినవి మరొక బీదకుటుంబమునకు చెందినవాడు; తన పశువులను ఆ పశువులతో చేర్చి పచ్చిక బయళ్ళకు తీసుకువెళ్లాడు. ఒకనాడు ఈ పశువులు ఒకదానితో ఒకటి పోరాడినాయి. శ్రీమంతుని ఎద్దును బీదరైతు ఎద్దు పొడిచి చంపింది. ఈ శ్రీమంతుడు నన్ను ఏమి శిక్షించునో! అనే భయముచేత అదురుతూ బెదురుతూ శ్రీమంతుని ఇంటికి వెళ్ళాడు. ఆ భయముతో మనస్సు కలత చెందింది. ఆ కలతచేత సత్యమును మరచిపోయి అసత్యముగా తాను చెబుతూ వచ్చాడు. ప్రభూ! మీ ఎద్దు నా ఎద్దును పొడిచి చంపింది అన్నాడు. ఈ పదము శ్రీమంతునికి ఆనందమే కలిగించింది. అప్పుడు బీదరైతుకు తాను ప్రశాంతంగా బోధిస్తున్నాడు ''ఓ పిచ్చి మనిషీ! చదువు సంధ్యలు కలిగినవారు గొప్ప మేధావులైనవారు, మహాజ్ఞానులే ఒకరినొకరు పొడుచుకొని చంపుకుంటున్నారు. ఈ రాగ ద్వేషములు అందరియందు ఉద్రేకముగా ఉంటున్నాయి. కలి ప్రభావమున ఇట్టి సుజ్ఞాన, ప్రజ్ఞాన, మానవత్వము నందే యిట్టి క్రోధము ఉండగా పశువులందు క్రోధముండక పోతుందా? అది వాటికి సహజము'' అని వానిని శాంతపరచాడు. కానీ బీదరైతు తృప్తిపడలేదు. నేను చెప్పినది పొరపాటు ప్రభూ! క్షమించండి! నన్ను. ''మా ఎద్దు మీ ఎద్దును పొడిచి చంపింది'' అన్నాడు. దానితో ఈ శ్రీమంతునికి ఉద్రేకము ఉట్టిపడింది. ''నీకింత గర్వమా! కన్నుమిన్ను కనిపించటంలేదా? నా పశువును నీ పశువులతో చంపించటానికి ప్రయత్నిస్తున్నావా? ఎంత దుర్మార్గుడవు. ''నీకు 500 రుపాయలు జరిమానా వేస్తున్నాను. అంతే కాదు. నిన్ను ఒక స్థంభానికి కట్టించి

కొట్టిస్తాను'' అన్నాడు చూచారా! తన ఎద్దును బీదరైతు ఎద్దు పొడిచి చంపిందంటే సమాధానము యింకోరకంగా చెబుతూవచ్చాడు ఇక్కడ ఏమైంది? 'నా' అనే భావము ఇతనియందు ఆవిర్భవించింది అదే మమత్వము. ఇక్కడ పరతత్వము 'నా' ఏకత్వమునకు విరుద్ధమైనది. నేను అనే అహంకారము నాది అనే మమకారము రెండే మానవుని అనేక విధములుగా చెరుపుతూ వస్తున్నాయి. ఈ విధముగా మానవుని ప్రవర్తనలచేత అనేక రకములైన దోషములు సంభవిస్తూ వస్తున్నాయి.

మానవుడు ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయము సంకల్పములను అమితంగా అభివృద్ధి పరచుకోరాదు మనస్సుయొక్క స్వరూపము సంకల్పముల చేరికయే. ఆ సంకల్పములు పవిత్రముగా ఉండినప్పుడే ఆఫలము పవిత్రమైనదిగా రూపొందుతుంది. కానీ నీ సంకల్పములు దుష్టమైనవిగా ఉండినపుడు ఆ దుష్టత్వము నిన్ను, నీ భవిష్యత్తును నాశనము చేస్తుంది. మానవుడు క్రోధము, ద్వేషము, అసూయ ఇత్యాది దుర్గుణములన్నీ చాలా వరకు అభివృద్ధి పరచుకుంటున్నాడు. దీని వల్ల కొంత సుఖము కల్గుతుందని, కొంత అనుకూలము జరుగుతుందని భావిస్తుంటాడు. కాదు,కాదు చాలా పొరపాటు. నీ భావములో ఇదేదో అనుకూలము కనిపించినట్లుగా కొంత కనిపిస్తుందిగానీ దానికంటె ఎన్నో రెట్లు చెడ్డఫలితమే అందిస్తుంది. నీవు ఎవరినైనా హింసించాలనుకుంటే అతనిని హింసించే దానికంటే అధికమైన రీతిగా తననే హింసించుకుంటాడు. కనుక ఎవరి చెడ్డను కోరకూడదు. ఎవరికి అపకారము తలపెట్టకూడదు. ఎవరికీ మనం కీడు సల్పరాదు. ఆ కీడు తిరిగి మనకే ఎదురు తిరుగుతుంది.

సంకల్పములు మనస్సు యొక్క ప్రభావమే. ఈవిధమైన మనస్సుతో ఉండటం చేత మానవుడు తన స్వరూపమును తాను మరచిపోతున్నాడు. నేను భోక్తను అనే భావము తన యందుండినంత వరకు దుఃఖము తప్పినది

కాదు. మనస్సు ఉండినంత వరకు మీకు విచారము విడువదు. ఏనాడు అమనస్కుడగునో ఆనాడే యితని విచారము కూడా దూరమవుతుంది. సంకల్పములు లేక మానవుడు జీవించలేడు. కాని ఆసంకల్పములు పరిమితమైన రీతిగా ఉండాలి. మితిమీరిన సంకల్పములచేత తన మతిని చెడ గొట్టుకుంటున్నాడు మానవుడు. ఈ విధముగా చెడ్డ కార్యములలో ప్రవేశించి దినదినము చెడ్డ కార్యములు అధికము గావించుకుంటూ రావటం వలన కట్టకడపటికి వాడు చెడుమార్గము పట్టిపోతాడు.

***మనస్సే బంధమోక్షాలకు కారణం:***

'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి'. ఎట్టి చర్యలలో తాను ప్రవేశించునో అట్టి స్వరూపమే పొందుతాడు. మానవుడు తాను అనుభవించే భోగములకు గాని, అనుభవించే అశాంతికిగాని, అనుభవించే అసంతోషములకుగాని, మూల కారణము తన సంకల్పములే. కనుక మానవుడు శాంతి సుఖములు పొందాలనుకుంటే సంకల్పములు అరికట్టాలి. వయస్సునకు మించిన సంకల్పములు ప్రవేశిస్తూ ఉంటాయి. కానీ ఈ సంకల్పములకు వయస్సు యొక్క పరిస్థితి ప్రభావము కాదు. బాల్యము, యవ్వనము, వార్ధక్యము అనే స్థితి గతులు దానికి మాత్రము చెందవు. లింగభేదము అంతకంటె ఉండదు. మరణించేది దేహమే కాని మనస్సు కాదు. నేను మరణిస్తున్నానని దేహమంటుంది కాని, మనస్సు అనదు. దేహము మరణిస్తుంటే మనస్సు మరణిస్తున్నదని భ్రమింపచేస్తుంది. దేహము మరణించిన తరువాత కూడ మనస్సు ఉంటుంది. మనస్సుకేమాత్రము మరణము లేదు. ఇలాంటి మరణ రహితమైన మనస్సు ద్వారా మానవత్వము తన సత్యమును తాను గుర్తించుకోలేక పోతున్నది. దీనిని పురస్కరించు కొనియే ''మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'', బంధమునకు మోక్షమునకు

మనస్సే కారణమన్నాడు. ఎట్లా? దుస్సంకల్పములచేత బంధితుడౌతున్నాడు. సత్సంకల్పములచేత బంధవిమోచన కల్గుతున్నది.

బంధమోక్షములకు మనస్సే కారణము. కనుక సత్సంకల్పములు అభివృద్ధి పరచుకోవాలి సద్భావములు పెంచుకోవాలి. సదాచారములలో ప్రవేశించాలి. సచ్చింతనచేయాలి. ఇదియే మానవుని సంపూర్ణ స్థితికి కారణము. అధిక కాలము మనము జీవించవలె నంటే నిరంతరము ఆనందమయులుగా ఉండాలి. ఈ ఆనందమయుడుగా నీవు రూపొందాలంటే అంతఃకరణ ప్రేమమయంగా మారాలి. ఈ ప్రేమమయమైన అంతఃకరణనుండి ఆవిర్భవించినదే ఈ సత్సంకల్పములు;క్రోధము, ద్వేషము, అసూయ అనే పాడు బుద్ధుల నుండి వచ్చినవే అహంకార మమకారములు. మానవుని అనేక విధములుగా బాధిస్తున్నది. మనస్సుకు చెందిన ఈ అహంకార మమకారములు, వీటికి ఏ మాత్రము అవకాశమివ్వకుండా చూచుకోవాలి.

**వాంఛల స్వరూపమే సంసారం :**

మానవుని స్వభావము ఏమిటో గానీ అర్థము కావటంలేదు. సంసారము మహాసాగరమని అందరికీ తెలుసు. కాని దానినే ఆశిస్తుంటారు. సంసారమంటే **Family life** అని కాదు. సంసారమనగా వాంఛల యొక్క పవిత్రతయే, వాంఛల స్వరూపమే సంసారము. ఇది నా దేహమనేది కూడా సంసారమే. ఇది నా మనస్సు అనుకోవటం సంసారమే. అభిమాన మమకారములతో కూడినదంతా సంసారమే. భార్య, భర్త, బిడ్డలతో కూడినది మాత్రమే సంసారము కాదు. భార్య బిడ్డలతో చేరిన కుటుంబము ఒక గృహస్థము. దీనికి సంసారమని పేరు పెట్టరు. ప్రాకృత వాంఛలు కలిగినదంతా సంసారమే. నేను గొప్ప విద్యావంతుడు కావాలి అది సంసారమే. నేను గొప్ప ఉద్యోగము చేయాలనుకోటం సంసారమే. నేను

విదేశాలకు పోయి రావాలనుకోవటం సంసారమే. ఈ వాంఛలన్నీ సంసారమునకు సంబంధించినవే. కారణం ఏమిటి? ఇవన్నీ మనోకల్పితమైనవే. కనుక మనోకల్పితమున్నంత వరకు మానవుడు ఆత్మతత్త్వమును అర్థము చేసుకోలేడు.

**మనస్సులేని స్థితియే ఆనందము:**

మానవుడు ఈనాడు సమస్త సాధనలు మనస్సుద్వారానే చేస్తున్నాడు. పూజచేసి నా మనస్సు స్వభావంతోనే చేస్తున్నాడు. ధ్యానము లోకూర్చున్న మనస్సు ఆధారముతోనే చేస్తున్నాడు. జపము చేసినా మనస్సు ఆధారముతోనే చేస్తున్నాడు. సర్వసాధనలు మనస్సు తోనే గావిస్తున్నాడు. బంధవిమోచనము ఎట్లా? మనస్సు అతీతమైన భావమునకు పోవాలి. అనగా ఏమిటి? అంతఃకరణతో ఆలోచించాలి. దానిని అనుసరించాలి. అంతేగానీ మనస్సు యొక్క భ్రాంతులను అనుసరించకూడదు. మనస్సు యొక్క వాంఛలను అనుసరించకూడదు. ఈ మనస్సు స్వభావము యిటువంటిదే. తన మార్గమునకే తాను రప్పించుకుంటుంది గానీ భగవత్ మార్గమునకు ఏ మాత్రము ప్రవేశింప జేయదు. ఈ విధముగా ఆధ్యాత్మిక మార్గమునకు సర్వవిధముల ఆటంకము చేసేది మనస్సే.

బుద్ధుడు తాను నిర్యాణము పొందుటకు పూర్వము, తన పిన తల్లి కుమారుడైన ఆనంద్‌తో చెబుతున్నాడు. ఆనందుడు బుద్ధుడు నిర్యాణము పొందుతున్నాడని బాధపడుచుండగా, ''ఆనందా! నేను ఈ ఆనందనిమిత్తమై యింతకాలము సాధనలు సల్పాను. నీవు ఎందుకు శోకిస్తున్నావు. ఆనందము అందరికి ప్రాప్తిస్తుందా? కాదు కాదు. భౌతిక శరీరమునే నీవు చూస్తున్నావు. నా అంతరాత్మలోని ఆనందమును నీవు గుర్తించటం లేదు. నేను ఈ ముప్పై సంవత్సరములు మనస్సు ఆటంకములచే యిన్ని బాధలకు

గురయ్యాను. నన్ను భగవంతుని నుండి వేరు చేసినది మనస్సే. ఈనాడు నేను మనస్సు నుండి తప్పించుకున్నాను. ఈనాడు ఆమనస్సు నన్ను వదలిపోయింది. ఇదియే నా ఆనందము. మనస్సు లేని స్థితియే ఆనందము అని ఆనందునకు ప్రభోదించాడు''. ఆనందుడు కూడా తన కిట్టి మనోరహిత స్థితి కల్గాలని ఆశీర్వదించమని కోరాడు. మనస్సుతో కూడినంతవరకు మానవునకు కలిగే ఆనందము నిత్యానందము కాదు. ఇది ఆధ్యాత్మికానందము కాదు. ఇది కేవలము భౌతికమైన తాత్కాలికమైన ఆనందమే. ఈ సత్యము గుర్తించుకొనలేక అనేక మంది అనేక సాధనలు మనస్సుతోనే చేస్తున్నారు. మనస్సును లక్ష్యము చేయకుండా చూడాలి. మనస్సు కేవలం సంకల్ప వికల్పములనే తీసుకొని వస్తున్నది. ఇట్టి సంకల్ప వికల్పములుండినంత వరకు ఆత్మతత్త్వము అర్థము కాదు. నీ దృష్టి ఆత్మవైపు మరల్చు. సంకల్పముల వైపు మరల్చకూడదు. సంకల్పములుండినంత వరకు నీకు ఆత్మతత్త్వము అత్యంత దూరముగా ఉంటుంది. కనుక మనస్సు మానవుడు కల్పించుకున్న భూతమే. ఇట్టి భూతమును మానవుడే సృష్టించుకొని తద్వారా తాను బాధలకు గురౌతున్నాడు.

**మనస్సును దైవం వైపు మరల్చు :**

మనస్సు నుండి మనము దూరము కావాలి. మనస్సు ఉండినా సత్సంకల్పములైనా పెంచుకోవాలి. సర్వేశ్వర చింతవైపు మనస్సు మరల్చాలి. అదే నేను అప్పుడప్పుడు పిల్లలకు చెప్పుతుంటాను. మన హృదయము ఒక లాక్ వంటిది. ఈ లాక్‌లో బీగము చెవి పెట్టు. దీనిని ఎడమవైపు త్రిప్పు వదులుతుంది. కుడివైపున త్రిప్పు లాక్ అవుతుంది. అదే రీతిగా మన హృదయమనే లాక్‌కు మనస్సనే కీ పెట్టి దైవము వైపు త్రిప్పు అది

డిటాచ్‌మెంటు అవుతుంది. ప్రకృతివైపు త్రిప్పు అటాచ్‌మెంట్ అవుతుంది. నీ మనస్సు దైవము వైపు మరల్చు. చాలమంది దైవము వైపే మరల్చామని అనుకుంటున్నారు. కానీ, నిరంతరము లోక వ్యవహారములందే మునిగి ఉంటారు. ఇటు భగవంతుని వైపు మరలిస్తే ప్రకృతి ఎంతమాత్రము అడ్డు తగలదు. ఒక కాలు జగత్తునందు, ఒక కాలు ఆధ్యాత్మికమందు పెట్టుకుంటారు. ఇది ఏనాటికి ప్రాప్తించదు. రెండింటిని ఒకే స్థానములో చేర్చాలి. కనుక మనస్సు స్వభావము కల్పితమైనదే గానీ, సహజమైనది కాదు. ప్రాచీన కాలమునుండి దీనిని మనస్సు అనుకొని రావటం చేత ఇది మనస్సుగా రూపొందుతూ వచ్చింది. కనుక ఈ మనస్సు అనే తత్త్వమును సుజ్ఞానమార్గములో ప్రవేశపెట్టాలి. ఈవిధమైన మనస్సు భావాన్ని ప్రతిమానవుడు గుర్తించుటకు ప్రయత్నించాలి. మనస్సు అని యింతకు పూర్వము పేరు లేదు. సంకల్పము అని దీనికి పేరు. కానీ సంకల్ప వికల్పములతో కూడటంచేత 'మనస్సు' అని గొప్ప పేరు వచ్చింది. సంకల్పములే లేనప్పుడు మనస్సే లేదు.

ఇది చూడండి ఒక వస్త్రము ఇది దారముల చేరిక ఈ వస్త్రములోని దారము ఒకదాని కొకటి తీసివేస్తే వస్త్రములేదు. సంకల్పములనే దారములు చేరటం చేత మనస్సనే వస్త్రం తయారైంది. ఈ సంకల్ప వికల్పములనే దారము తీసివేయి మనస్సనే వస్త్రమే లేదు. ఈ మనోభావము పోవాలనుకున్నప్పుడు **Less luggage more comfort** అన్నారు. మనజీవితం దీర్ఘప్రయాణము. ఈ దీర్ఘప్రయాణములో మనము లగేజి అమితముగా తీసుకొని పోతే చాలా కష్టములకు బాధలకు గురౌతాము. కనుక తక్కువ వాంఛలను పెట్టుకోవాలి. మనము. ఈ లగేజి తగ్గించుకొంటూ పోవాలి. ఈనాటి మానవుడు లగేజి తగ్గించుకోవటం లేదు. దినదినమునకు పెంచుకుంటున్నాడు. ఈ విధముగా లగేజి

పెంచుకొంటూ భారములేకుండా ఉండాలంటే ఎట్లా సాధ్యమవుతుంది. ప్రతి విషయమందు ఎంతవరకునో అంతకంటే తగ్గించుకొంటూ రావాలి.

దీనినే వానప్రస్థములో ఒక మార్గమును ప్రబోధిస్తూ వచ్చారు. పౌర్ణమి దినము తరువాత ఒక్క పిడచ (ముద్ద) మాత్రమే భుజిస్తూ రావాలి. ఒక్కొక్క దినమునకు ఒక్కొక్క పిడచ అధికము చేసుకుంటూ పోవాలి. ఎంత ఆకలి ఉండినా అధికముగా తినకూడదు. అమావాస్య వచ్చేటప్పటికి ఫుల్‌గా భోజనంచేయాలి. అమావాస్య నుండి తిరిగి ఒక్కొక్క పిడచ తగ్గించుకుంటూ రావాలి. తిరిగి పౌర్ణమి వచ్చేటప్పటికి పూర్తి పస్తు ఉంటాడు. ఈ విధముగా ఆహారవిహారములందు కొంత వరకు తాను నియమమును పూనినప్పుడే ఈ మానవుని సంకల్పములు కంట్రోలు అవుతూ ఉంటాయి. కానీ యువకులు ఈనాటినుండి ఈ ఆహార నిబంధనలకు పూనుకోకూడదు. ఇది పెరిగే వయస్సు దీనికి తగిన ఆహారవుండాలి. ఆహారవుండాలని ఊరికే భోజనవుచేస్తూ కూర్చోకూడదు. ఈ లోడు నిమిత్తముకాదు నీవు వచ్చినది. ఆకలి తీరే నిమిత్తమే నీవు భుజించాలి. అంతేకాని భుజించే కోసమని పుట్టలేదు. ఈ సత్యము నీవు గ్రహించాలి.

ప్రతి సాధనకు మనయందే శత్రువులు ఉంటున్నారు. రాగద్వేషములు మహాశత్రువులు. ఈ రాగము అనేక రకములుగా ఉంటుంది. ఇది కావాలి, అది కావాలి, అనే రాగముంటుంది. ఇది చేయాలి, అది చేయాలి, అనే రాగముంటుంది. ఇది పొందాలి, అది పొందాలి, అనే రాగము కూడా ఉంటుంది. ఈరాగమే పెద్దరోగము. కనుక ఈ రోగము నివారణ చేసుకోవటానికి దైవ చింతన అవసరము. కనుక, ''సర్వదా సర్వకాలేషు సర్వత్ర హరిచింతనం'' అన్నారు.

## భీష్మాచార్యుని త్యాగం :

ప్రాచీన కాలములో మహర్షులందరూ అరణ్యములకు వెళ్ళి కందమూలాదులు ఆకలి తీర్చుకొనే నిమిత్తము భుజించి పవిత్రముగా కాలము గడుపుతూ వచ్చారు. వారికి ఎట్టి రోగములు రాలేదు. నిరంతరము పుష్టిగా, సంతుష్టిగా ఉండేవారు. ఎంత దూరమో నడిచేవారు. ఎన్ని పనులో చేసేవారు. వారి వారి కర్మలు వారే సల్పుకునే వారు. ద్వాపర యుగమందు మహాభారత యుద్ధ సమయము నందు కృష్ణునకు 78 సంవత్సరములు. ద్రోణునికి పెద్ద వయస్సే, కౌరవులకు సైన్యాధిపతిగా ఉంటున్నాడు. అతనికి 126 సంవత్సరములు అతనే భీష్ముడు ఈ 126 సంవత్సరాలున్న వాడు ఛీఫ్ గా ఉన్నాడు. ఇతనికి ఆరోగ్యము దేనివల్ల కలిగింది. అతను ప్రతి విషయమందు ఏమాత్రము దుస్సంగమునకు అవకాశమివ్వలేదు. పవిత్రమైన భావములతో చింతించుకుంటూ వచ్చాడు. నిరంతరము పరోపకార సంబంధమైన కార్యములు చేస్తూ వచ్చాడు. అతను గాంగేయుడు. గంగాపుత్రుడు. తండ్రి నిమిత్తమై సర్వము త్యాగము చేసాడు.

శంతనుడు సత్యను పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. అప్పుడు సత్య తండ్రి కొన్ని నిబంధనలు పెట్టాడు. ''అయ్యా! నీకు ముందుగనే ఒక కుమారుడున్నాడు. కుమారుని వదలి నా బిడ్డకు పుట్టే కుమారునకు రాజ్యము ఇవ్వాలని కోరుతున్నాను. అది ఇవ్వగలవా! నీవు''? శంతనునికి చాలా విచారము వేసింది. గొప్ప భక్తి ప్రపత్తులు గలవాడు గాంగేయుడు. మహాజ్ఞాని, సర్వసంగపరిత్యాగి, పరిపూర్ణహృదయుడు, పవిత్రభావములు కలిగినవాడు. అట్టి గాంగేయుని మనస్సు కష్టపెట్టడం ఎట్లా? నాకు అక్కరలేదన్నాడు. కానీ లోపల విచారముగా ఉన్నాడు. ఇదే మనస్సు

యొక్క సంకల్పము సత్యను పెండ్లి చేసుకోవాలనుకున్నాడు. పైకి మాత్రము కప్పినప్పటికిని లోపల విచారము చెందుతున్నాడు

ఒకనాడు గాంగేయుడు తండ్రిని చూచాడు ''తండ్రీ! ఎందుకు మీరు విచారిస్తున్నారు మీకు ఏదైనా కోరిక ఉంటే చెప్పండి నాకు చేతనైనంత వరకు సహాయము చేస్తాను'' అన్నాడు. తండ్రి కుమారుని దగ్గరగానీ, కుమారుడు తండ్రి దగ్గర గానీ రహస్యము ఉంచుకొనేవారు కాదు. అప్పుడు తండ్రి చెప్తాడు. ''నేను సత్యవతిని పెండ్లి చేసుకోవాలని '' అనుకొన్నాను. కానీ, వారి కోరిక ధర్మవిరుద్ధముగా ఉంటున్నది. కనుక నేను వద్దని చెప్పాను'' అని అన్నాడు. ''నాన్నా! నీ అభీష్టము నెరవేరాలంటే నేను వివాహమాడనన్నాడు. అప్పుడు కూడా సత్యవతి తండ్రి, ''అయ్యా! నీవు ఈనాడు వివాహము చేసుకోకుండా ఉండవచ్చు కానీ, రేపు చేసుకోవచ్చు. ఆ తర్వాత పుట్టిన పిల్లలు నాకూ రాజ్యము కావాలని ఆశించవచ్చు'' అన్నాడు. ఛీ! నాతండ్రిని కష్టపెట్టే భావము నాకు వద్దు అని నా జీవితాంతమంతా బ్రహ్మచారిగనే ఉంటానని'' ప్రతిజ్ఞచేసాడు. ఇది కఠినమైన ప్రతిజ్ఞ కనుక భీష్ముడని పేరు పెట్టారు.

శ్రీరామచంద్రుడు తండ్రి నిమిత్తమై 14 సంవత్సరములు అరణ్యవాసము చేసాడు. కానీ, భీష్ముడు యావజ్జీవితమే తండ్రి కోసము త్యాగము చేసాడు. కనుక అతని జీవితము అంతపవిత్రముగా ఉంటున్నది. మహాభారత యుద్ధములో క్రింది కూలిన తరువాత పవిత్రమైన ఉత్తరాయణ కాలము వచ్చేంతవరకు ఉండాలనుకున్నాడు. తన సంకల్పము ప్రకారమే అంతవరకు ఉండగలిగాడు. మనస్సును స్వాధీనము చేసుకున్నాడు. ఉత్తరాయణ కాలము వచ్చేంత వరకు ప్రాణము వదల కూడదు అనుకున్నాడు. 56 దినములు శరతల్పముపై పరుండి బాధపడుతూ ఉత్తరాయణ కాలమునకై కాచుకున్నాడు. ఈ బాధలను భరిస్తూ

పవిత్రమైన కాలములో ప్రాణము విడవాలని సత్సం కల్పము అందరికి కల్గుతుందా? ''అబ్బ! ఈబాధలు భరించుకోలేను. ఎంత త్వరగా పోతే అంతమంచిది'' అని అనుకుంటారు ఎన్ని బాధలైనా భరిస్తాను కానీ పవిత్రమైన కాలము రావాలి. ఈ మనస్సు ఆటలకు తను ఏమాత్రము లొంగలేదు. తన సంకల్పములను తన స్వాధీనమందు ఉంచుకున్నాడు. అందువలన భీష్ముడు యింతగొప్ప జ్ఞానిగా రూపొందాడు. అట్టి పవిత్రమైన భీష్ముడు ప్రాణము విడిచే ముందు శాంతి పర్వము బోధించాడు.

### ***ధీరత్వంతో దివ్యత్వం :***

ఇట్టి మహానీయుల తత్త్వములు భారత చరిత్రలో అనేకంగా కనిపిస్తూంటాయి. ఇట్టి పవిత్ర చరిత్రలను ఈనాటి యువకులు గుర్తించటానికి ప్రయత్నించటంలేదు. తాత్కాలిక సుఖములకోసమని, ప్రాకృతమైన, క్షణభంగురమైన, సుఖముల కోసమని కేవలం ఆలోచనలు జరిపి, అనారోగ్యమునకు గురై కృశించి పోతున్నాడు. ఈనాటి పిల్లలు ఎట్లుండాలి? గుండును కొడితే గుండు పగలాలిగానీ పిల్లవాని తల పగలకూడదు. అంతటి శక్తి వంతులుగా ఉండాలి కానీ ఎక్కడ ఉంది? **16** సంవత్సరములు వచ్చాయంటే పెద్దముసలి వానివలె వంగిపోతున్నాడు. కారణము దుస్సంకల్పములే. యుక్తవయస్సును పవిత్రమైన మార్గములో ప్రవేశపెట్టి ధీరత్వము పొందాలి. దివ్యత్వము పొందాలి. ఇది నిజమైన మానవత్వము. అంతేగానీ తుచ్ఛమైన అల్ప వాంఛలచేత అదృష్టవశాత్తు గల్గిన ఈ శరీరమును కృశింపచేసుకో కూడదు. ఈనాడు ఎక్కడైనా మీరు పోయి చూడండి. రోగములతో కృశించి పోయే వారిని చూస్తే వారిలోని చెడ్డ గుణములు మనకు ప్రత్యక్ష సాక్షిగా కనిపిస్తాయి. మంచి సంకల్పములున్నవాడు ఈ రోగములకు గురికాడు. దీనికి యిదే

ప్రత్యక్షనిదర్శనము. కనుక మనము పవిత్రభావములను పెంచుకోవాలి. కానీ ఈనాడు నీ మనస్సుకే బానిస అయినావు. దీనివల్లనే యిన్ని బాధలకు గురి అవుతున్నావు.

**మనోనిగ్రహంతో కర్మఫలత్యాగం:**

విద్యార్థులారా! మనస్సుకు ఆధీనమైన వారు దేనిని పొందలేరు. కానీ మనస్సును స్వాధీనపరచుకున్నవాడు దేనినైనా పొందగలడు. దేనినైనా సాధించగలడు. కనుక 'యోగః చిత్త వృత్తి నిరోధకః' అన్నాడు పతంజలి. చిత్తవృత్తులను నిరోధించుట నిజమైన యోగమన్నాడు. అదియే నిజమైన మానవత్వము. దానిని మనం ఏనాడు అరికట్టుదుమో అనాడే మనం దివ్యమైన భావమును పొందగలం. కానీ ఎన్ని సాధనలు చేసినా ఇవన్నియు ప్రయోజనం లేదు. ఇవన్నీ మనస్సు ఆధారంతో చేస్తున్నావు. ఈ మనస్సు ఆధారంతో చేసేవి పనికిరానివి. అల్పతృప్తులకై మనస్సును ఆధీనం చేసుకోకుండా పోతున్నావు. నీ అల్పతృప్తి నిమిత్తమై మనస్సుకు దాసుడై పోతున్నావు. నీవు చేసే సాధనలు మనస్సుకు అతీతమైనవిగా ఉండాలి. అనగా తత్ఫలితనిమిత్తమై కాకుండా చేయాలి. నేను యిది చేస్తున్నాను దీని ఫలితము యిట్లా రావాలి. ఈ ఫలితనిమిత్తమై చేయకుండా పరమాత్మనిమిత్తమై చేసే కర్మలు సత్కర్మలే. కనుక కర్మఫల త్యాగమన్నారు. కర్మఫలము వస్తుంది. ఏపని చేసినా దానికి ఫలముంది. కానీ ఆ ఫలము నీవు త్యాగము చేయి. అదియే నిజమైనది.

మనస్సు యొక్క ప్రభావము మానవునిపై అమితంగా ఉంటున్నది. మనసునుపట్టే మనిషి అనే పేరు వచ్చింది. మనసు లేనివాడు మనిషి కాదు. మనస్సే లేక పోతే మహర్షి అయిపోయినాడు. మనస్సుంది కాబట్టి మనిషి అయ్యాడు. కనుక నీవు మనిషి కాకూడదు. మహర్షి కావాలి. అప్పుడే నీ

జీవితాన్ని సార్థకం గావించుకున్న వాడౌతావు. సంకల్పాలు మీలోవస్తుంటాయి. ఈ సంకల్పములు వచ్చినప్పుడు విచారణ చేయి Is it good or bad?. right or wrong? అని discrimination చేసి చెడ్డదైతే తక్షణమే దానిని ప్రక్కకు నెట్టు. నీకు తెలుసు మంచి అని చెడ్డ అని వస్తాయి.

***భగవంతుని సామీప్యమే ఉపవాసం ఉపాసన:***

తలంపులు, ఆహారవిహారాదులచే అవి వస్తాయి. ఆహార, విహారములు ప్రధానంగా తీసుకోవాలి. నిన్న చెప్పాను. habits గూర్చి ''త్యజ దుర్జన సంసర్గం'' చెడ్డవారితో చేరటంచేత ఆ habits వస్తుంటాయి. ఈ చెడ్డ habits పూర్తిగా దూరంచేసుకోవాలి. దైవత్వమునకు సమీపముగా పోవాలి. అదే ఉపవాసమన్నారు. ఉపవాసమంటే ఏమిటి? అన్నంతినకుండా ఉండటమా? పండ్లు పాలు మాత్రమే భుజించటమా! ఇదికాదు ఉపవాసము. ఉప- సమీపము - వాసము నివసించటము. భగవంతునికి సమీపములో నివసించటము ఉపవాసము. భగవంతుని సమీపములో నివసించటం వలన నీకు ఏమి ప్రాప్తిస్తుంది? Air Conditioner ఉంటున్నది. Air Conditioner సమీపములో పోయి కూర్చుంటే నీలో వేడిపోతుంది. చల్లదనము హాయినందిస్తుంది. అదే రీతిగా భగవంతుని సమీపములో పోయి కూర్చుంటే ప్రాకృతభావములు దూరమై భగవద్భావములు ప్రారంభిస్తాయి.

ఉపవాసమన్నా, ఉపాసన అన్నా యివన్నీ దైవత్వమునకు సమీపమునకు చేర్చేవే. అంటే సర్వత్రా ఉన్న దైవత్వమును నిరూపించేది ఉపనిషత్తు. ఈ ఉప అనే పదమునకు సమీపత్వమని తెలుకోవాలి. అట్లుగాక ఉపవాసమనుకొని చాలామంది పిచ్చిపిచ్చి మార్గములు పడుతుంటారు. భీష్మఏకాదశి అని

వస్తుంది. మూడుదినములు ఉపవాసముంటారు. ఈ మూడు రోజులు ఎంగిలి కూడ మింగరు. ఉపవాసము యిదే అనుకుంటారు రెండవ దినము 40 దోశెలకు పిండికలుపుతారు. దీనినే కన్నడములో చెబుతారు 'ఇందు కూడ ఏకాదశి. బందు తిందే నలువత్తు దోశె'. ఏకాదశి అని నలభై దోశెలు మనం భుజిస్తాము. డజను అరటి పండ్లు మూడు శేర్లపాలు యివన్నీ తింటే ఉపవాసమవుతుందా? ఇదికాదు ఉపవాసము. వారమునకొక పర్యాయము కడుపు కొంచెము ఖాళీ పెట్టాలి.

***సంకల్పములను త్యజించటమే విశ్రాంతి :***

మనస్సుకు కూడా విశ్రాంతి యివ్వాలి. మనస్సుకు విశ్రాంతి ఇచ్చే అవకాశము లేకుండా పోతున్నది. ఇనుప మిషనులకు విశ్రాంతి నిస్తున్నారు. ఎందువల్ల? ఎప్పుడూ తిరిగి తిరిగి బోల్టులు నట్లు అన్నీ అరిగిపోతున్నాయి కనుక విశ్రాంతి కావాలంటారు. మనస్సు వెలుతురు కంటె వేగముగా పరుగెత్తి పోతున్నది. మనస్సు వేగము యిట్టిదని చెప్పటానికి వీలుకాదు. ఇంతవేగముగా పోయే మనస్సుకు విశ్రాంతి లేకపోతే ఏమైపోతుంది. దానివల్లే పిచ్చివారుగా మారిపోతున్నారు. దీనికి విశ్రాంతి యివ్వాలి. విశ్రాంతి అంటే ఏమిటి? మనస్సుతో సంబంధము లేకుండా ఉండటమే విశ్రాంతి. కనుక సాధ్యమైనంతవరకు సంకల్పాలను తగ్గించుకోండి. చదువుకోవలసిన విషయములపై మనసు పెట్టండి. ఎంత చదువో అంతవరకు మీరు చదవండి. మితిమీరిన ఆలోచనలకు ఆవకాశము యివ్వవద్దు. అప్పుడే నీ మనస్సు నిన్ను వదలి పోతుంది. మనస్సుకు నీపై విరక్తి రావాలి కానీ, నీకు మనస్సుపై విరక్తి వస్తే ప్రయోజనం లేదు. ''నన్ను ఉపయోగపెట్టుకోవటం లేదు యీమనిషి'' అని తనకు తానే వదలి పెట్టి పోతుంది. దీనిని ఏ మాత్రం వినియోగించకూడదు. ఆ విధంగా మనస్సును పక్కన పెట్టాలి. గేటు దగ్గర Watch Dog మాదిరి చూడాలి. ఆ విధంగా చూచి నప్పుడే

నీ చెంతకే మాత్రము రాదు. ఇది సాధనలో ఒక ముఖ్యసాధనగా నిరూపిస్తూ వచ్చారు.

భగవంతుడు ఉన్నత స్థాయిలో ఉన్నాడు. మిద్దెపై ఉన్నాడు భగవంతుడు. క్రింద గేటు దగ్గర మనస్సనే Dogను ఉంచాడు. ఎవరిని లోపలకు రానివ్వద్దు అని చెప్పాడు. ఎవరు దగ్గరకు రావటంలేదు. అయితే ఎట్టివారిని భగవంతుని దగ్గరకు విడుస్తుంది? ఆ Dog దగ్గరకు వచ్చి Dogను Friendship చేసుకోటానికి ప్రయత్నిస్తే అది Permission యివ్వవచ్చు లేక పోతే యివ్వకుండా పోవచ్చు. మనస్సును లోబరచు కోవాలి లేక క్రిందనుంచి ఓ స్వామీ! ఓ స్వామీ! అని గట్టిగా కేకలు వేయాలి. అప్పుడు స్వామి క్రిందకు దిగి వస్తాడు. క్రిందికి దిగి భగవంతునితో కలిసిపోతుంటే Dog ఏమీ చేయదు. భగవంతుని క్రిందికి దింపి లేక అతనితో చేరైనా నీవు లోపలికి ప్రవేశించాలి. లేక ఈ మనస్సు అనే Dogను వశమైనా చేసుకోవాలి. ఈ రెండింటిలో ఏదో ఒకటి సలిపినప్పుడే నీవు భగవంతుని లో చేరటానికి వీలవుతుంది. కనుక మనసును వశము చేసుకోటమే జ్ఞానము. భగవంతుని క్రిందికి పిల్చి అతనితో చేరిపోవుటయే భక్తి. మనము భక్తిచేత భగవంతుని Friendship అయినా చేసుకోవాలి లేక మనస్సునైనా వశము గావించుకోవాలి. ఈ రెండింటిలో ఏదో ఒకటి చేసినప్పుడే దివ్యత్వము పొందగలుగుతాము. లేకపోతే ఏనాటికి దివ్యత్వము పొందలేము. ఈ ప్రపంచములో కోటాను కోట్లమంది ఈ స్థితిని పొందటానికి ప్రయత్నిస్తున్నారు. ఒక్కరైనా పొందటానికి వీల్లేక పోయింది. కారణం ఏమిటి! మనస్సుతో చేస్తున్నారు. మనస్సుతో చేసేంతవరకు మాధవుడు చిక్కడు. కనుక సత్యజ్ఞానమనంతమైన దివ్యత్వము తోనే సత్యమును పొందాలి. దానితోనే దాన్ని పొందాలి.

*తేది 7-10-97 సాయికుల్వంత్ హాల్*

# మేధా శక్తి - బుద్ధి శక్తి

*స్వబోధే నాన్య బోధేచ్ఛా బోధ రూప తయాత్మనః।*
*నదీపస్యాన్య దీపేచ్ఛా యథాస్వాత్మ ప్రకాశనే ॥*

ప్రేమ స్వరూపులారా!

వెలుగుతున్న దీపమును చూచుటకు మరొక వెలుగు మనకెందుకు? ఈ నాటి మానవుని హృదయము నిరంతరము ప్రకాశించుచునే ఉన్నది. కాని అట్టి సత్యనిత్యమైన ప్రకాశమును తెలుసుకొనలేక మానవుడు దీనిని తెలుసుకొనుటకు జ్ఞానము కావాలని ఆశిస్తున్నాడు. ఇట్టిదే పెద్ద అజ్ఞానమని చెప్పవచ్చు. ఇట్టి అజ్ఞానమును పోగొట్టుకొనే నిమిత్తమై మనము అనేక మంది గురువులను చేరుతున్నాము. నిజముగా ఆత్మ జ్ఞానమునకు గురువు అక్కరలేదు. ఇట్టి ఆత్మ జ్ఞానమును ఏ గురువు అందించలేడు. ఎందుకనగా ఈ ప్రకృతియే తన బిడ్డలను సంరక్షించే నిమిత్తమై అనేక ఆదర్శములను గైకొని వచ్చింది.

### ప్రకృతి అందించే గుణపాఠాలు:

ప్రతి మానవుడు పృథ్వీపుత్రుడే. తన పుత్రుని జ్ఞానవంతుని గావించే నిమిత్తము తానే అట్టి దివ్యత్వము తీసుకొనివచ్చినది. తన పుత్రులకు బోధిస్తున్నది భూదేవి ''నాయనా! నీవెందుకు గురువు నిమిత్తమై ప్రాకులాడుతున్నావు. ఇది కేవలము అజ్ఞానమే. నన్ను చూడు నన్ను గుర్తించి నా విషయము చక్కగా అర్థము చేసుకో. అనేకమంది బలవంతులు, విద్యావంతులు, గుణవంతులు నన్ను తవ్వి అనేక విధములుగా తీసి బాధిస్తున్నారు. సొరంగములు తవ్వే నిమిత్తమై బాంబులు పెట్టి పేలుస్తున్నారు. బావులు తవ్వే నిమిత్తమై గడ్డపారలచే నన్ను తవ్వుతున్నారు. ఇంకా అనేకరకములైన బాధలు నన్ను పెడుతున్నారు. కానీ నేను కించిత్తైనా విచారించటంలేదు. ఈ శాంతమే నీవు నేర్చుకో. ఎవరెన్ని విధముల నిన్ను బాధించిన, ఎవరు నిన్ను దూషించి, తిరస్కరించిప్పటికిని నీవు ఏ మాత్రము చలించవద్దు. దూషణకు కృంగ వద్దు. భూషణకు పొంగవద్దు. ఈ రెండింటిని సమత్వంగా నీవు భావించు. ఇదే 'సుఖ దుఃఖ సమేకృత్వా లాభా లాభౌ జయా జయౌ' ఈ రెండింటిని సమత్వంగా భావించు. ఇదే ఆత్మ జ్ఞానము''.

రెండవది జలము. అది కూడా ప్రకృతిలో ఉండినటువంటిదే. ఇవన్ని దైవము యొక్క అను భూతులే. అంశములే. ఆజలము చెబుతున్నది. ''నాయనా నీవు కాలమునకు మార్పుచెందుతున్నావు' నేను ఎన్నియోరీతులుగా మధురముగా, నిర్మలంగా ఉంటున్నాను. నాకు సహజమే యిది. నిర్మలత్వము నా స్వభావము. మాధుర్యము నా స్వరూపము. పవిత్రత నాకు సహజము. మూడింటిని నీవు అనుసరిస్తూరా. శాంతము అత్యవసరము. అదియే నేను కోరుతున్నది. మనసులో మాధుర్యము, చల్లదనము పెంచుకో. దీనినే నేను three Ps అని

చెప్పాను. purity, patience, perseverence అని. ఈ మూడింటిని నీవు సాధించు. ఆత్మ జ్ఞానము నీకు ప్రాప్తిస్తుంది అని బోధిస్తుంది జలము.

అగ్ని - ''బిడ్డా! నేను మంచి చెడ్డ వ్యత్యాసము చూడను. చెడ్డను కాల్చి నేను చెడిపోవటం లేదు. మంచిని కాల్చి నేను అభివృద్ధికి రావటం లేదు. ఈ రెండింటిని సమత్వంగానే భావిస్తున్నాను. కనుక మంచి చెడ్డలనే విచారము నీయందు ఉంచుకోవద్దు. అన్నియు భగవత్ వరప్రసాదములే. ఇందులో మంచి ఒకటి, చెడ్డ ఒకటి ఎక్కడున్నది. అన్నియు భగవంతుడనుగ్రహించిన ప్రసాదములే. మంచి చెడ్డలను నీవు వ్యత్యాసము చేసుకొనక అన్నింటియందు సమత్వము వహించు. ఇదియే ఆత్మ జ్ఞానము'' అనింది. దీనిని పురస్కరించుకొనియే నేను అప్పుడప్పుడు చెబుతుంటాను. ప్రకృతియే మనకు పెద్ద గ్రంథము. ఈ గ్రంథము నుండి మనము ఎన్నియో నేర్చుకొనవలసినవి వున్నాయి.

గాలి - గాలి అన్ని ప్రదేశములకు వెడుతున్నది. ఏ దుర్గంధమును ఏ సుగంధములను ఏ మాత్రము తాను స్వీకరించటంలేదు. సర్వ ప్రాణులకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసముల నందిస్తున్నది. కానీ దేనితోను సంబంధము లేదు. ''అన్నింటియందు ఉన్నాను. అందరిలోను ఉన్నాను. కానీ నాలో ఏమీ లేదు!'' ఇది గొప్ప బోధ. అందరియందు ఉంటున్నాడు భగవంతుడు. కానీ భగవంతునిలో ఏమీ లేదు. అదే ''నిర్గుణం, నిరంజనం, సనాతనం, అనికేతనం, నిత్య శుద్ధ బుద్ధ ముక్త నిర్మల స్వరూపిణం'' అని ప్రబోధించింది వేదము.

**బుద్ధి నిర్ణయాత్మకం :**

అదేవిధముగా బుద్ధి ఈనాడు అత్యవసరమైనది. ఇది నిర్ణయాత్మకమని

భావిస్తున్నారు. అయితే మానవుడు ఈ నిశ్చలత్వము పొందే నిమిత్తమై అనేక రంగముల యందు అనేక విధములుగా దీనిని తెలుసు కొనుటకు ప్రయత్నిస్తున్నారు. కానీ ఎంత ప్రయత్నము చేసినా ఈ నిశ్చలత్వమనేది ఏ మాత్రము ప్రాప్తించుట లేదు. కనుక తాము చేసే సమస్త ప్రయత్నములు విఫలమైపోతున్నాయి. ఈ నిశ్చలత్వము పొందే నిమిత్తమై మానవునకు బుద్ధి నందించాడు. ఈ బుద్ధి స్థిరత్వముతో ఉండేది. అట్టి బుద్ధిని మనం గుర్తించుటకు ప్రయత్నించాలి. దీనినే వేదాంతమందు ''అంతర్వాణి'' అన్నారు. మనం నిశ్చలాత్మ తత్త్వమును పొంద లేకపోవడానికి కారణములు రెండే రాగద్వేషములతో కూడటంచేతను, మానవత్వములోనున్న దివ్యత్యమును విచారించ లేక పోవటంచేతను, కేవలం ప్రాకృతమైన జీవితము గడపటం చేతను, ఈ నిర్ణయత్వమును మనం పొందలేక పోతున్నాం. ఎప్పుడు చూచినా ఈ ప్రాకృతమైన పదార్థములందే మన దృష్టి ప్రసరిస్తూ ఉంటున్నది. మన దృష్టి భౌతికమైన దృష్టిగా ఉంటున్నది. దీని ద్వారా చంచలత్వము పొంద గలుగుతున్నాము. ఈ చంచలత్వము చేత నిర్ణయాత్మక బుద్ధిని సాధించలేకపోతున్నాము. కనుక ఈ ప్రాకృత దృష్టిని తగ్గించుకోవటం చేత నిర్ణయాత్మక బుద్ధిని సాధించగలము. అన్నింటికంటె గొప్పది బుద్ధి.

### మేధాశక్తి కంటెబుద్ధిశక్తి గొప్పది :

భూమి, దానికంటె ఉత్తమమైన తత్త్వములో దేహము, దేహము కంటే సూక్ష్మస్థాయిలో ఇంద్రియములు, ఇంద్రియముల కంటె మరింత సూక్ష్మమైనది మనస్సు, మనస్సు కంటె మరింత సూక్ష్మమైనది బుద్ధి, బుద్ధి కంటె మరింత సూక్ష్మమైనది ఆత్మ. ఇట్టి ఆత్మతత్త్వమునకు అత్యంత సమీపములో ఉండటంచేత ఈ బుద్ధి చాలా తేలికైనదిగాఉంటున్నది. కనుక ఉపనిషత్తునందు ఒక కథగా బోధించారు. బుద్ధిని ఎట్లానిర్ణయించారు? బుద్ధిని పక్షిరూపంగా వర్ణించారు. ఇందులో తలకు మాత్రమే 'బుద్ధి' అని

పేరు పెట్టారు. కుడిరెక్కకు 'ఋతం' అని పేరు పెట్టారు ఎడమ రెక్కకు 'సత్యమ'ని పేరు పెట్టారు. తోకకు 'మహత్ తత్త్వమ'ని పేరు పెట్టారు. బాడీని 'యోగ'మన్నారు. అనగా బుద్ధిలో ఈ ఐదు అంగములు లీనమైఉన్నాయి. విచారణా శక్తి, ఋతశక్తి, సత్యశక్తి, మహత్‌శక్తి, యోగశక్తి ఈ ఐదింటితో కూడినదే ఈ బుద్ధి. ఇట్టి బుద్ధి యొక్క తత్వమును మానవులు గుర్తించుకొనలేక మేధాశక్తి బుద్ధి కంటె అధికమైనదని భ్రమిస్తున్నారు.

విక్రమాదిత్యుడు ఒకానొక సమయములో పండిత సమావేశము జరిపాడు. ఈ సమావేశములో ''బుద్ధి గొప్పదా లేక మేధాశక్తి గొప్పదా'' న్నిర్ణయము చేయుమని కోరాడు. గొప్ప గొప్ప పండితులు ఆ సమావేశములో పాల్గొన్నారు. కానీ ఎవరు సాహసించి న్నిర్ణయించి చెప్పలేదు. అప్పుడు విక్రమాదిత్యుడు చెప్పాడు. మేధాశక్తి కంటె బుద్ధి శక్తి గొప్పది అన్నాడు. ఆస్థ ,స్వాస్థ అనే రెండు పదములు చెప్పాడు. ఆస్థ అనే పదమునకు ఆసక్తి అని అర్థము. స్వాస్థ అనే పదమునకు స్థిరత్వమని అర్థము. బుద్ధియందు ఈ రెండు శక్తులుంటున్నాయి. ఈ రెండులేని మేధాశక్తి ఉపయోగమేమిటి? మేధాశక్తిలో ఈ రెండు లేవు. ఆ సక్తి ఉంటేనే విశ్వాసము కలుగుతుంది. విశ్వాసము ఉంటేనే శ్రద్ధకలుగుతుంది. ఆసక్తి, విశ్వాసములేని మేధాశక్తి నిష్ప్రయోజనం అన్నాడు. ఆసక్తితో ఉండిన బుద్ధి, స్థిరమైన బుద్ధి ఈ రెండింటిచేత మానవత్వము దివ్యత్వమును పొందగలుగుతుంది అన్నాడు.

**సత్యం, ఋతం, రసం:**

ఇక్కడ ఋతము, సత్యము అని రెండు ఉన్నవి. ఋతమనగా ఏమిటని విచారణ చేస్తే అది ''త్రిగుణాత్మకమైన తత్త్వము''. తలంపు, వాక్కు, చేత -యీ మూడింటి ఏకత్వమే ఋతము. ఇట్టి ఋతము

నుండి వచ్చిన శబ్దమునే సత్యము అన్నారు ప్రతి మానవుడు భుజించు సమయమందు ఋతమును, సత్యమును ప్రోక్షించి భుజించమని బోధించారు. తద్వారా భౌతికమైన దేహమునకు, అంతరింద్రియములకు తగిన శక్తి సామర్థ్యములు మనకు అబ్బుతాయి అనే విషయమును బోధించాడు విక్రమాదిత్యుడు. మానవునికి బుద్ధిచేతనే సర్వము సాధించుటకు వీలుంది గానీ మేధాశక్తిచేత ఏమీ సాధించవీలులేదు. మేధాశక్తిలో ఆసక్తి తక్కువ. స్థిరత్వము తక్కువే. ఆసక్తి, స్థిరత్వము రెండూలేని మేధాశక్తి ఎట్లా గొప్పని భావించవచ్చు?

అన్నం బ్రహ్మ అన్నారు. అనగా దైవస్వరూపముతో కూడినది ఈ అన్నము అన్నారు. ఇంక రసం రసమనేదే బ్రహ్మ తత్త్వము-భోక్త, మానవత్వములోని తత్వమును ఈ రకముగా ప్రబోధించి అన్నము, రసము, భోక్త మూడింటిని బ్రహ్మ, విష్ణు, మహేశ్వర తత్త్వముగా విశ్వసిస్తూవచ్చారు. ఈ మూడింటి తత్త్వము ఈ ఋతము నందు చేరి ఉంటున్నది. ఈనాడు ఈ మూడింటి ఏకత్వము లేనివాడు జ్ఞాని అని చెప్పుకోటం చెల్లదు.

**ఉభయభారతి జ్ఞాన బోధ :**

శంకరాచార్యులవారు ఒకానొక సమయంలో దిగ్విజయ యాత్ర సల్పుతూ వచ్చారు. ఈ దిగ్విజయ యాత్రలో మండన మిశ్రుని కలిశాడు. మండనమిశ్రుని తో వాదోపవాదములు సల్పాలని ఆశించాడు. అద్వైతజ్ఞానం వివరించాలని భావించాడు అయితే ఇద్దరూ గట్టివారు. ఎవరు జయించగలరనే నిర్ణయము ఎవరు చేయగలరు. ఇరువురి వాదోపవాదములలో విజయము నిర్ణయించేవారు ఎవరు? అని ఆలోచించే సమయంలో మండనమిశ్రుడు శంకరులవారినే నిర్ణయముచేయమన్నాడు. మండనమిశ్రుని ధర్మపత్నియైన

ఉభయభారతి సత్యవాది ఆమెను జడ్జీగా పెట్టుకొని వాదోపవాదములు ప్రారంభిస్తాము అన్నాడు. ఎవరితో వాదిస్తున్నాడో ఈ శంకరులు అతని భార్యనే జడ్జిగా పెట్టుకోవటమనేది ఈ కాలములో చెల్లుతుందా? ఆనాడు ధర్మసూత్రములను పాటించేవారు. ఆత్మజ్ఞానమే వారి లక్ష్యము. ఆమె సత్యవాది. ఇతను భర్తయే, అతను గురువే అనే భేదభావములామెకు ఉండవు. ఆమెయే తగిన జడ్జి అని నిర్ణయించాడు. కడపటికి మండనమిశ్రుడు ఓడిపోయాడు. ఓడిపోవటంచేత శంకరులవారికిచ్చిన మాట ప్రకారము తక్షణమే సన్యాసము స్వీకరించి శంకరుల వారితో వెళ్ళిపోయాడు. ఇంక ఉభయభారతి మండన మిశ్రుని ధర్మపత్ని. అర్ధాంగి కావటంచేత భర్త సన్యసించినప్పుడు నేను కూడ సన్యసించక తప్పదు అని ఆమె కుడా సన్యసించి చిన్న ఆశ్రమము నిర్మించుకుంది. అక్కడ స్త్రీలను మాత్రమే చేర్చుకొని వారికి పవిత్రమైన ఆత్మతత్త్వము ప్రబోధిస్తూ వచ్చింది. వేదశాస్త్ర ఇతిహాస పురాణముల సారము ప్రభోదిస్తూ వచ్చింది.

వేదములన్నీ ద్వైతములే. వేదాంతము ఒక్కటే అద్వైతము. వేదములందు 'అది కావాలి, ఇదికావాలి' అనే ఆశలు మెండుగా వుంటున్నాయి. చిన్నఉదాహరణ : నాకు గాలి కావాలి. గాలికూడ ఎట్లా వుండాలి నాకు అనుకూలమైన గాలిగా ఉండాలి. వత్తిడి పెట్టే గాలిగా వుండకూడదు. హింసింప చేసే గాలిగా ఉండకూడదు. నాకు అవసరమైన గాలి మాత్రమే కావాలి. అదీ ఒక కోరికే. వేదములన్నీ వాంఛలతోకూడినవే. ద్వైతముతో కూడినవే. కనుక మనం యజ్ఞము చేసే సమయంలో మొదటి ఆరు దినములు వేదము పఠిస్తారు. ఏడవ దినము ఉపనిషత్తులు ప్రారంభిస్తారు. ఉపనిషత్తులే అద్వైతము. ఏమిటి అద్వైతము. ఒక్కటే దర్శనము. ''అద్వైతదర్శనం జ్ఞానం'' అన్నారు కట్టకడవటికి. జ్ఞానమే అద్వైతము. ''జ్ఞానాదేవతు కైవల్యం''. తద్వారా ఎంతైనా పొందవచ్చు. ఈ

విధంగా స్త్రీలకు బోధిస్తూ వచ్చింది ఉభయభారతి.

ఆమె తన శిష్యురాండ్రతో నిత్యము గంగా తీరమునకు వెళ్ళుటము, స్నానం చేయటము, అక్కడ వేదాంతము బోధించటము, తిరిగి వారిని వెంట తీసుకురావటము నిత్యకర్తవ్యము. ఒకనాడు వారు గంగా నదికి వెడుతుండగా ఒక బోర్డు చూచారు. ఏమని? 'బ్రహ్మజ్ఞాని ఆశ్రమము' అని పెట్టారు. ఏమిటి ఈ పేరుకు తగిన లక్షణములు ఎవరికైనా ఉన్నాయా? అని విచారిస్తూ వచ్చింది ఉభయభారతి. కొంతదూరములో ఒక మహనీయుడు నీరు త్రాగే సొరకాయ తల క్రింద పెట్టుకొని పవ్వళించాడు. అక్కడున్న వారు చెప్పారు. ఈయనే బ్రహ్మజ్ఞాని అని. ఉభయభారతి ఫక్కున నవ్వింది. అయ్యో! పాపం! బ్రహ్మజ్ఞానికి ఈనీటి ముంతపై ఎందుకు ఆశరావాలి. నీటిముంతను భద్రత కోసమని తలక్రింద పెట్టుకున్నాడు అని ఆయన వినాలనే గట్టిగా చెప్పింది శిష్యురాండ్రకు. అప్పుడు వారు నవ్వారు. అది చూచాడు ఆమాటలు విన్నాడు బ్రహ్మజ్ఞాని. చాలకోపం వచ్చింది. తిరిగి వారు వచ్చే సమయమునకు వేచి ఉన్నాడు. ఆ వచ్చే సమయంలో తన తలక్రిందనున్న ముంత తీసి పారవేశాడు నాకు ఎంతో త్యాగముందని. అప్పుడు ఉభయభారతి చెప్పింది. ''అయ్యో! పాపము మనం పోయే సమయంలో కేవలం అభిమానమనే అనుకున్నాము. ఇప్పుడు క్రోధము కూడా ఉందే! ఈ అభిమాన అహంకారములుండిన వాడు బ్రహ్మజ్ఞాని కాగలడా''. ఆమాట విని తాను చాలా యోచించాడు. ఈమె సామాన్య స్త్రీ కాదు. అనుకున్నాడు. లేచి వారిద్గరకు వచ్చి 'అమ్మా! మీరెవరు! మీరు కేవలం ఉభయభారతిగా కనిపిస్తున్నారు. మండనమిశ్రుని ధర్మపత్నిగానే భావించాను. నా దోషము క్షమించు. రాగ ద్వేషములుండినంతవరకు బ్రహ్మజ్ఞాని కానేరడు. అభిమాన మమకారములుండినంత వరకు ఆత్మ జ్ఞాని కాలేడు''. అని అమెకు

సాష్టాంగనమస్కారము చేసి నాకు బ్రహ్మజ్ఞానము బోధించమని ఆశించాడు.

**బుద్ధి నిర్ణయాత్మకం:**

ఆవిధంగా ఆనాటి కాలములో స్త్రీలు, పురుషులు అనే భేదము లేకుండా బ్రహ్మజ్ఞానము నిమిత్తమై సర్వులను ఆశ్రయించి, సర్వులను శరణుజొచ్చి నిత్యమైన ఆత్మజ్ఞానము పొందే నిమిత్తమై అనేక ప్రయత్నములు చేశారు. కనుక బ్రహ్మతత్త్వము మనం పొందాలనుకున్నప్పుడు శుద్ధసత్యమైన బుద్ధి మనలో రావాలి. ఈ బుద్ధి నిర్మలముగా, నిశ్చలత్వముగా, నిర్మోహమై ఉండాలి. ఇలాంటి నిశ్చలతత్త్వము కలగాలి. ఒక నిముషము ఒక విధంగా మరొకనిముషం మరొక విధంగా మార్పు చెందకూడదు. కొన్ని సమయములందు మనస్సు నిర్మలంగా ఉంటుంది. మరికొన్ని సమయములందు చాలా చంచలత్వంగా ఉంటుంది. ఈ చంచలత్వానికి, ఆ నిర్మలత్వమునకు కారణం ఏమిటి? ఈ ప్రాకృత వాంఛలే మూలకారణము. వాంఛలచేత మనస్సు మార్పులు చెందుతుంది. మనస్సు మార్పునకు కారణము - మనము ఒక వస్తువును చూచేటప్పటికి అదినాకు కావాలని ఆశిస్తుంది మనస్సు. ఆనాటి మహనీయులందరు ప్రజలు సంచరించే ప్రదేశములు విసర్జించి ఏకాంత ప్రదేశములకు వెళ్ళి ఏ పదార్థములను చూడక, వ్యక్తులతో సంబంధ బాంధవ్యములను కల్పించు కొనక నిర్మలంగా కన్నులు మూసుకొని భగవచ్చింతన చేస్తూ వచ్చేవారు. ఒక వేళ కన్నులు తెరచినా ఎవరు కనిపించే వారుండరు అడవిలో. ఒకానొక మహనీయుడు ఈవిధంగా విచారణ చేస్తూ వచ్చాడు. ''భగవంతుడా నీవు ఎంత నటన సూత్రధారివయ్యా. కన్నులనిచ్చి చూడమని చెప్పావు. తలుపులు బయటకే పెట్టావు. చెవులనిచ్చావు. చక్కగా గ్రంథములు వినమని చెప్పావు. గానము వినమని చెప్పావు. చెవులను బయటికే పెట్టావు. నోరు ఇచ్చావు స్మరించమని చెప్పావు. నోటికి కూడా తలుపులు బయటికే

పెట్టావు. దీనిలోని అంతరార్థము ఏమిటి? అన్నీ ఇంద్రియముల తలుపులు బయటికే పెట్టావు. బయటికే చూస్తాము గానీ లోపలకు ఎట్లాచూడగలము? బయటి తలుపులు మూసివేస్తే లోపల చీకటే అయిపోతుంది అని, అప్పుడు చెప్పాడు భగవంతుడు''. నాయనా చర్మచక్షువులకు తలుపులు యిచ్చాను. కానీ చర్మచక్షువులచేత నీకు జ్ఞానము లభ్యముకాదు. జ్ఞానచక్షువు నీకు అత్యవసరము. చర్మచక్షువులు చర్మదేహమునే చూస్తుంది గానీ ఆత్మదేహమును చూడదు. చర్మచక్షువులు అంతర్ముఖము గావించుకో. అప్పుడే నీవు ఆత్మ సందర్శనమునకు గురౌతావు. కనుక ఈ తలుపులను నీవు లోపలకు మార్చుకోవాలి.

మన ఇంటికి తలుపులు పెట్టాము. ఎందుకోసం? మనం బయటికి పోవటం కోసం, రావటం కోసం పెట్టాము. మన బంధుమిత్రులు లోపలకు రావటం కోసం, పోవటం కోసం పెట్టాము. కిటికీలు పెట్టాము గృహమునకు గాలి రావటం కోసం, పోవటం కోసం పెట్టాము. మన అనుకూలనిమిత్తమై తలుపులు పెట్టుకున్నాము. **Doors** ఉన్నాయి కదా అని బజార్లో పోయే పశువులు, పందులు, కుక్కలను నక్కలను లోపలకు ప్రవేశపెడతామా? లేదు. తలుపులు పెట్టాము కానీ వాటిని చేర్చకూడదు. మనము మాత్రమే రావటం పోవటం సల్పుకోవాలి. అందుకోసమే ఈ నిర్ణయాత్మక బుద్ధి అత్యవసరమన్నారు. దేనిని లోపల వదలాలి. దేనిని రానీయకుండా చూచుకోవాలి. అనే నిర్ణయాత్మక బుద్ధి రావాలి. ఇదియే బుద్ధికి ప్రధానమైనపని. ఎవరిని లోపలవదలాలి? ఎవరిని బయటకు వదలాలి. ఎవరి తో సరైన రీతిగా స్నేహము చేయాలి. ఎవరితో మనం స్నేహం చేయకూడదు, దేనిని మనం భుజించాలి, దేనిని మనం భుజించకూడదు, అని విచారించాలి. ఈ విధంగా చేయటం చేత ఆనాటి మహనీయులు మహాపురుషులుగా రూపొందారు.

## భిన్నత్వంలో సమత్వమైన ఏకత్వ దృష్టి:

ఆత్మజ్ఞానమనగా ఏమిటి? ఆత్మతత్వము ఒక్కటే. రెండు లేవు. ఉన్నది ఒకే ఆత్మయే. ''ఏకాత్మ సర్వభూతాంతరాత్మ''. కానీ అనేక ఆత్మ లుండినట్టు మనం భావిస్తున్నాము. ఇదియే భౌతిక దృష్టి. ఇదియే ప్రాకృత దృష్టి ఇదియే లౌకిక దృష్టి. ఇప్పుడింతమంది ఈ హాలులో ఉంటున్నారు. ఒక్కొక్కరి యందు ఒక్కొక్క ఆత్మ ఉన్నట్టుగా భావిస్తున్నారు మీరు. చాల అజ్ఞానమిది. ఒక్కొక్క దేహము ఒక్కొక్క పాత్ర. ఈ పాత్రలో మైండనే జలము ఉంటున్నది. కానీ పైన ఒక సూర్యుడున్నాడు. ఒకే సూర్యుడు అన్ని పాత్రలందు కనిపిస్తున్నాడు. ''ఒక సూర్యుండు సమస్త లోకములకు ఒక్కడై దోచు'' కానీ ఎంతవరకు ఈ ప్రతిబింబము దీనిలో కనిపిస్తుంది. జలముండినంత వరకు మాత్రమే కనిపిస్తుంది. పాత్రలో వ్యత్యాసము కనిపిస్తుంది కానీ ప్రతిబింబమునకు వ్యత్యాసములేదు. పాత్రలకు వెల ఉండవచ్చుగానీ ప్రతి బింబమునకు ఒకే వెల. అదే విధముగా ఆత్మతత్త్వము అందరియందు ఒకే నీడగా ఉంటున్నది. కానీ దేహభావములు, రూపనామములు ప్రత్యేకంగా ఉండవచ్చు. ఒకడు కోటీశ్వరుడు ఒకడు కూటికి పేదకావచ్చు. కానీ ఇద్దరిలో నున్న తత్త్వము ఒక్కటే. అందుకోసమే అందరికి సమత్వమైన ఏకత్వము నీవు విచారము చేయి. అప్పుడే భిన్నత్వము మనకు దూరమై పోతుంది. అందరికి ఏకత్వము ఎక్కడ ఉంటున్నది? దేహమునకు హృదయమునకు ఉన్న సంబంధము విచారించాలి.

వేదాంతము ప్రబోధిస్తూ వచ్చింది. ''నాయనా! పుట్టుక, చావు అందరికి ఒక్కటే. ఆకలి దప్పులు అందరికి ఒక్కటే. ఆనందము, దుఃఖము అందరికి ఒక్కటే. ఈ మూడింటి తత్వము నీవు ఏకత్వంగా భావించు. దప్పిక అందరికి ఒక్కటే. కూటిపేద భూమినుండి పుట్టిరాడు.

కోటీశ్వరుడు ఆకశమునుండి దుమికి పడడు. ఇరువురు తల్లి గర్భము నుండే వస్తున్నారు. ఇది ఇద్దరికి ఒక్కటే. కోటీశ్వరుడు విలువైన పదార్థములు ఆకలికోసం తిని ఆకలి తీర్చుకుంటాడు. కూటి పేద అంబలి గంజి తిని ఆకలిని తృప్తి పరచుకుంటాడు. ఈ ఆకలి ఇద్దరికి ఒక్కటే. ఆకలి తీరటం యిద్దరికి ఒక్కటే దప్పియిద్దరికీ ఒక్కటే. కోటీశ్వరుడు మంచి Cool Drink త్రాగుతాడు. కూటిపేద గంజి, నీరు త్రాగుతాడు.

అన్నములు వేరు ఆకలొక్కటే
శృంగారములు వేరు బంగారమొక్కటే
పశులవన్నెలు వేరు పాలు ఒక్కటే
జీవజంతువులు వేరు జీవుండు ఒక్కడే
జాతి నీతులు వేరు జన్మంబు ఒక్కటే
పూల జాతులు వేరు పూజలొకటే
బ్రతుకు కోసము బహుబాధ బద్ధులైరి

## సుఖాసనమంటే దయతోనున్న హృదయం

ఈ ఏకత్వమును మనం ఆలోచించుకుంటూపోతే మానవత్వములో ఏకత్వము మనకు తప్పక ప్రాప్తిస్తుంది. ఇది సహజమైన సాధన. ఈ సహజ సాధన విసర్జించి అమితమైన బాధలనందించే సాధనలకు మనం ప్రయత్నం చేస్తున్నాము. ఒక చిన్న ఉదాహరణము. సుఖాసనములో ధ్యానము చేయమంటారు కొంత మంది గురువులు. ఏమిటి సుఖాసనము. పద్మాసనమువేసుకొని చక్కగా భగవంతుని ధ్యానము చేయమంటారు. ఈ పద్మాసనము వేసుకొంటే సుఖమే ఉండదు. చాలా బాధ ఉంటుంది. ఈ బాధపడుతూ ధ్యానం ఏమిచేయగలడు? సుఖాసనమని పేరు పెడుతున్నాడు గానీ బాధాసనమైపోతున్నది. సుఖాసనమంటే హృదయములో సుఖము ఉండాలి. అదియే దయతోకూడిన హృదయము. అదే compassion,

అదే man kind. ఆ సుఖమైన హృదయముతో నీవు ధ్యానము చేయి. దేహముకాదు ప్రధానము. ఇది పాంచ భౌతిక దేహము. దుర్బలమైన కాయము. దీనితో నీవు సాధన చేయవద్దు. సుఖాసనమనే దానికి అర్థము తెలుసుకొని చేయి. సుఖము నీలో ఉంటున్నది గానీ బయటలేదు. నిజంగా సుఖము బయటనే ఉంటే అందరు సుఖపడేవారే. కానీ లోపల ఉన్నది. ఇది అందరికి తెలియదు. అది తెలుసుకుంటే అందరు సుఖపడతారు. ఇట్టి నిర్ణయాత్మక తత్త్వమును బోధించేదే బుద్ధి. మన సుఖము హృదయమునందే ఉంటున్నది. బయట ప్రదేశములో లేదు. బయటనే ఉంటే ఎంతమందో ఆకర్షించుకొని ఉండేవారు. ఎంతమందో దీనిని వశము చేసుకొనేవారు. బయటనే ఉంటే విదేశము వారు దీనిని ఎత్తుకొని పోయి ఉండేవారు. వేమన చెప్పాడు ''రాళ్ళంతా దేవుళ్లైతే రాజులంతా మ్రింగరా'' అని. అన్ని రాళ్లు కాదు దేవుళ్లు కానీ అన్ని రాళ్లలోను దేవుడున్నాడు. అణువు అణువున కణకణమున ఉన్నాడు భగవంతుడు. ఈ విధమైన విశాల భావములో అన్ని రాళ్లకు నీవు పూజ చేయి. అంతేగానీ కొన్ని రూపములను నిర్ణయించుకొని పూజ చేయటంగాదు.

దైవము లేని స్థానము లేదు. అన్ని విధాలా ఉంటున్నాడు భగవంతుడు. కానీ నీ కంటె ప్రత్యేకంగా భగవంతుడు లేడు. అది సాయి యొక్క ప్రత్యేక ఉపదేశము. భగవంతుడు నీ కంటె వేరు కాదు. విశ్వవిరాట స్వరూపుడనగా ''సహస్రశీర్షాపురుషః'' ఇదంతా విశ్వవిరాట్ స్వరూపమే. దేహము నీటి బుడగ వంటిది. మనస్సు పిచ్చి కోతి వంటిది. మనస్సును అనుసరించకండి. దేహమనే నీటి బుడగను అనుసరించకండి. హృదయమును అనుసరించండి అప్పుడే మానవత్వము తప్పక ధన్యమవుతుంది. ఇట్టి దివ్యత్వము మనయందే ఉంటున్నది కనుక ''అంతర్వాణి''యని బుద్ధికి మరొక పేరు పెట్టారు.

ప్రతి ఒక్క పలుకు బయట పలికేది reflection of the inner being. అంతా లోపల ఉన్న దానికి reflection, reaction, resound. చిన్న ఉదాహరణ: నీవు ఇంటికి జాబు వ్రాయాలని తలచుకున్నావు. ఈ కార్డు తీసుకొని తక్షణమే వ్రాయగలుగుతున్నావా? కాదు, ముందుగానే యోచన చేస్తావు. ఏమి వ్రాయాలి ఎట్లా వ్రాయాలి, ఎంత డబ్బు పంపించమని వ్రాయాలి, ఎన్ని మార్కులు వచ్చాయని వ్రాయాలి. ఇవన్నీ యోచన చేసుకొని తరవాత వ్రాత ప్రారంభమవుతుంది. మొదట నిర్ణయము చేసుకొని తరువాత వ్రాయగలుగుతున్నావు. ఈ జాబు జిరాక్సు ముందుగానే ఉంటున్నది నీలో - అదే విధముగా ఈ ఆనందము నీలోనే ఉంది. బయటపడే ఆనందము దాని reflection. ఈ విధమైన నిత్య సత్యము మనం చక్కగా గుర్తించినప్పుడే మానవత్వము దివ్యత్వముగా మారిపోతుంది.

**నిన్ను నీవు తెలుసుకో :**

విద్యార్థులారా! ఈనాటి పరిస్థితుల ప్రభావము ఆధ్యాత్మికమునకు విరుద్ధమైన మార్గమందు నడుస్తున్నది. కానీ ఇది సరైన మార్గము కాదు. నిజముగా దైవమును మరిస్తే సర్వము మరచినవారమవుతాము. నిన్ను నీవు మరచిన వాడౌతావు. నిన్ను నీవు మరచిన ఏమి ప్రయోజనం? నిన్ను నీవు తెలుసుకో. రమణ మహర్షి ఎవరైనా వెళ్లినప్పుడు ''నిన్ను నీవు తెలుసుకో'' అనేవాడు. నిన్ను నీవు తెలుసుకుంటే సర్వము తెలుసుకున్న వాడౌతావు. నిన్ను నీవు తెలుసుకోటమంటే నే దేహాన్ని నీ మనస్సును నీ చర్యలను తెలుసుకోటంకాదు. నేనెవరు? చిన్న ఉదాహరణము. ఇది నా దేహము. ఇది నా తల, ఇది నా చేయి, నా కాలు, నేనెవరు? ప్రశ్నించుకో! నా దేహమనుకుంటే నేనెవరు? నా తల అనుకుంటే నేనెవరు? ఈ విధంగా విచారణ చేస్తే . who am I? 'నేను' వేరుగా ఉంటున్నది. బుద్ధి, చిత్తము, అంతఃకరణ వేరువేరుగా ఉంటున్నాయి. ఇది నా కర్చీఫ్. నేను

వేరు. కర్చీఫ్ వేరు. నా దేహము అంటే దేహము నీ కంటె వేరుగా ఉండాలి కదా. కాబట్టి నీవు ఎవరు. అప్పుడు మనస్సు బుద్ధి చిత్తము ఇంద్రియములు. అంతఃకరణ పనిముట్లు. నీవు MASTER. Master the mind. Be a master mind నీవు Master గా జీవించు.

డ్యాక్టరు కత్తి చేతికి తీసుకుంటాడు. పేషెంటుకు ఆపరేషను చేస్తుంటాడు. ఆపరేషను చేసేది కత్తియా ?లేక డ్యాక్టరా? కత్తి ఒక పనిముట్టు. ఆపరేషను చేసేది డ్యాక్టరు. అతను అక్కడ మ్యాస్టరు. అదే విధంగా ఈ ప్రాకృత జీవితములో మనస్సు, బుద్ధి, చిత్తము, ఇంద్రియములు ఇవన్నీ పనిముట్లు. ఆత్మయే మ్యాస్టరు. ఆత్మశక్తి చేత కన్నులు చూడ గలుగుతున్నాయి, చెవులు వినగలుగుతున్నాయి. అన్నింటికి ఆత్మయే ఆధారము. ఈ విశ్వాసము మీరు దృఢము చేసుకోవాలి. నేను ఆత్మను, దేహము కాదు. వేదాంతము 'నేతి నేతి ' 'ఇది కాదు ఇది కాదు' అని వర్ణిస్తూ వచ్చింది. ఈ విధముగా యోచనచేస్తే గొప్ప సాధన చేయనక్కరలేదు.

ప్రాచీన కాలము నుండి భారతదేశములో అనేక మంది మహనీయులు కర్మ మార్గములో, భక్తి మార్గములో. జ్ఞాన మార్గములో ప్రవేశించి ఈస్థితి పొందగలుగుతూ వచ్చారు. ఈ దేహాలన్నీ నీటి బుడగలవంటివే - 'Body is the temple of God. Death is the dress of life'. "Death" దినము ఒక్కొక్క "dress" వేసుకున్నట్టు ఉంటుంది.

### *మానవత్వంలో తృప్తి రావాలి:*

మీకందరకు తెలుసు 40 సం॥ నుండి స్వామితో ఉండినవాడు కారుణ్యానంద. అతనికి పరిపూర్ణమైన వయస్సు నూరు సం॥లు అయిపోయింది. ఈనాడు పాంచ భౌతిక దేహము వదలి పెట్టాడు. కాలకర్మకారణ కర్తవ్యములు కలసి రావాలి. ఇక్కడ వేద పఠనము

జరుగుతున్నది. యజ్ఞయాగములు జరుగుతున్నవి. ఆనందముతో వింటున్నాడు. రాత్రి నిద్రించాడు నిద్రలోనే పోయాడు. ఒకవారము ముందు నా దగ్గరకు వచ్చాడు. ఏమి కారుణ్యానంద ''ఏమి కావాలి?'' అని అడిగాను ఏమీ వద్దు మీ పాదాలకు చేర్చుకోండి అన్నాడు. ఎందుకావిధంగా చెబుతున్నావు? అన్నాను ''ఇంక అనుభవించేవి ఏమున్నాయి? అన్నీ అనుభవించాను. స్వామితో 40 సం॥లు వెంట ఉండి తిరిగాను'' అన్నాడు. కాశ్మీరు, సిమ్లా వచ్చాడు. అన్ని చోట్లకు నావెంట వచ్చాడు. ప్రపంచమంతా నాతో తిరిగాడు. కట్టకడపటికి తృప్తిగాపోయాడు.

మానవత్వములో తృప్తిరావాలి. అసంతృప్తి ఉండకూడదు. who is the richest man in the world అని ప్రశ్నించుకోండి. He, who has much satisfaction is the richest man. He, who has much desires is the poorest man. ఏ ఆశలు లేకుండా ఉంటే అదే నిజమైన greatness. మీకందరకు తెలియదుగానీ ఈ birth and death నాకు తమాషాలు. స్వామీ మావారు చనిపోయినారంటే సంతోషము సంతోషమంటాను. యజమాని చనిపోతే నీకేమి సంతోషము నాకన్నింటికి సంతోషమే. ఒక వ్యక్తి ''స్వామీ నాకడుపుకోతనేను భరించుకోలేను దుఃఖముతోనున్నాను. బాధను సహించుకోలేను'' అంది. చాలా సంతోషము అన్నాను. అన్నింటికి సంతోషమే.

అదే విధముగా సరిగా 40 సం॥లు అయింది మన ఆశ్రమము చేరిన పద్మనాభశాస్త్రి. మీ కందరికి తెలుసు ఉదయం అక్కడ పూజ చేస్తుంటాడు. నిత్యము అభిషేకము జరుపుతుంటాడు. తెల్లవారి సాయంకాలము వరకు పూజలోనే నిమగ్నమై ఉంటాడు. ఆయన కూడా ఈనాడే వెళ్లినాడు. ఈ విధంగా దేహాలు వస్తుంటాయి పోతుంటాయి. ఇవన్నీ passing clouds. అన్నీ కదలిపోయే మేఘాలే. ఏదీ స్థిరమైన మేఘము లేదిక్కడ.

మానవత్వము ఎంతవరకో ఎప్పుడో. కనుక మనము ఎప్పుడు సిద్ధముగా ఉండాలి.

చిన్న ఉదాహరణ: నన్ను మీరు పోటో తీయాలనుకున్నప్పుడు కెమెరా దగ్గర పెట్టుకొని రెడీ స్వామి అంటే నేను రెడీగా ఉంటాను. ఏమి చెప్పకుండా తీస్తే చంచలముగా ఉంటుంది సరిగారాదు. ఈనాటి ఫోటోగ్రాఫర్సు అందరిని కూర్చోబెట్టి రెడీ అంటారు. రెడీ అన్నప్పుడు స్టడీగా ఉంటే మంచి ఫోటో వస్తుంది. రెడీ అన్నప్పుడు కదిలితే ఫోటో కదలిపోతుంది. కానీ ప్రాకృతమైన ఫోటోగ్రాఫర్సు రెడీ అంటారు. భగవంతుడనే ఫోటోగ్రాఫరు ఎప్పుడు చెబుతాడో రెడీ చెప్పటానికి వీలులేదు. **Be always ready.** మనము అన్నింటికి సిద్ధముగా ఉంటుండాలి.

***మాటవినక చేటు :***

ఈనాడు లోకములో భగవంతుడు చెప్పిన మాటలు వినటంలేదు. అహంకారము చెప్పిన మాటలు చక్కగా అనుసరిస్తున్నారు. ఇదియే కలి ప్రభావము. అహంకారము ఏమి చెప్పినా తలవంచి తిరుగుతున్నారు. కానీ ఆత్మస్వరూపుడైన భగవంతుడు ఏమి చెప్పినా సందేహాలు వస్తుంటాయి. అ మాటలు మంచివైనా వినరు. వినకపోవటంచేత ఈ విధమైన స్థితి పొందుతున్నారు. మూడు నెలల నుండి పద్మనాభ శాస్త్రికి చెబుతున్నాను. ''పద్మనాభశాస్త్రీ! నీకు డయబటీసు ఉంటున్నది. కాలు బాధ చాలా పెరిగిపోతున్నది. కాలు తీసి వేయవలసి వస్తుందో ఏమిటో చాలా అలక్ష్యము చేస్తున్నావు నామాట విను విను విను అని'' చెప్పాను. ఉహూ ఈ డయబటిసు నన్నేమి చేస్తుందని తీపు బాగా తినేవాడు. చెప్పిన మాట వింటే ఎంతో సుఖపడతారు. వారికీ సుఖము, కుటుంబమునకూ సుఖము. నాకూ ఆనందము. కనుక నేను చెబుతాను:

మాట ఒకటి వినరే మంచిమాట ఒకటి వినరె
మాట వినక పిచ్చి ఆటలాడుదురే ॥మాట॥
మాటలు వినక ఆటలు ఆడిచేటునుకొనెదరెల

ఎంత చెప్పినా వారువినటం లేదు. దీనివల్ల అనేక చేటులు తెప్పించుకుంటున్నారు. ఇది కాదు మనకు. మాట వినాలి, ఆచరించాలి. నాకోసం కాదు నేను చెప్పేది.

వచ్చే నెలకు స్వామికి 72 సంవత్సరములు అవుతుంది. ఈ 72 సం॥లో ఏనాడు నాలో స్వార్థమనేదిలేదు. ఏది చెప్పినా మీ మంచికే కానీ నాకోసం కాదు. ఏది చేసినా మీకోసమే గానీ నా కోసం కాదు. ఈ రహస్యమును గుర్తించుకొనక మీకు మీరు మోసపోతున్నారు. కట్టకడపటికి బాధపడి ప్రయోజనం ఏమిటి? ఇది ప్రయోజనం లేదు. మొదటే గుర్తించి వర్తించటం అత్యవసరం. మీరు నిరంతం భగవన్నామస్మరణ చేయండి. బుద్ధి తత్త్వము చక్కగా గుర్తించండి. రేపటి దినము ఆత్మతత్త్వము. మొదట శరీరము, రెండవది ఇంద్రియములు, మూడవది మనస్సు. ఈనాడు బుద్ధి. క్కొక్క దానిని చక్కగా గుర్తించుకుంటూ పోయినప్పుడు ఏ కొంతమందికైనా మనస్సులో ఆ బీజములు నిలుస్తాయి.

తేది : 8-10-1997 సాయికుల్వంత్ హాల్

*****

# మనశ్శాంతికి మించిన తపస్సులేదు

శాంతితుల్యం తపోనాస్తి న సంతోషాత్పరం సుఖమ్

నతృష్ణయా పరోవ్యాధి నచధర్మో దయాసమమ్

ప్రేమస్వరూపులారా!

శాంతమునకు మించిన తపస్సు మరొకటిలేదు. తపస్సనగా ఏమిటి? నిర్జనారణ్యములో వెళ్ళి నిర్మానుష్యమైన ప్రదేశములో ఏకాంతముగా దైవాన్ని ధ్యానించటము 'తపస్స'ని భావిస్తున్నారు. ఇదికాదు తపస్సు ఇది కేవలము లౌకికమైన, భౌతికమైన, ప్రాపంచికమైన వృత్తిగా దీన్ని భావిస్తున్నారు. మనోవాక్కాయములను ఏకపరచి, త్రికరణశుద్ధితో భగవంతుని స్మరించి, ఏకత్వమును పొందటమే నిజమైన తపస్సు. మనోవాక్కాయములను ఏకపరచటమనే దివ్యమైన భావముతో భగవంతుని తపించటమే నిజమైన తపస్సు. ఈ తపస్సు శాంతి నిమిత్తమై చేస్తున్నారు. కానీ శాంతి మన హృదయస్థాయినుండి ఆవిర్భవించినప్పుడు ఇంక తపస్సు ఎందులకు? శాంతి

మనయందే ఉన్నది గానీ బయటి ప్రపంచమందు లేదు. ప్రపంచములో శాంతి, శాంతి, శాంతి యని అరుస్తున్నారు. కానీ అట్టి శాంతి తన యందే ఉండి బయట ప్రపంచములో వెతకటము ఎంత అజ్ఞానము. బహిర్ దృష్టిని అంతర్ దృష్టిగా మార్చుకున్నప్పుడే ఈ శాంతి మనకు లభ్యమవుతుంది. ఇట్టి అంతర్ శాంతిని మనం అనుభవించిన తరువాత యింక తపస్సు ఎందుకు? ఈ శాంతికి మించిన తపస్సు మరొకటి లేదు.

**నసంతోషాత్పరం సుఖం** -సంతోషము కంటె మించిన సుఖము మరొకటి లేదు. సర్వ సుఖములుండి సంతోషములేని వ్యక్తులు ఎంతమంది మనకు ఈ జగత్తులో కనిపించటం లేదు. ధృతరాష్ట్రుడు హంస తూలికాపాన్పు పైన పవళించి నూరుమంది పుత్రులుకలిగి, సకల సౌభాగ్యములతో తులతూగుచు ఎన్ని సుఖములుండినప్పటికిని శాంతి ఏ మాత్రము కలుగలేదు. మనము సుఖమనేదే అనుకూలభావమని అనుకుంటున్నాము. సంతోషము భౌతిక జగత్తులో మనకు కానరాదు. ఒకవేళ సంతోషము తాత్కాలికముగా మనకు ప్రాప్తించినా యిది శాశ్వత సంతోషము కాదు. నిజమైన సంతోషము మన హృదయమునందే ఉంటున్నది. అట్టి సంతోషము పొందటము కంటె మరొక సుఖము మనకెందుకు. ఈ విధమైన సంతోషమును ప్రతి మానవుడు ఆశించాలి. ఈ సంతోషము ప్రతిమానవుని యందు శాశ్వతముగా ఉన్నది.

**నతృష్ణయా పరోవ్యాధిః.** వాంఛలు, కోరికలు, అభీష్టములు ఇవియే మానవునికి తీరని వ్యాధులు. తన అభీష్టములు నెరవేరెనా కొంత సుఖము పొందుతాడు. నెరవేరకపోయెనా మానసిక.వ్యాధి పొందుతాడు.

ప్రేమ స్వరూపులారా! ఈ తృష్ణకంటె మించిన రోగము ఈ జగత్తులో మరొకటి కనిపించటం లేదు. అన్ని రోగములకు ఔషధములు కనిపెడుతున్నారుగానీ ఈ వాంఛలకు ఔషధము కనిపెట్టేవారు లేరు.

మొట్టమొదట ఔషధము ఎక్కడ ఉంటున్నది? తృష్ణను తగ్గించుకున్నప్పుడే మనకు రోగము నివారణ కాగలదు. మున్ను చెప్పినట్లుగా దేహ సంబంధమైన వ్యాధులకంటె మనస్సుతో వచ్చే వ్యాధులే అధికంగా ఉంటున్నాయి.

**నచ ధర్మోదయాసమం:** దయకంటె మించిన ధర్మము ఎక్కడుంది? కారణమేమనగా ''దయగల హృదయమే దైవ మందిరము''. అట్టి హృదయము మనయందు పరిపూర్ణమైన దయగాఉండినప్పుడు ఇంక దానధర్మములు ఏమిటి? అన్ని ధర్మములు దయను పెంపొందించుకునే నిమిత్తమై చేసే సత్కర్మలే. వీటిని దయా స్వరూపముగా భావించినప్పుడు యింక ధర్మము చేయవలసిన అవసరము ఏమిటి? కనుక మానవుడు ఆశించే సమస్త వాంఛలు, సమస్త సుఖములు, సమస్త తపస్సులు, సమస్త శాంతులు తనయందే ఉంటున్నవి. బయట ప్రపంచమందు లేవు.

## మనస్సు ఆత్మతత్త్వానికిఅడ్డు

లోకములో భారతదేశము అనేక విధములైన సాంప్రదాయములతో సంస్కృతులతో కూడి దివ్యత్వమును ప్రకటింపచేస్తూ వచ్చింది. పారమార్థిక తత్త్వమందు గానీ, లౌకికము నందుగానీ ప్రతి భారతీయుడు తరచుగా పలికే పలుకు ఒకటి ఉన్నది. ఇది భారతీయ సాంప్రదాయము. ప్రాచీన ఋషుల ప్రసాదము; మన పెద్దల యొక్క అనుభూతి. అనేక పర్యాయములు సమయం వచ్చినప్పుడు ఆత్మ పదమును ఉపయోగపెడుతూ వస్తుంటారు. ఈ 'ఆత్మ' అంటే ఏమిటి? దీనినే 'ఎరుక' అని చెప్పారు. ఇది ప్రతిమానవుని యందలి'అహం'. ఈ అహం అనేది దేహములో చేరినప్పుడు అంకురముగా మారుతుంది. ఇది దేహాత్మ భావము పొందినప్పుడు అహంకారముగా రూపొందుతుంది. ఈ అహం కేవలం దేహాత్మతో చేరినది కాదు. దేహతాదాత్మ్యము పొందినప్పుడే అహంకారమనేది రూపొందుతుంది.

అనగా ఆకారమే నేను అని భావించటమే అహంకారము. అహమునకు ఆకారము లేదు. అదియే శుద్ధ సత్వముతో కూడినది మొట్టమొదట ఈ ఆత్మ తత్త్వమును అనేక విధములుగా మరపింపచేసి అడ్డు తగిలేదే మనస్సు. సూర్యుని ప్రకాశముచే రూపొందిన మేఘసముదాయము సూర్యునే కప్పివేస్తున్నాయి మేఘ సముదాయము సూర్యుని ఏ విధముగా కప్పి వేస్తున్నాయో, అదే విధముగా ఆత్మయందు పుట్టిన ఈ మనస్సు కూడా ఈ ఆత్మనే కప్పివేస్తున్నది కనుక మనస్‌తత్త్వము మొట్టమొదట గుర్తించాలి. ఈ మానవత్వములో మనస్సు ఆత్మతత్త్వమునకు అడ్డు తగిలేది. కనుక మనస్సును మరపింపచేసే మార్గమును మనము వెతకాలి.

మానవత్వములో 'నేను' అనే పదము మొట్టమొదట ఆవిర్భవించినది. ఈ 'నేను' అనేదే 'అహం స్వరూపము'. అహం, పరమాత్మ, దేవుడు, ఉనికి, ఎరుక, యోగము ఇత్యాది పదములన్నీ ఆత్మకు పర్యాయ పదములే. నేను అనే పదము ఆత్మకు పర్యాయ పదమే. ఈ నేను అనే పదమును సరిగా అర్థము చేసుకున్నప్పుడే ఆత్మజ్ఞానముకలుగును. నిజమైన 'నేను' అనే తత్త్వమును ఏ మానవుడు గ్రహించునో అదే నిజమైన ఆత్మతత్త్వమవుతుంది. ఆత్మతత్త్వమును తిష్ఠగా వేసుకొని దైవత్వముతోకూడిన అహం తత్త్వాన్ని విచారణ చేసినప్పుడే ఆత్మనిష్ఠ అవుతుంది. ఈ 'నేను' అనే పదము మూలములో ఏకమైనప్పుడే ఆత్మసాక్షాత్కారమౌతుంది. 'నేను' అనే భావమును కేవలం దేహముతో మాత్రమే కాదు. మూలాధారతత్త్వములో లీనము చేయాలి. అదియే ఆత్మసాక్షాత్కారము.

ప్రతి పదార్థమునకు ఒక మూలాధారము ఉంటున్నది. మూలాధారము లేక ఏ పదార్థము జగత్తులో కానరాదు. ఎవరు సృష్టించలేదు. అన్నింటిని సృష్టించిన మూలాధారతత్త్వము ఒకటున్నది. అయితే దానిని ఎవరు

విచారము చేయటం లేదు. ఎట్లనగా ఈనాడు భారతదేశమందే కాదు అన్ని దేశములందు భయంకరమైన బాంబులు సృష్టిస్తున్నారు. అస్త్ర శస్త్రముల పేర్లు మనం విన్నప్పుడే చాలా భయము వేస్తుంది. హైడ్రోజను బాంబు, ఆక్సిజన్ బాంబు, స్టార్‌బాంబు యిలాంటి పేర్లు వింటేనే చాలు భయము వేస్తుంది. బాంబుల విషయము తెలుసుకుంటే దిగులు వేస్తుంది. కానీ బాంబులు చేసిన సైంటిస్టును చూచిన ఎవరికి దిగులురాదు. బాంబును నిర్మించిన వ్యక్తి మన ఎదురుగా ఉండినా అతన్ని చూస్తే మనకు భయంలేదు. బాంబులు మనకు మరుగుగా ఉండినప్పటికి పేర్లు వింటేనే భయము వేస్తుంది. అదే విధముగా నేటి ప్రపంచ పరిస్థితి ఉంటున్నది. దృశ్యకల్పితమైన జగత్తు చూచినప్పుడు యిన్ని అన్యాయములు, ఇన్ని అక్రమములు, ఇన్ని అనాచారములు, ఇన్ని భయంకరమైన చేష్టలు జరుగుతున్నాయని ప్రపంచమును చూచినప్పుడు భయము వేస్తున్నది. కానీ ఇంత చరాచర ప్రపంచమును సృష్టించిన భగవంతుని చూచినప్పుడు భయమేమాత్రము ఉండదు. ఎందుకోసం భయము ఉండదు. ఈనాడు భౌతికమైన దృశ్యము పైననే మన దృష్టిని లక్ష్యపరుస్తున్నాము. అందువల్లనే భౌతికమైన భీతులు మానవునియందు ప్రవేశిస్తున్నాయి.

**మనస్సును అంతర్ముఖం చేసికోవాలి :**

మనస్సును అంతర్ముఖము గావించినప్పుడు కనిపించేది ఆత్మ ఒక్కటే. ఈ మనస్సును బహిర్ముఖము గావించినప్పుడు ప్రపంచము ఒక్కటే. కనుక ప్రపంచమును, ఆత్మను రెండింటిని చూచునది ఆత్మతత్త్వమే. మనస్సు యొక్క మార్పే ప్రకృతికి, ఆత్మకు ఉండిన భేదము నిర్మిస్తున్నది. ఈనాటి మానవుడు సాధన అంటున్నాడు. నా ఉద్దేశ్యములో సాధన, సాధ్యము అని రెండు లేనే లేవు. ఒకవేళ సాధన చేయాలని నీకు సంకల్పము కల్గినా అనాత్మ భావము దూరము గావించుకో. అదే సాధన. మరొక సాధనకు అవసరములేదు.

ఎందుకంటే అన్నీ తనయందే ఉంటే మరొక సాధనతో సాధించేది ఏముంది? ప్రాకృతమైన దృష్టిలో కర్త, కర్మ, క్రియ మూడు ఉంటున్నాయి. కానీ ఆధ్యాత్మిక మార్గమందు కర్తతానే, కర్మతానే, క్రియతానే సృష్టించేదితానే, పోషించేదీతానే, లయము గావించునది తానే. ఇవన్నీ పరిస్థితుల భావములే గానీ కేవలము సృష్టి స్థితి లయములు కావు. ప్రతిదాని యందు మన భావములే ప్రతిబింబిస్తున్నాయి. ప్రకృతి మాయ, మనస్సు అనే స్వరూపములు ఈ ఆత్మయందు ప్రతిబింబించే దృశ్యములేగానీ ఇవి దృక్కులు కావు. ఉన్నది ఒక్కటే దృక్. అదే ఆత్మతత్త్వము. చూచేది తానే అనుభవించేదీ తానే ఆనందించేదీ తానే. అంతర్థానమయ్యేదీ తానే. ఇట్టి ఆత్మతత్త్వమునకు ఒక్క రూపము లేదు.

సత్ చిత్ ఆనందము ఆత్మ లక్షణములు అంటున్నారు. నా ఉద్దేశ్యములో సత్, చిత్ ఆనందములు మూడు పదార్థములు కావు. సత్ లోనే చిత్, ఆనందము రెండూ లీనమై ఉన్నాయి. ఎట్లనగా జలములో చక్కెరను చేర్చినప్పుడు ఈ జలములో పూర్తి చక్కెర కరిగిపోతుంది. చక్కెర వేరు జలము వేరుకాదు. ఇక్కడ ఇంద్రియములచేత, మనస్సుచేత, బుద్ధిచేత కూడిన దేహాత్మ భావము మనము అనుభవించినప్పుడు మూడూ వేరు వేరుగా కన్పిస్తాయి. దేహముతో తాదాత్మ్యము పొందకూడదు. చిన్న ఉదాహరణము. ఒక కప్పులో ఫలరసం ఉంటున్నది గానీ ఆ రుచి కప్పుకు తెలియదు. దానిలో ఒక స్ట్రా వేశావు. ఈ స్ట్రాతో దాన్ని పీల్చుకుంటున్నాము. జ్యూస్ స్ట్రాలో పోతున్నది గానీ ఆ రుచి స్ట్రాకు తెలియదు. కానీ రుచి నాలుకకు మాత్రమే తెలుస్తున్నది. రుచిమాత్రమే చూస్తున్న నాలుక దానిని అనుభవించటం లేదు. అది జఠరమునకు పంపుతున్నది. ఇది జఠరమునకు పంపినప్పుడు జఠరముకూడా అనుభవించటం లేదు. అక్కడ స్థూల సూక్ష్మ కారణ స్వరూపాలుగా రూపొందింపచేస్తుంది.

స్థూలమును బయటకు పంపుతుంది. సూక్ష్మమును రక్తముగా మార్చుకుంటుంది. అతి సూక్ష్మమైనది ప్రాణముగా రూపొందింపచేస్తుంది.

### ప్రజ్ఞానం బ్రహ్మ :

అదేవిధముగా మన శరీరము ఒక కప్పు వంటిది ఇందులో ఆత్మతత్త్వమనే మధుర రసము ఉంటున్నది. ఉంది గానీ ఈ శరీరమునకు తెలియటం లేదు. దీనిలో ఇంద్రియములనే స్ట్రా వేస్తున్నాము మనము. ఇంద్రియముల ద్వారా పీల్చుకుంటున్నాము. ఇంద్రియాలకు దీనిరుచి తెలియటం లేదు. అయితే బుద్ధి దీని రుచిని గుర్తిస్తున్నది. బుద్ధి గుర్తిస్తున్నది గానీ అది కూడా అనుభవించటం లేదు. అది ప్రజ్ఞా శక్తికి పంపుతున్నది. అదే ''ప్రజ్ఞానం బ్రహ్మ''. 'ప్రజ్ఞ' అనగా constant Integrated awareness ఏ మాత్రము మార్పుచెందేది కాదు. ఒక కాలములో ఉంటే మరొక కాలములో లేకుండా ఉండేది కాదు. అందువలనే constant Integrated awareness ఎప్పటికి, ఎల్లకాలములందు ఎల్ల ప్రదేశములందు ఇది సమంగానే ఉంటున్నది. దీనిని పురస్కరించుకునే వేదము 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనింది. ఈ ప్రజ్ఞానమే అత్మ. ప్రజ్ఞానము, ఎరుక, ఆనందము, నేను, బ్రహ్మ ఇవన్నీ ఆత్మకు పర్యాయ పదములే. భౌతికమైన లోకము గుర్తించి దీనికి పేర్లు మారుస్తూ వచ్చారు. ఈ టంబ్లరులో నీరుంటున్నది. ఈ నీరును తెలుగు వారు 'నీరు' అని, తమిళులు 'తన్ని' అని, హిందీ వారు 'పానీ' అని ి ఇంగ్లీషు వారు 'వాటర్' అని సంస్కృతము వారు 'వారి' అని అంటారు. ఈ విధంగా ఒక్కొక్కరు వారివారి భాషలు పురస్కరించుకొని పేర్లు పెడుతూ వచ్చారుగానీ నీరును ఎవరూ మార్చలేరు కదా. శక్తిఅన్నా, ఎరుకఅన్నా, ఆత్మఅన్నా, బ్రహ్మంఅన్నా యివన్ని వారి వారి పర్యాయ పదములుగా మార్చుకుంటూ వచ్చారు. కానీ మానవుడు ఒక్కొక్క పేరును ఒక్కొక్క రూపముగా భావిస్తున్నాడు. ఇది

దేహము. ఇది క్షేత్రము. క్షేత్రములో క్షేత్రజ్ఞుడు అనేవాడు ఒకడున్నాడు ఆ క్షేత్రజ్ఞుడు లేక దీనికి క్షేత్రమనే పేరే లేదు కనుక పేరుకు తగిన ప్రవర్తన అందులో గుర్తింపచేస్తుంది.

**_ఆకారములేని తత్త్వమే ఆత్మ:_**

లౌకిక ప్రపంచములో ఆత్మతత్త్వమును అనేక రూపములతో విశ్వసిస్తూ వస్తున్నారు. ఆత్మ ఒక్కటే. ఇది కేవలము శక్తితో కూడినదే గానీ ఒక రూపము ధరించినది కాదు. అయితే దీనిని బాహ్య జగత్తునందు ఉపయోగించుకోవటం ఎట్లా? నేను-అదే 'అహం'. ఈ 'అహం' రెండు రకములు. దేహములో తాదాత్మ్య భావము పొందటం. దేహమునకు అత్యంత దూరంగా ఉండటం. అదీ నేనే ఇదీ నేనే. అయితే దేహాత్మభావంతో కూడినది అహంకారముగా మారుతుంది. ఎక్కడ వెళ్లినా ఆకారముంటే అహంకారమే అది. ఆకారము లేని తత్త్వమే అహం. అదే ఆత్మ. కానీ దానికి గుణములు లేవు అన్నారు. దానినే నిర్గుణం, నిరంజనం అన్నారు. అయితే ఆకారముతో కూడినప్పుడు అన్ని రకములైన గుణములు ప్రకటిస్తుంది. ఇట్టి ఆకారమునకు అతి దూరంగా ఉన్న ఆత్మతత్త్వమును మనం గుర్తించుటకు ప్రయత్నించాలి. ఈ నేను భావమును మూలాధారముతో కూర్చినప్పుడే ఆకారరహితమైపోతుంది.

అనేక పర్యాయములు చెప్పాను. ఆక్సిజను, హైడ్రోజను ఉంటున్నాయి. ఆక్సిజను అంటిస్తే భగ్గుమని మండితుంది. హైడ్రోజను అంటిస్తే అదికూడా మండుతుంది. కానీ రెండూ చేరిస్తే మంటనార్పే నీరుగా తయారౌతుంది. ఈ రెండింటి తత్త్వములను మనం గుర్తించుటకు ప్రయత్నించాలి. ఈనాడు మనము దేహముతో కూడిన అహమునే ఎక్కువగా అనుభవిస్తున్నాము. దేహమే లేక అహం అర్థము కావటం లేదు. ఈ దేహమును ఆధారము చేసుకొని, అంతర్ దృష్టిని మనం అభివృద్ధి గావించుకొని బహిర్ ముఖమైన

మనస్సును అంతర్ముఖముగా మార్చుకోవాలి. ఈ విధముగా ప్రాక్టీసు చేస్తూ వస్తే తప్పక ఈ సత్యమును మనము అనుభవించవచ్చును, గుర్తించవచ్చును. దీనినే ఆత్మ సాక్షాత్కారమన్నారు. అనగా నేను అనే తత్త్వము ఏ మూలము నుండి వచ్చిందో ఆ మూలములో చేర్చాలి.

ఒక చిన్న ఉదాహరణ నీవు తెల్లవారి నడుస్తున్నావు. సూర్యుడు తూర్పున ఉదయిస్తున్నాడు. నీవు పడమటి వైపు ప్రయాణము చేస్తున్నావు. పడమటి వైపు ప్రయాణము చేసేంత వరకు నీ నీడ నీ కంటె ముందుగా వెడుతున్నది. కానీ నీ నీడను దాటి పోవాలని ఎంతో ప్రయత్నం చేస్తున్నావు. ఇది అసాధ్యము. ఎందుకనగా సూర్యునికి విరుద్ధముగా నడుస్తున్నావు. కనుక నీ నీడ నీ కంటె ముందుగా పోతున్నది. ఎంత తీవ్రముగా వెళ్ల ప్రయత్నించినా అంత తీవ్రముగా ముందు వెడుతుంది. దీనితో పోరాడి ప్రయోజనము లేదు. నీ ముఖము సూర్యుని వైపు తిప్పు. అప్పుడు నీనీడ నీవెనుక పడిపోతుంది. ఇదియే ఈనాడు జరుగుచున్న ప్రపంచ పరిస్థితి. భగవంతునికి విరుద్ధముగా ప్రకృతి దిశవైపు ప్రయాణము చేస్తున్నావు. నీకంటె ముందుగానే మాయ అనే ప్రతిబింబము నడుస్తున్నది. ఈ విధముగా విరుద్ధమైన ముఖము పెట్టుకొని మాయను వెనుక వేయాలంటే సాధ్యము కాదు. నీ దృష్టి భగవంతుని వైపు తిప్పు. ఈ మాయ ఏ సాధనలు చేయకపోయినా వెనుకపడిపోతుంది. కనుక ఈనాడు మనం మార్చవలసింది ఏమంటే మనస్సు యొక్క దృష్టిని మార్చాలి. ప్రకృతిభావములో నుండిన దృష్టిని పరమాత్మ భావములోకి మార్చుకోవాలి. ఇదియే ఈనాడు చేయవలసిన సాధన.

## దృష్టిదోషమే కానీ, సృష్టిదోషము లేదు :

ఈ ప్రకృతి భావము కేవలము 'మాయ'. మాయను

తప్పించుకోవాలంటే భగవంతుని వైపు మరల్చాలి మాయ, మనస్సు, ప్రకృతి ఒక్కటే. కనుక ప్రకృతి వైపునున్న మనస్సు పరమాత్మ వైపు మరల్చాలి అనగా అంతర్భావమును మార్చుకోవాలి. అప్పుడే ప్రకృతి దూరమై పరమాత్మ సమీపుడౌతాడు. దీనినే 'పశ్యన్నపి చ న పశ్యతిమూఢో'. అయ్యా! నీవు భగవంతుని చూస్తున్నావు. ఎక్కడ చూస్తున్నావు? ఇదంతా భగవత్స్వరూపమే. నాకు భగవంతుడు కనిపించాలని ఆశిస్తున్నావు. చూచేది భగవంతుడినే. దీని కంటే ప్రత్యేకంగా ఏమి కని..ంచగలడు? అయితే నీవు ఏ భావముతో చూస్తున్నావు. దీనిని ప్రకృతి భావముతో చూస్తున్నావు. నీకు భగవంతుడు కనిపించటంలేదు. దీనిని భగవద్భావముతో చూడు ప్రకృతి నీకు కనిపించదు. నీ దృష్టి దోషమేగానీ సృష్టి దోషము లేదు.

నీవు ప్రకృతిని పరమాత్మభావముతో చూడు. అపుడే ప్రకృతిభావము దూరమవుతుంది. ఎట్లా దీనిని చూచేకవుతుంది? నిత్యజీవితములో మనము కష్టములు, నష్టములు, దుఃఖములు, విచారములు అనుభవిస్తున్నాము. వీనిని పరమాత్మభావముతో ఎట్లా చూచేది? అంటే దీనికి ఉదాహరణ. స్వప్నములో నీకు అనేక అనుభూతులు వచ్చాయి. అయితే అందులో దుఃఖములు, విచారములు, అనుభవించావు. కానీ అవి ఎంత వరకు ఉన్నాయి. నిద్రించేంత వరకు ఉన్నాయి. తిరిగి లేచితివా ఆ దృశ్యములు లేవు. తిరిగి వేరు దృశ్యములు నీకు కనిపిస్తున్నాయి. ఆ దృశ్యములెక్కడ? ఈ దృశ్యములెక్కడ? అది స్వప్నము అనుకుంటున్నాం మనం. చాలా పొరపాటు ఇది కూడా స్వప్నమే. ఇది **day dream** అది **night dream**. రాత్రి స్వప్నములో పగటి స్వప్నము లేదు. పగటి స్వప్నములో రాత్రి స్వప్నములేదు. పగటి స్వప్నములోనా నీవు ఉన్నావు? రాత్రి స్వప్నములోనా నీవు వున్నావు? నీవు **omnipresent** రెండింటి యందున్న ఏకత్వమును గుర్తించటానికి ప్రయత్నించాలి.

చిన్న కథ. ఒక వ్యక్తి స్వప్నమును అనుభవిస్తున్నాడు. ఆ స్వప్నములో తాను పుట్టినట్లు, తాను తల్లిపాలు త్రాగినట్లు, స్కూలుకి వెళ్లి చదువులు చదివినట్లు, ఉద్యోగము చేసినట్లు, వివాహమాడినట్లు, తరువాత బిడ్డలు పుట్టినట్లు అన్నీ తానే కలలో చూస్తూవచ్చాడు. తాను పుట్టి తనకు బిడ్డలు కలగాలంటే కనీసం తనకు ముప్పై సంవత్సరములైనా ఉండాలి. ఈ 30 సంవత్సరముల కాలము ఎంతసేపు కలలో అనుభవించావు? రాత్రి 2-30 గం॥లకు బాత్‌రూంకి పోయివచ్చావు. 2-35కి స్వప్నం వచ్చింది. 5 నిముషములలో పుట్టటం, పెరగటం, పెండ్లిచేసుకోవటం, బిడ్డలు కలగటం ఇవన్నీ జరిగిపోయినాయి. స్వప్నములోని ఆయుః ప్రమాణము 30 సంవత్సరాలు. జాగ్రత్తలో 5 నిమిషములు. అదేవిధముగా బాహ్యమైన ఈ జగత్తునందు మనం అనుభవించేదంతా ఎన్నో సంవత్సరములుగా కనిపిస్తాయి. అయితే ఆధ్యాత్మిక కాలములో క్షణముగా కనిపిస్తుంది. ఇది ఎట్లా మీరు అర్థము చేసుకోగలరు? ఈ స్వప్నమే మీకు ప్రత్యక్ష నిదర్శనము. కనుక కాలంమార్పుచేత సత్యముగా భావిస్తున్నాము.

**ఏకాత్మా సర్వభూతాంతరాత్మా :**

ప్రత్యక్షమునకు, పరోక్షమునకు వ్యత్యాసముంటున్నది. ఈ రెండింటి యందు మార్పు కల్పించేది ఆత్మతత్వము ఒక్కటే. ఆత్మలో మార్పులేదు. కానీ నీ భావములో మార్పుంటున్నది. కనుక నీ భావములు మార్చుకొనుటకు ప్రయత్నించాలి. ఆత్మ ఒక్కటే, 'ఏకాత్మా సర్వ భూతాంతరాత్మా'. ఈ విధమైన తత్త్వము చక్కగా గుర్తించుకుంటే ఆ ఎరుకే నిజమైన ఆత్మ. ఆ ఎరుక ప్రతివానియందు 'అహం' అనే రూపములో ఉంటున్నది. ఒకరి దగ్గరుండి మరొకరి దగ్గర లేకుండా పోలేదు. కానీ వారి వారి పరిస్థితిని పురస్కరించుకొని, వారి వారి స్థాయిని పురస్కరించుకొని వారి వారి

సాధనలను పురస్కరించికొని వారు ఆ విధముగా అనుభవిస్తున్నారు దీనికి ప్రాకృతమైన అభ్యాసములే మూల కారణం.

శ్రేయోహిజ్ఞానమభ్యాసాత్, జ్ఞానాద్ధ్యానం విశిష్యతే

జ్ఞానాత్ కర్మ ఫల త్యాగః త్యాగాత్ శాన్తిరనంతరం

జ్ఞానమును అనేక రకములుగా బోధిస్తున్నారు ఈఆత్మతత్త్వమును అనేక రీతులుగా వర్ణిస్తున్నారు. ఇవన్నీ మానవునకు అర్థమయ్యే నిమిత్తమై బోధించేవేగాని, ఆత్మతత్వమును ఎవరు నిర్ణయించి చెప్పలేరు. అది ఉన్నదానికి అనుభవించేదానికి ఏ మాత్రము సంబంధము లేదు. ఎట్లా ఉంటున్నదంటే, ఆ చెట్టుపై కనుపించే చుక్క అన్నారు. చుక్క ఉన్న దెక్కడ? చెట్టు ఉన్నది ఎక్కడ? అయితే చెట్టును గుర్తుగా తీసుకొని దానిపైనున్న చుక్క అంటున్నాము. దానికి దీనికి సంబంధము లేదు. ఆకాశములోని నక్షత్రమునకు, భూమిపైన పెరిగిన చెట్టుకు ఏమి సంబంధము. అయితే అందరాని చుక్కను చెట్టు ద్వారా చూపించే నిమిత్తమై ఈ విధమైన ఉపమానము తీసుకుంటున్నాము. కానీ ఈ ఉదాహరణము మన జీవితమునకు అనుకూలమైనదిగా తీసుకొంటూ వచ్చాముగానీ నిజంగా ఈ ఉదాహరణకు దానికి సంబంధములేదు.

భగవంతుడు సర్వవ్యాపకుడన్నారు. ఎట్లా నీవు నిర్ణయించగలవు? దీనికి ప్రాకృతమైన మార్గము వెతకాలి. భూమి ఉన్నది. ఈ భూమిలో శబ్ద, స్పర్శ, రూప,రస గంధములు ఐదు గుణములుంటున్నవి. 5 గుణముల చేత కదలక మెదలక ఒకే చోట ఉంటున్నది. క్రమక్రమేణా రెండవ భూతమును వెతుకుతున్నాం. నీరు - ఇందులో ఒక గుణము తగ్గిపోయింది. శబ్ద, స్పర్శ, రూప, రసమే ఉంటున్నాయి. గంధము లేదు. ఒక గుణము తగ్గిపోయేటప్పటికి జలము ప్రవాహముగా రూపొందుతున్నది. కదలిక ప్రారంభమైంది. మూడవది

అగ్ని అగ్నిలో శబ్ద, సర్శ, రూపములున్నాయి. రస, గంధములు లేవు రెండు గుణములు తగ్గేటప్పటికి భూమి నుండి పైకి లేస్తుంది అగ్ని తరువాత గాలి అందులో శబ్ద, సర్శ రెండే ఉంటున్నాయి. రూపము లేదు; రసము లేదు, గంధము లేదు; మూడు గుణములు తగ్గిపోయాయి. ఈ గాలి సర్వత్రా వ్యాపించిపోయింది. నాల్గవది ఆకాశము. శబ్దము ఒక్కటే. సర్శ, రూప, రస, గంధములు నాలుగు గుణములు లేవు. గుణములు తగ్గిపోయేటప్పటికి ఆకాశము సర్వత్రా ఉండినట్టు కనిపిస్తున్నది. భగవంతుడు గుణాతీతుడు. ఆకాశము కంటె అతీతుడు. అతనికి గుణములే లేవు. తాను సర్వత్రా ఉంటున్నాడు. ఇలాంటి తత్త్వము చక్కగా విచారణ చేస్తూ వచ్చినప్పుడు మనలో గుణములే ఈ విధమైన భావములకు మూలకారణంగా ఉంటున్నాయి.

మన గుణములూ క్రమక్రమేణా తగ్గించుకుంటూ రావాలి. గుణములే కాదు బాధ్యతలు కూడా తగ్గించుకుంటూ రావాలి. బాధ్యతలు మాత్రమే కాదు వాంఛలు కూడా తగ్గించుకుంటూ రావాలి. ఎంత వాంఛలు తగ్గించుకుంటూ వస్తామో అంత లైట్ అయిపోతాము. ఈనాడు మానవుడు అమితమైన కోరికలచేత బరువైపోతున్నాడు. ఆ బరువుచేత తాను మాత్రము ముందు స్థాయికి పోలేకపోతున్నాడు. క్రమక్రమేణా తగ్గించుకోవాలి.

పురుష ప్రయత్నమన్నారు. పురుష ప్రయత్నమంటే ఏమిటి? కొంత వరకు తాను తెలివి తేటలచేత దాన్ని త్వరగా మార్చుకునే పద్ధతి తెలుసుకోవాలి. స్నానం చేశాడు. తక్షణమే బస్సుకు వెళ్లాలి. స్నానం చేసినప్పుడు తడి బట్టతో వెళ్లటానికి వీలుకాదు. దాన్ని పిండి ఆరవేయాలి. ప్రయాణములో తడి బట్ట తీసుకొని పోకూడదు అప్పుడు పురుష ప్రయత్నం ఏమిటి? దానిని నాలుగు మడతలువేసి ఎక్కడో వేసి యింకా ఆరలేదే అంటే ఎట్లా ఆరుతుంది. నాలుగు మడతలు విప్పాలి. ఒకే మడత

వేయాలి. అప్పుడు త్వరగా ఆరిపోతుంది. ఇది పురుష ప్రయత్నం. పురుష ప్రయత్నమనగా కాలము తక్కువ చేసుకొని అనుభవించుటకు ఎట్లు వీలౌతుందో ఆ మార్గము మనము అనుసరించాలి.

**ప్రతివ్యక్తియందూ దైవశక్తే యున్నది :**

ఇద్దరు పిల్లలు వారి అనుభూతులను, స్వామి మహత్తర శక్తులను, ఈ విధంగా జరిగింది. ఆ విధంగా జరిగింది అని చెప్పారు. దైవశక్తి ప్రత్యేకమైనది కాదు. ప్రతి వ్యక్తియందు దైవశక్తి ఉంటున్నది. వారిశక్తియేం వారికి అనుభూతులందిస్తూ వచ్చింది గానీ భగవచ్ఛక్తి ప్రత్యేకంగా ఉండి అందించినదికాదు. నిమిత్తమాత్రంగా నన్ను ఉపయోగపెడుతున్నారు. వారి యందే ఉంటున్నది ఆ శక్తి. ఆ శక్తి వారు గుర్తించుకో లేక పోవటంచేత నాపైన పడవేస్తున్నారు. ఎట్లంటే లౌకిక జగత్తునందు ఈ విధమైన లౌకిక యుక్తులంతా ఉంటాయి. లాయర్సుంటారు. వీరుకొన్ని కేసులు తీసుకుంటారు. కేసులలో సరైన పాయింటు ఉంటే తీసుకోవాలి. లేకపోతే దాన్ని ముట్టకూడదు. కానీ డబ్బు సంపాయించే నిమిత్తమై పాయింటు ఉండినా లేకపోయినా ముందు కేసు తీసుకుంటారు. వానికి మొదలే తెలుసు ఇది జయించుటకు వీలుకాదని, విజయము లభించదని తెలుసు. కేసు ఫెయిలయితే లాయరు చెబుతాడు. ''నేను ఎన్నో గ్రంథాలు చదివాను, ఎన్నో ప్రయత్నాలు చేశాను, సాక్ష్యము సరిగా లేదని'' వాని తలపైనే వేస్తాడు. ఇంక గెల్చినా, ''రాత్రింబవలు ఎంతశ్రమ పడ్డాను. ఎన్ని విధముల దీనికి శక్తిని ధారపోశాను'' లేకపోతే దీనికి పాయింటే లేదు అంటాడు. అదే విధముగా ఈనాటి భక్తులు తమలో సందేహము లుండినప్పుడు అది ఫలించలేనప్పుడు బాబానే నాకు చేయలేదని తలపై వేస్తారు. వారిలో పరిశుద్ధ హృదయం ఉండినప్పుడు ఆ పరిశుద్ధత వీరికి విజయము సాధింపచేస్తుంది. అప్పుడు బాబా చేశాడు అనుకుంటారు. బాబాకు ఆగ్రహముగానీ, అనుగ్రహంగానీ, దయగానీ,

ద్వేషముగానీ లేదు. రెండూ మీయందే ఆవిర్భవిస్తున్నాయి. మీరు నిశ్చల భావముతో, నిర్మల చిత్తముతోస్మరించినప్పుడు నిర్మలంగా నిశ్చలంగా విజయాన్ని సాధిస్తుంది. ఇదికేవలం ఒక శక్తితో చేకూరేది కాదు. లైట్లు వెలుగుతున్నాయి. ఈ బల్బులు ఎట్లా వెలుగుతున్నాయి? కరెంటు ఉండటంచేత వెలుగుతున్నాయి. కరెంటు ఉండి బల్బులు లేకపోతే, వెలగదు. బల్బు నెగిటివ్, కరెంటు పాజిటివ్. రెండింటి ఏకత్వము చేత కరెంటు మనం అనుభవిస్తున్నాము. భగవంతుడు పాజిటివ్. భక్తుడు నెగిటివ్. రెంటి కండిషనులు చక్కగా ఉండాలి. కానీ నీవు fan switch వేశావు. మరి బల్బు స్విచ్ వేశావు కరెంటు ఉంది. ఉంది అని తెలుస్తున్నది కానీ ఫ్యాను తిరగటంలేదు. కారణం ఏమిటి? కరెంటు దోషము కాదు? fanలో దోషము వచ్చింది. నెగిటివ్‌లో దోషము వచ్చింది. దైవత్వములో యిలాంటివి రావడానికి వీలులేదు. నీ భావములందు మాత్రమే ఈ విధమైన దోషములు చెలరేగుతుంటాయి. 'యద్భావం తద్భవతి'. ఆ సత్యము వారు గుర్తించుకోలేక పోతారు.

*కోరిక తీరిన వేళ ననుగొప్పగ పొగడెదరోయి*

*కోరిక తీరకపోతే ఊరక తెగడుదురోయి.*

ఏదైనా కోరిక తీరితే ఎంతో పొగడుతారు. కోరిక తీరకపోతే ఊరక తెగడుదురోయి. ఇది మానవుని బలహీనత. ఆత్మలో ద్వేష భావములకు, క్రోధ భావములకు ఏ మాత్రము అవకాశము లేదు. నిర్మలంగా ఉంటుంది. ఆ నిర్మలత్వమే నిన్ను రక్షిస్తుంది.

***'ధర్మోరక్షతి రక్షితః'.***

మన కాలేజి చిహ్నంలో 'ధర్మోరక్షతి రక్షితః' ఉంది. ధర్మాన్ని రక్షిస్తే

అది నిన్ను రక్షిస్తుంది. ధర్మాన్ని హింసిస్తే ఆ ధర్మమే నిన్ను హింసిస్తుంది. అదే విధముగా ఆత్మ విశ్వాసము పూర్ణముగా ఉన్నపుడు అదే నిన్ను రక్షిస్తుంది. ఆ self-confidence మనం develop చేసుకోవాలి. ఆ self-confidence కనిపించేది కాదు. ఇక్కడ యింత పెద్ద భవనము ఉంటున్నది. పెద్ద భవనమునకు పునాది ఎంతో వేసినాము పునాదిలేక యింత పెద్ద భవనం యిక్కడ నిలవటానికి వీలుకాదు. కానీ పునాది కనిపించటంలేదు. ఆ పునాదే self-confidence పైన కనిపించే భవనం self-satisfation దీనికి పై roof self-sacrifice అప్పుడు self-realisation అనే సుఖాన్ని పొందుతున్నాం. కాబట్టి self-realisation కు self-sacrifice కావాలి. self- sacrifice కు self-satisfaction పొందాలి. self-satisfaction ఉండటానికి self-confidence ఉండాలి. కనుక self-confidence develop చేసుకోవాలి.

ఈనాటి మానవుడు మనస్సును balance లేకుండా చేసుకుంటున్నాడు. ప్రతిదానికి నాలుగు స్థాయిలుంటున్నాయి. పైన knowledge ఉంటున్నది. క్రింద skill ఉంటున్నది. మూడవది balance. నాల్గవది insight. ఇవన్ని సరియైన స్థితిలో ఉండాలి. knowledge కావలసినంత ఉంటున్నది. knowledge ని skill చేస్తే balance సక్రమంగా ఉంటుంది. ఇక్కడే మానవుని పొరపాటు. knowledge ని skill చేయటం లేదు kill చేస్తున్నాడు. దానివల్ల balance తప్పిపోతున్నది. Balance తప్పిపోవటం చేత in-sight పోయి out-sight అవుతున్నది. మన దృష్టి బహిర్ముఖమవుతున్నది.

మొట్టమొదట తెలివి తేటలను సక్రమమైన మార్గములో పెట్టుకోవాలి. మన తెలివి తేటలను misuse చేస్తున్నాము. తప్పుడు మార్గములో

అనుభవిస్తున్నాము. ఇది సరియైనది కాదు. గొప్ప తెలివితేటలున్నాయని అహంకారం చేత, దేహాత్మ భావంచేత చెడగొట్టుకుంటున్నాం. ఆ knowledge లో కూడా ఉంటున్నది ఆత్మతత్త్వము. ఆ knowledge లో కూడా energy ఉంటున్నది. ఆ energy నే ఆత్మ. ఈ విధంగా విచారణ చేస్తే ఆత్మ ఇట్టిది అట్టిదనికాదు. సైంటిస్టులు matter and energy అన్నారు. నా ఉద్దేశ్యములో matter అనేదే లేదు. అంతా energy యే! matter, energy గా energy, matter గా మారుతున్నది. నీ దృష్టిలో రెండుగా కనిపిస్తున్నాయి గానీ ఆత్మ దృష్టిలో ఒక్కటే. ఇదే 'ఏకం సత్ విప్రాః బహుధాః వదంతి'.

***అనేకత్వంలో ఏకత్వం:***

ఉన్నది ఒక్కటే. ఆ 'ఏకాత్మా సర్వ భుతాంతరాత్మా. అనేకత్వంగా మీరు భావిస్తున్నారు. అనేకత్వములోని ఏకత్వమును మనం గుర్తించాలి. దీనికి ఉదాహరణ. ఒకటి ఇక్కడ పెట్టండి; యిక్కడ తొమ్మిది పెట్టండి. ఏ పిల్లవానినైనా 1 పెద్ద నంబరా? 9 పెద్ద నెంబరా? అని అడగండి ఏ చిన్న పిల్లవాడైనా 9 పెద్ద నెంబరు అంటాడు. ఇదికాదు. Mathematics లో 9 పెద్దది గాని 1 biggest నంబరు. ఈ ఒకటి లేక తొమ్మిది ఎక్కడునుంచి వచ్చింది 1+1+1+1+1...= 9. ఒకటి లేక తొమ్మిది లేదు. కాబట్టి ఉన్నది ఒక్కటే. ఒకటి పెట్టి, దాని ప్రక్కన సున్న పెట్టండి; యింకొక సున్న పెట్టండి నూరు. యింకో సున్న పెట్టండి వెయ్యి. యింకో సున్న పెట్టండి పదివేలు. కానీ ఒకటి ఉండినంత వరకే సున్నలకు విలువ. ఆ ఒకటి హీరో. అతనే God. World is zero. Moon is zero, Earth is zero, Sun is zero. అన్ని జీరోలు పెట్టుకున్నపుడు వాటికి విలువ వస్తున్నది. కట్టకడపటికి Life is zero. కానీ ఉన్నది ఒక్కటే ఆ ఒక్కదానికి ఏనాడు ముప్పురాదు. ''ఏకోహంబహుస్యాం''. తానొక్కడే అనేకంగా రూపొందినాడు. అదియే ఆత్మతత్త్వము

జగత్తంతా నిండినది ఒక్కటే. ఆ ఒక్కటే అనేక రూపములుగా గోచరిస్తున్నది. కనుక ఆత్మతత్త్వము మనం గుర్తించాలనుకుంటే జీవతత్త్వమును ఏకత్వముగా భావించాలి. మన పిచ్చికోతి వంటి మనస్సును సక్రమమైన మార్గములో నడిపింపచేయాలి. అప్పుడప్పుడు పిల్లలకు చెబుతాను mind is like a mad monkey. Body is like water bubble. Don't follow the body. Don't follow the mind follow the conscience. అదియే ఆత్మ Conscience ని follow చేస్తూరావాలి. దీనినే తెలుగులో 'ఆత్మసాక్షి' అన్నారు. ఈ ఆత్మసాక్షిగా ఒక పని మనం చేసినామంటే విజయమే సాధిస్తాము. కానీ ఆత్మ సాక్షి మనం ఏనాడూ తీసుకోవటం లేదు. పరుల సాక్షిని మనం తీసుకుంటున్నాము. ఇతను నాకు సాక్షి అని. కాదు కాదు ఆత్మయే సాక్షి. అట్టి self-confidence మనలో రావాలి.

నిన్నటి దినము చెప్పాను. శంకరాచార్యులవారు తాను మండనమిశ్రునితో వాదనచేశాడు. ఆ సమయములో మండన మిశ్రుని భార్య ఉభయభారతినే సాక్షిగా తీసుకున్నాడు. అది self-confidence. ఈయన భార్య కదా! యీమె నాకు వ్యతిరేకము చెప్పుతుందో యేమో అనే అనుమానము శంకరులవారికి లేదు. సత్యమెరిగిన వాడు కనుక ఈమె కూడా సత్యమార్గములో ప్రవేశించింది. అందువల్లనే ఉభయభారతిని సాక్షిగా తీసుకున్నాడు. అంత విశ్వాసము రావాలి మనకు. ఈనాడు ఆ విశ్వాసమే లేదు. కేవలం శ్వాస ఉంది, గానీ విశ్వాసము లేదు. ఇదంతా living death. శ్వాస కాదు ముఖ్యము. విశ్వాసముండాలి. విశ్వాసముండినట్టు నటిస్తున్నామేగాని శ్వాసలేని రూపంగా జీవిస్తున్నాం. గాఢవిశ్వాసము

లేక దేనిని సాధించలేము. నమ్మి జీవించాలి. ఇదే ఉపనిషత్తు చెప్పేది.

**ఉత్తిష్ఠత జాగ్రత్త :**

నీవు అజ్ఞానము నుండి లెమ్ము లెమ్ము. ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత . ఈ అజ్ఞానమనే నిద్ర నుంచి నీవు మేలుకో. ఈ ప్రాకృత భావమునుంచి నీవు మేలుకో. లౌకిక జీవితము నుండి నీవుమేలుకో. దివ్యభవ్యమైన ఆత్మతత్త్వములో నీవు మేలుకో. స్వస్వరూప సంధానము. ఇదే ఆత్మ నిష్ఠ ,ఆత్మ సందర్శనము. ఇదే **self realisation.** ఆత్మసాక్షాత్కారము ఇదే. నిన్ను నీవు ఎవరో తెలుసుకో. నిన్ను నీవు తెలుసుకొనక అన్నింటిని తెలుసుకున్నానంటే అజ్ఞానమే. తనను తాను తెలుసుకోవటానికి ప్రయత్నించిన వాడే నిజమైన జ్ఞాని. ఇక్కడ రెండు లేవు. తెలుసుకునేవాడు, తెలుసుకోబడేది రెండు లేవు. రెండు ఉంటే ద్వైతమే అవుతుంది. గానీ అద్వైతము కాదు. ఒక్కటే ఉండాలి. ఉన్నది ఒక్కటే. నేను రెండుగా లేను. నేను రెండుగా ఎట్లాకనిపిస్తున్నాను? నిలువుటద్దము ముందు ఉండటం చేత రెండుగా కనిపిస్తున్నాయి. ఇది కేవలం భ్రాంతి కానీ సత్యము కాదు.

*నిలువుటద్దములో నీడ చూచుటకు జోడేల?*
*వియత్పథములో చంద్రుని విలోకించుటకు వెలుగేల?*
*ఆత్మతత్త్వము తెలుసుకొనుటకు గురువేల?* అన్నారు.

నీవు ఎప్పుడు ఒకటి అయిపోతావు? రెండులేనటువంటి తత్త్వాన్ని మనం పొందాలి. ఎన్ని రూపములైనా ఇది ఒక్కటే. ఎన్ని చలనములుపొందినా ఇది ఒక్కటే. పదార్థముల ప్రవర్తన వేరు వేరుగా కనిపించవచ్చును. అంతవరకు పోనక్కరలేదు. నాలుగు గడియారములు పెట్టండి. కీ యిచ్చి

కరెక్టుగా టైము పెట్టండి. గంట అయిన తరువాత ఒకటి రెండు నిమిషములైనా వ్యత్యాసము కనిపిస్తుంది. అన్నీ సమానముగా కనిపించవు. ఈ ప్రపంచమందు ప్రాకృత భావముతో నున్న మానవత్వములో అనేక భేదాలుకనిపిస్తున్నాయి. ఈ differences వ్యక్తుల స్వభావము పురస్కరించుకొని ఉంటాయిగానీ శక్తి యొక్క స్వభావము కాదు.

## దైవాన్ని మరువవద్దు, లోకాన్ని విశ్వసించవద్దు :

ప్రేమ స్వరూపులారా! దేనిని నమ్మినా నమ్మకపోయినా దైవమును మాత్రము నమ్మితీరాలి. అన్నీ అంతర్ధానమయ్యేవే. అన్నీ అదృశ్యమయ్యేవే నిల్చేది ఒకటే. ఆ ఒక్కటే ఆత్మతత్త్వము. అదే ఎరుక. అదే నాలోఉన్న **self.** ఆ **self** కోరికలలో ఉండేదికాదు. **Self is lovelessness. Love is selflessness.** అయితే, **selfless** అంటే ప్రాకృత సంబంధమైనది. **Love** కూడా లేదు. **Love** ఉంటే క్రోధము ఉండాలి కదా. **self is lovelessness.** ఇది ఆత్మతత్త్వములో కలిగేవి. ప్రాకృతములో కాదు. **Love lives by giving and forgiving self lives by getting and forgetting.** అదే నిజమైన ఆత్మ. అన్నింటిని మరచిపోవటమే **(forgetting)** అత్మ. అదే నిజమైన ఆత్మతత్త్వము. అన్నింటిని కరచుకుంటూ కరచుకుంటూ (అతుక్కొంటు)పోతే బంధన అధికమైపోతుంది. కనుక ప్రకృతి భావమునకు, ఆత్మ భావమునకు ఉండిన వ్యత్యాసము మనం అర్థము చేసుకోవాలి. ఆత్మలో ఎట్టి వాంఛలు లేవు. వాంఛలు దేనికోసం? ఉన్నదే ఒక్కటైనప్పుడు వాంఛలు ఏమిటి? ఏమీలేదు. ఒకానొక సమయంలో గోపికలు చెప్పారు.

వేయబోవనితలుపు తీయమంటూపిలుపు
రాధకెందుకొనవ్వు గొలుపు

విశ్వమంతా ప్రాణ విభుని మందిరమైన
వీధి వాకిలి ఏదటో

సర్వము మందిరముగా ఉన్నప్పుడు వీధి ఎక్కడుంది? వాకిలి ఎక్కడుంది? వీధి ఉంటే విశ్వము ఎట్లా మందిరమవుతుంది.

వీణతంత్రులు మీటి ప్రాణతంత్రులునాటి
ఆనంద బాష్పముల ఆత్మార్పణము జేయ
కైలాసమే చూడరా జీవా! వీధి వాకిలి అదియెరా.

మానవత్వములో అంతా ఒక్కటే. బయట ప్రదేశమని ఒకటి లేదు. వీధి వాకిలి అనేది లేదు. అంతా తనయందే ఉంటున్నది. రెండవది అనేదే లేదు. "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ." ఇలాంటి భావము నిజంగా మానవునియందు అభివృద్ధి అయినప్పుడే ఈ అత్మతత్త్వము చక్కగా అర్థమవుతుంది. కానీ తొంభైతొమ్మిది ముక్కాలు భాగం మనుష్యులు ప్రాకృతమైన జగత్తునే ఆధారము చేసుకొని బ్రతుకుతున్నారు. దైవాన్ని ఆధారం చేసుకొని బ్రతికేవారు చాలా తక్కువ. నూటికొక్కరో, కోటికొక్కరో ఉంటున్నారు. దైవమునే ఆధారంగాచేసుకోవాలి. నీ కర్తవ్యము నీవు నిర్వర్తించుకో. Do your duty sincerely. అయితే కర్తవ్యము ముఖ్యమని భావించుకోవాలి. Duty is God work; is worship. దీనిని వదలనక్కరలేదు. దీనిలో కూడా నీవు ఆత్మ భావము అభివృద్ధిపరచుకో. ఇదియే నా ఎరుక. ఇదే నా తెలివి. ఇదే నా జ్ఞానము.

ఏది జరిగినా అంతామంచే. మంచే. ఏది జరిగినా నా మంచి కోసమే ఇది సరైన భావము. కానీ మంచి జరిగితే నా అదృష్టమంటున్నారు. చెడ్డ జరిగితే దురదృష్టమంటున్నారు. ఎందుకు దురదృష్టమనుకోవాలి? ఇది కూడా మంచి కోసమే వచ్చింది. దురదృష్టమనేదే మానవునకు లేదు . అలా

అనుకోవటం వాని దురదృష్టమే అంతా అదృష్టమే. అదృష్టమనగా ఏమిటి? కంటికి కనిపించనిది అదృష్టము. అ-దృష్టము-దృష్టికి కనిపించనిది అదృష్టము. అదే నిజమైనది; అదే ఆత్మతత్త్వము. ఇట్టి ఆత్మతత్త్వాన్ని విశ్వసించి, భౌతిక జగత్తునందు కర్తవ్య కర్మలు నిర్వర్తించి, నిత్యానంద జీవితము పొందటం నేర్చుకోవాలి. ఎప్పుడు చూచినా ఆనందం ఆనందం ఎందుకోసం. ఎక్కడుంది ఆనందం happiness is union with God. దైవములో ఉన్నపుడు అంతా ఆనందము. దైవాన్ని మరచినప్పుడే దుఃఖము వస్తున్నది. దైవమును మరువవద్దు; లోకమును విశ్వసించవద్దు; మరణమునకు దుఃఖపడవద్దు. ఈ మూడు చాలా ముఖ్యమైనవి. దైవమును మరువవద్దు మొట్టమొదటి వాక్యము-దైవమును మరచినప్పుడే దుఃఖము వస్తున్నది. లోకమును విశ్వసించవద్దు. మరణమునకు దుఃఖించవద్దు. ఈ మూడింటి యందు మన జీవితమును ధృఢపరచుకున్నప్పుడే నిజమైన ఆత్మతత్త్వము అర్థమవుతుంది.

తేది : 9-10-1997 సాయికుల్వంత్ హాల్

*****

# అహంకారం - ఆడంబరం

*అనపేక్ష శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః*
*సర్వారంభ పరిత్యాగీ, యోమద్భక్తః సమేప్రియః*

ప్రేమ స్వరూపులారా!

అనపేక్ష అనగా ఎట్టి అపేక్షలు లేకపోవటం శరీరమనోబుద్ధులతో కూడిన మానవునకు ఎట్టి అపేక్షలు లేకపోవటం చాలా ఆశ్చర్యము. ఇది సాధ్యమా? కాదు కాదు. మానవునకు జీవితములో ఎన్నియో విధములైన అపేక్షలుంటున్నవి. కొన్ని శ్రేష్ఠమైనవి, కొన్ని ఇష్టమైనవి. కానీ ఈనాటి మానవునకు ఇంద్రియ సంబంధమైన ఫలితముచేత తాత్కాలిక ఆనందములు కలుగుతూ ఉంటాయి. ఇవి సత్యమైనవి కావు. క్షణభంగురమైనవి. ఇట్టి భౌతికమైన అపేక్షలచేత మానవుడు తన జీవితములో సత్యమును గుర్తించుకోలేక పోతున్నాడు. ఇట్టి క్షణభంగురమైన అభీష్టములను నెరవేర్చుకొనుటనే "ప్రేయస్సు" అని అన్నారు. రెండవది దీనికి పూర్తివిరుద్ధమైనది. అందరికి అర్థముకానిది. అందరికి

అందుబాటులో లేనిది. అంతర్భావముతో కూడిన అభీష్టమే దీనినే"శ్రేయస్సు" అన్నారు.

ఒకవైపున ప్రేయస్సు మరొకవైపు శ్రేయస్సు. ఇవి రెండూ మానవుని తమ వైపులాగుకునే నిమిత్తమై రెండూ పోటీ పడుతుంటాయి. కానీ ఈనాటి మానవుడు ప్రేయస్సు వైపే తన దృష్టి మరల్చును గానీ శ్రేయస్సు వైపు తన దృష్టి మరల్చడు. ఈ ప్రేయస్సనే వాంఛలు అమితమైన రీతిగా మానవుని ఆనందపరుస్తాయి. కారణము-తానీ భౌతికమైన దేహముతో, భౌతికమైన లోకములో, భౌతికమైన భ్రాంతులతో, భౌతికమైన జీవితము గడుపుతున్నాడు. ఈ ప్రాకృత జగత్తునకు ఈ ప్రేయస్సనే అభీష్టములే తనను ఆనందింపచేస్తాయి. ఇవి ఇంద్రియములతో కూడిన ఆనందమే.

ఇంద్రియములు శాశ్వతమైనవి కాదు. రోగమయమైనవి ఇంద్రియములు. రోగమయమైన ఇంద్రియముల ద్వారా అనుభవించే ఆనందము రోగమయముగానే ఉంటుంది. కంటితో చూచాము. చూచినది సత్యమని విశ్వసిస్తున్నాము. కానీ నీవు చూచిన వస్తువు అనేక రంగులతో కనిపిస్తున్నది. కానీ జాండిస్ రోగము వచ్చినపుడు అంతా పచ్చగా కనిపిస్తుంది. నాలుక ఉంటున్నది; నీవు భుజించే సమయములో కారము కారముగను, తీపి తీపిగను, చేదు చేదుగను గోచరిస్తాయి. కానీ మలేరియా జ్వరము నీలో ప్రవేశించిందంటే ఆ నాలుక పైన తీపి పెట్టుకున్నా చేదుగానే ఉంటుంది. అప్పుడు నీ నాలుక దోషమా! లేక తీపి దోషమా! కనుక ఇట్టి రోగమయమైన ఇంద్రియములచేత మానవుడు భ్రాంతులనే రోగములను అభివృద్ధి పరచుకుంటున్నాడు. కనుక ప్రపంచమంతయు ప్రేయస్సు వైపే ప్రయాణము చేయుచున్నది. కానీ శ్రేయస్సు వైపున నూటికొక్కరో కోటికొక్కరో ప్రయాణమవుతుంటారు.

అంతర్భావములు అభివృద్ధి పరచుకోవటము శ్రేయస్సు. అంతఃకరణ

పవిత్రముగావించుకోవటం అంతర్ దృష్టిని అభివృద్ధి చేసుకోవటము ఆత్మానందమును అనుభవించుకోవటం, అద్వైతానందము పొందటము. ఇవియే శ్రేయస్సుయొక్క పద్ధతులు దీనిని కోరేవారు చాలా తక్కువ.

మనము ఈనాడు అభీష్టము లేకుండా ఎట్లాచేసుకోవాలి అపేక్షలేని వాడంటే నాకు ప్రీతి అన్నాడు కృష్ణుడు శరీర మనోబుద్ధులతో కూడిన మానవుడు అపేక్ష లేకుండా ఏ రీతిగా ఈ జగత్తులో జీవించగలడు? ఏదో ఒకటి ఇష్టమైనదోలేక శ్రేయస్సును కలిగించేదో కోరే తీరాలి. మిగిలిన కోరికలు అన్నీ ఈ రెండు కోరికలలోనే సమ్మిళితమై ఉంటాయి. కోరికలు లేని మానవుడు జగత్తులో కానరాడు. కనుక అపేక్ష లేకుండా ఎట్లా ఉండేది? దీనికే చక్కని ఉపమానము చెప్పాడు. నాయనా! నీవు ప్రేయస్సుపైన ప్రయాణము చేయవద్దు. ప్రేయస్సుపై దృష్టి నిలుపవద్దు. సర్వకర్మ భగవత్ప్రీత్యర్థమని నీకర్మలు నీవు ఆచరించు. ఈ ఫలితము నీకు ఉండదు. కనుక ఏ విధమైన ప్రేయస్సు లేకుండా ఉంటుంది. అప్పుడు నీవు అపేక్షలేని వాడుగా ఉంటావు. నీవు కర్మలాచరించు. మానవుడు కర్మలాచరించే నిమిత్తమే కాయము ధరించాడు. "కర్మణ్యేవాధికారస్తే" అని గీత ప్రబోధించింది. 'కర్మానుబంధీని మనుష్యలోకే' ఉపనిషద్వాక్యము ప్రతి దేహము కర్మ చేత బంధింపబడుతున్నది. కాయముచే సర్వకర్మలు ఆచరిస్తున్నాడు మానవుడు.

అనపేక్ష ఉండాలంటే ఎట్లా వీలవుతుంది? నీవు కర్మలు వదలనక్కరలేదు. కర్మ ఆచరించు. ఫలితము నీవు ఆశించకుండాఉండు. అదియే అనపేక్ష. ఈ ఫలితము నీవు ఏ రీతిగా అర్పితము గావించాలి? కర్మము ప్రారంభించక పూర్వమే ఇది భగవత్కార్మగా విశ్వసించు. అప్పుడు ఇదంతా భగవత్కార్మగా రూపొందుతుంది. ఈ అపేక్ష భగవదపేక్షగా మారుతుంది. కనుక ఉపనిషత్తులు 'తస్మైనమః కర్మణే మొట్టమొదట కర్మకు నమస్కారము చేయి. ఎందుకోసం చేయాలి కర్మకు నమస్కారం? ''ఓ కర్మా! నేను ఆచరించే దాంట్లో ఎట్టి

దోషములు లేకుండా చూచుకోవాలి ఏ విధమైన పాపములు రాకుండా చూచుకోవాలి. కనుక నీకు నమస్కారము చేస్తున్నాను. నీవు ఈ మార్గములో సహాయము చేయమని'' కోరటం. కనుక అపేక్షలేని వాడంటే నాకు ప్రీతి అన్నాడు భగవంతుడు. ఇప్పుడు మనం చేయవలసింది ఏమిటి? కర్మను నీవు వదలనక్కరలేదు కర్మను వదలి మానవుడు ఒక్క క్షణమైనా జీవించుటకు వీలుకాదు. కరచరాణాది అవయములతో చేసే కర్మలే కాదు. సంకల్పములు కూడా కర్మలే. దృష్టి కూడ [illegible]మే శ్రవణము కూడా కర్మయే. ఈ పంచేంద్రియములతో కూడిన సర్వ కర్మలు కర్మల క్రింద చేరుతుంటాయి. ఈ సర్వము భగవత్ప్రీత్యర్థముగా ఆచరించటమే కర్మలేనట్లుగా తోస్తుంది. నీవు ఎట్టి అభీష్టము లేనివాడుగా రూపొందుతావు అప్పుడే అనపేక్ష అనే సార్థకనామము వస్తుంది.

**రెండవది. శుచిః** - శుచి అనగా పరిశుద్ధము. ఏమిటి ఈ పరిశుద్ధము? శరీరము పరిశుద్ధముగా ఉంచుకోవటమా? లేక బట్టలను పరిశుద్ధముగా ఉంచుకోవటమా? ఇది కూడా అవసరమే. ఇది బహిశ్శుద్ధి దీనికంటే అంతశ్శుద్ధి అత్యావసరము. బహిర్ శుద్ధి మాత్రమే ఉండి అంతర్ శుద్ధి లేకపోతే సర్వము మాలిన్యమైపోతుంది. భగవంతుని వంచన గావించినట్లుగా ఉంటుంది. కనుక అంతర్ శుద్ధి నీవు చూచుకోవాలి. అనగా దుర్భావములు, దుశ్చింతనలు, దురాలోచనలు, రాగద్వేషములు ఇట్టి మాలిన్యమయమైన భావములు మనస్సుకు లేకుండా చూచుకోవాలి. ముఖ్యంగా పాత్ర లోపలనే మహాపవిత్రంగా ఉంటుండాలి. ఈ టంబ్లరులో నీరు పోసుకున్నాము. లోపల పరిశుద్ధముగా నున్నప్పుడే నీరు త్రాగటానికి వీలవుతుంది. బయట మాత్రము శుభ్రముగా ఉండి లోపల మాలిన్యముంటే త్రాగుటకు వీలుకాదు. కనుక అంతర్ శుద్ధి అత్యావసరము. దీనినే యింకొక రీతిగా చెప్పాలనుకుంటే కళాయి లేని పాత్రలో పప్పు, పులుసు వండితే అదంతా చిలుము పట్టిపోతుంది. అదే

విధముగా లోపల పరిశుద్ధము లేనప్పుడు నీవు బాహ్యముగా ఎన్ని పవిత్రమైన కర్మలు చేసినా మాలిన్యమైపోతాయి. కనుక నీవుశుద్ధిగా ఉండమని చెప్పాడు.

**మూడవది శుచితోబాటు దక్షత.** అనగా ఒక విధమైన ప్రతిజ్ఞ పూనాలి. ఈ జగత్తులో ఏ సమయమునందైనా నేను ఒక ఆదర్శమును సాధించాలి అని ఒక దీక్ష పూనాలి. మానవ జీవితము దేని కోసం వచ్చింది. మానవ లోకమునకు ఆదర్శము నిరూపించాలి. ఆవిధముగా నిరూపించటమేకాక ఆత్మతత్త్వమునకు అత్యంత సమీపుడు కావాలి. రవి చెప్పాడు మొట్టమొదట సాలోక్యం-రెండవది సామీప్యం సారూప్యం మూడవది నాల్గవది సాయుజ్యం. ఈ నాల్గింటి యొక్క తత్త్వమందే పవిత్రమైన చిత్తము నిల్చిపోతున్నది. కనుక నేను కర్మలు చేయక తప్పదు. కర్మ కోసమే కాయము అవతరించింది. కాయము చేత కర్మలు చేసి కాయము పవిత్రము గావించాలి. కనుక కాల కర్మ కారణ కర్తవ్యములు నిర్వర్తించటమే మానవుని ప్రధాన కర్తవ్యము. ''నా జీవితమంతా, కట్ట కడపటికి ప్రాణము విడుచునంతవరకు పవిత్ర కర్మలు నేను ఆచరించాలి''. ఈ విధమైన దీక్ష మనం పట్టాలి. నేడు ఒక భావము, రేపొక భావము ఈ విధంగా మార్పుచెందుతూ రాకూడదు. నీ అనుకూలములు పురస్కరించుకొని నీవు కర్మలు ఆచరించకూడదు. నీ హృదయ సాక్షిగా కర్మలు ఆచరించుటకు పూనుకోవాలి. మనము మన హృదయ సాక్షిగా కర్మలు ఆచరించుటకు ఒక దీక్ష పూనాలి. 'ఓ భగవంతుడా! ఈ కాయము ఎందుకోసం ఇచ్చావు? నీ సేవ నిమిత్తమై నేను కాయము ధరించాను. నా తల్లిదండ్రులు నీసేవ నిమిత్తమే ఈ కాయము నందించారు. కనుక నిన్ను, నా తల్లిదండ్రులను తృప్తిపరచటమే నాకు ప్రధానమైన దీక్ష. కనుక మాతృదేవోభవ! పితృదేవోభవ! అని వారిని దైవస్వరూపులన్నారు.

**నాల్గవది ఉదాసీనత** - ఉదాసీనమనగా దేనిని పట్టించుకోకుండా పోవటం కాదు. మంచి, చెడ్డ రెండింటిని త్యజించటమే. ఇది మంచే అని స్వీకరించటం

కాదు. ఇది చెడ్డ అని విసర్జించటం కాదు. రెండింటిని విసర్జించాలి - ఎట్లా? నీవు దారిని నడుస్తుంటే దారిలో ఒక ముల్లు కాలికి గుచ్చుకొంది. ఆముల్లును మనం తీసి వేయాలంటే మనం యింకొక ముల్లును సంపాయించుకోవాలి. ఇంకొకముల్లు సంపాయించి ఆవిరిగిన ముల్లును యీ ముల్లుతో తీసి రెండు ముల్లులు పారవేయాలి. ఒక ముల్లు విరిగి నిన్ను బాధిస్తున్నది. యింకొకముల్లు దానిని తీసి సంతోషపరచింది. సంతోషపరచింది కదా అని ఆముల్లు నీ దగ్గర పెట్టుకో కూడదు. ఇది నన్ను బాధించిందని దానిని మాత్రమే దూరము పారవేయ కూడదు. రెండూ ముండ్లే. రెండింటిని తీసి పారవేయవలసిందే. ఉదాసీనత చాలా ప్రధానమైనది ఎలాంటి విషయమునందు రాగముగానీ, ద్వేషముగానీ ఉండకూడదు. ఇంతే కాదు."సంబంధ బాంధవ్యములందు అత్యంత సంబంధము కల్గించుకోకూడదు!" ప్రాకృతమునందు అనేక బంధనలు మనం అభివృద్ధి పరచుకుంటున్నాం. ముఖ్యంగా రాజకీయములలో మనం ప్రవేశించకూడదు. కారణమేమనగా మన రాగము మరింత రాగముగా మారిపోయి రోగంగా తయారౌతుంది. దేనియందు ఆపేక్ష లేకుండా చూచుకోవాలి.

**తరువాత సర్వారంభ పరిత్యాగి.** సర్వము త్యజించాలి. ఎట్లా త్యజించాలి? అహంకారమమకారములు దూరముగావించుకోవటమే సర్వారంభ పరిత్యాగము. మానవుని అనేక కష్టములకు గురిచేయునది రాగద్వేషములే. మానవునికి భ్రమలు కల్గించేది అహంకారమే. ఈ అహంకారము ఉండినంత వరకు మానవునికి ఆనందము అత్యంత దూరంగా ఉంటుంది. ఈ అహంకారమును, ఆండబరముచేత అభివృద్ధి గావించుకుంటున్నాడు. ఆడంబరము లేకపోతే అహంకారమునకు కళయే ఉండదు. కనుక అహంకారముచేత ఆడంబరము పెంచుకుంటున్నాం. అహంకార ఆడంబరములను త్యజించటమే సర్వారంభపరిత్యాగము.

**యోమద్భక్తః సమే ప్రియః** - ఇటువంటివాడు నాకు ప్రియుడు అని

చెప్పటం చాలా సులభమే. కానీ, సాధించటము చాలా కష్టము. ఇది ప్రతిమానవునికి వచ్చే సందేహమే. నా ఉద్దేశ్యము ఏమంటే చెప్పుట కష్టము;, చేయటమే సులభము. ఇవన్నీ మంచి మార్గము అని గాఢమైన విశ్వాసముంటే ఎంతసులభముగానైనా ఆచరించవచ్చును. ఈ విశ్వాసము గాఢముగా లేక పోవటంచేత కష్టం కనిపిస్తున్నది. ఏ అపేక్షలు లేకుండా ఉండాలి ఇది చాలా మంచిది అనే గాఢ విశ్వాసము నీలో లేదు. మంచిదని చెప్పుతున్నావుగానీ విశ్వాసము లేదు. ఇదియే దైవ ద్రోహమునకు మూల కారణము. The proper study of mankind is man లోపల యిది మంచిదేయని తలచుకుంటున్నావు. కానీ యిది వుంచిదని చెప్పలేక పోతున్నావు. చెప్పలేకపోవటమే కాదు చేయలేకపోతున్నావు. ఇది మంచిదని తెలిసినప్పుడు ఎందుకు నీవు చెప్పకూడదు? ఎందుకు నీవు చెప్పినప్పుడు చేయకూడదు? దీని పైన పూర్ణ విశ్వాసము లేకపోవటం మానవత్వము రాక్షసత్వంగా రూపొందుతుంది. అహంకారము, అభిమానము, అడంబరము రజోగుణము యొక్క లక్షణములని బోధించాడు కృష్ణుడు. నాయనా! నీవు నా భక్తుడు కావాలనుకుంటే ఈ రాక్షసగుణములను నీలో చేర్చుకోవద్దు. ఆడంబరము మహా ప్రమాదము. అహంకారము మరింత ప్రమాదము. ఈ ఆడంబరము, అహంకారము త్యజించాలి. ఆశలుండినా ఉండవచ్చు. కానీ ఆడంబరము, అహంకారము ఉంటే తనను తాను ద్రోహము చేసుకోవటమే. ఎవరికో చేస్తున్నామని కాదు. తనను తానుకించపరచుకుంటున్నాడు. తనకు తానే ద్రోహము చేసుకుంటున్నాడు. ఇది ఆత్మ మార్గమునకు విరుద్ధమైనది. మొట్టమొదట తనను తాను తరింపచేసుకోవాలి. తనను తాను రక్షించుకోవటానికి ప్రయత్నించుకోవాలి.

***ఆడంబరం, అహంకారం వద్దు :***

చేసే ప్రతి పనియందు ఆడంబరమా? అహంకారమా? అనే విచారణ

చేయాలి. ఇదియే మనస్సుకు బుద్ధికి ఉన్న వ్యత్యాసము. మనస్సు ఎలాంటిది? చూచింది ఆశిస్తుంది. ఏ మాత్రము కాలమును వ్యర్థము చేయదు. కానీ బుద్ధి అట్లా చేయదు. చూచిన తక్షణమే యిది మంచా? చెడ్డా? అని, చేయతగినదా? చేయతగనిదా? అని, ఇది సరైన మార్గమా? కాదా? అని విచారణ చేసి అందులో ప్రవేశిస్తుంది. కనుక బుద్ధికి, మనస్సుకు ఉన్న వ్యత్యాసము గుర్తించుకుంటే తప్పక ఈ విశ్వాసము గాఢముగా నిల్చిపోతుంది. ఏది నీవు చేసేది తప్పని అనుకుంటావో దాన్ని విసర్జించు.

నీవు పదిమంది కోసమని, లోక ప్రతిష్ఠ కోసమని, కీర్తి ప్రతిష్ఠల కోసమని పాటుపడవద్దు. లోకులు మెచ్చవచ్చు కానీ లోకేశుడు మెచ్చవద్దా? భగవంతుని మెప్పు నీకు కావాలి గానీ తోటిమానవుని మెప్పు నీకెందుకు? తుచ్ఛమైన గౌరవ మర్యాదల కోసమని మన హృదయాన్ని మనము మాలిన్య పరచుకుంటున్నాము. నీ మనస్సు నీవు పవిత్రముగా ఉంచుకో ఈ పవిత్రత ఎట్లా ప్రాప్తిస్తుంది? దీనికి తగిన సాధనలు చేయాలి. అదే భగవన్నామము. టంబ్లరు కొంచెం మలినంగా ఉంటున్నది. ఈ టంబ్లరు మలినమును పరిశుభ్రము చేయాలంటే ఏమి చేయాలి? కొంత జలము తేవాలి. కొంత విమ్ పౌడరు వేయాలి. దాన్ని చక్కగా తిక్కాలి. తిక్కి జలములో కడగాలి. అప్పుడు మలినము పోయి మెరుపుగా కనిపిస్తుంది. ఈ ప్రేమయే జలము, విమ్‌పౌడరే శక్తి. మన సత్కార్మలే తోమటం. ఈ మూడింటి ఏకత్వము చేత మనస్సు మాలిన్యము తొలగుతుంది. మనస్సు మాలిన్యము దూరం కావాలంటే భగవచ్చింతన అత్యవసరము. అయితే ఈ చింతన ఎంత వరకు కావాలి. తన మనస్సు పరిశుద్ధమై ఏకాత్మ భావము కలిగేంత వరకు సాధన అవసరము. నేను వేరు నాఆత్మ వేరు, అని ఉండినంత వరకు సాధన చేయాలి. నేను-ఆత్మ రెండు ఒక్కటే యని గుర్తించుకున్న తరువాత ఏ సాధనలు చేయనక్కరలేదు. వంట పూర్తి అయిన తరువాత కట్టెలతో పని ఏముంది? మనకు. అదే విధముగా మన తత్త్వము మనం

గుర్తించుకున్న తరువాత యింక సాధనలు అవసరము లేదు. దేని కోసం సాధనలు కావాలి. ఆకలి తీరేంత వరకే అన్నము. ఆకలి తీరిన తరువాత అన్నముతో అవసరం లేదు. నీ ఆకలి తీరింది. ఎట్లా తీరింది. ఏకాత్మ భావము అనుభవించావు. దానిని అనుభవించాలనే దీక్ష ప్రతి మానవునియందు ఉంటుండాలి. కానీ యీనాటి మానవునిది అంతా show మనము సాధనలు చేస్తున్నామని, పవిత్రత కోసం మనం ప్రయత్నం చేస్తున్నామని, సరైన మార్గము పొందాలని అశిస్తున్నామని, దివ్యమైన స్థితిని పొందాలని కోరుతున్నామని అనుకుంటున్నాము. ఆచరిస్తున్నాము, show చేస్తున్నాము. కానీ హృదయములో యిట్టి స్థిరమైన విశ్వాసమున్నదా? ఆ విశ్వాసమే ముఖ్యంగా కావాలి. అది లేక ఎన్ని చేసినా ప్రయోజనం లేదు. ఆ విశ్వాసము దృఢముగా చేసుకొని ఆ దివ్య భావము మనము గట్టిగా పట్టాలి. అట్లు పట్టినప్పుడే మనకు చిక్కుతుంది, దక్కుతుంది.

దైవ విశ్వాసము ఎన్ని విధములైన కష్టములు, నష్టములు, విచారములు, దుఃఖములు కలిగినప్పటికిని, ఆ విశ్వాసము సడలిపోకూడదు. ఆదృఢ విశ్వాసమే అనేక మంది భక్తులను సంరక్షిస్తూ వచ్చింది. ప్రాచీన కాలము నుండి మహర్షులను రక్షించినది ఏ శక్తి? లక్ష్మీ శక్తి, దుర్గా శక్తి, పార్వతి శక్తి అని అనుకుంటున్నాము. ఏ శక్తికాదు ఆ దృఢవిశ్వాస శక్తియే పెద్ద శక్తి. విశ్వాస శక్తి లేక ఎన్ని శక్తులుండి ప్రయోజనం ఏమిటి? కనుక ఆ విశ్వాసమనే శక్తిని మనం బలపర్చుకోవాలి. ఎన్నో అడ్డములు తగులుతాయి, ఎన్నో బాధలు మనలను హింసిస్తూ ఉంటాయి. ఏ మాత్రము లెక్క చేయకూడదు. వీటన్నింటిని తట్టుకొని నెట్టుకొని ముందుకు సాగినప్పుడే మనము దీనిని సాధించినవారమవుతాము. అడ్డు తగిలిందని ఏమవుతుందో అని సందేహపడితివా యింక ధ్వంసమైపోయినావు. ఎట్టి పరిస్థితిలో మన విశ్వాసము దూరము చేసుకోకూడదు. విశ్వాసముండిన మానవుడు ఎంతైనా సాధిస్తాడు. అనేక పర్యాయములు త్యాగరాజుకు కూడా

విశ్వాసము కొన్ని సమయములలో చంచలమైపోతూ వచ్చింది రామదాసుకు కూడా అనేక పర్యాయములు doubts వచ్చాయి. ''రామా! నాకు నీవు తప్ప ఎవరు లేరని'' పరిపూర్ణముగా విశ్వసించినవాడు రామదాసు. తన సర్వస్వము రామునకర్పించిన వాడు రామదాసు. కానీ కొన్ని సమయములలో మనుష్యత్వము బలహీనతకు గురౌతుంది. ఆ బలహీనత వల్ల బుడగవలె సందేహము బయలుదేరుతుంది ఆ సిపాయిలు అతన్ని జైల్లో వేసి కొడుతున్నారు. ఆ దేహ బాధలను సహించుకోలేకపోయాడు రామదాసు. రామునిపై కోపం వచ్చేసింది. కోపము రాకూడదు సాధకునికి.

*కలికి తురాయి నీకు కుదురుగ చేయిస్తి రామచంద్రా!*

*ఎవరబ్బసొమ్మని కులుకుతు తిరిగేవు రామచంద్రా!*

అని తిట్టినాడు. ఎవరబ్బసొమ్ము; నీవు పెట్టుకొని కులుకుతున్నావే అన్నాడు. తక్షణమే బాధ కల్గింది. అయ్యో! నా స్వామిని ఇంతగా నిందించానా.

*అబ్బ! తిట్టితినని ఆయాసపడవద్దు*

*ఈ దెబ్బలకోర్వక అబ్బ తిట్టితినయ్యా రామచంద్రా!*

ఈ బాధలు సహించుకోలేక నిన్ను నేను తిట్టినానుగానీ తిట్టాలని తిట్టలేదు. కానీ అప్పుడు కూడా ఓపిక పట్టుకోవాలి. బిడ్డపైన ప్రీతి ఉంది కదాయని గట్టిగా గొంతుపట్టుకొని ముద్దుపెట్టుకుంటే ప్రాణం పోతుంది. అయ్యో నేను ప్రాణం పోవాలని పిసకలేదు ప్రేమతోపిసికాను అంటే ఏమి ప్రయోజనం చెప్పండి. అక్కడ కూడా సూక్ష్మాన్ని గుర్తించుకుంటూ పోవాలి పరులకు బాధ కలిగించక ప్రేమను మనం అనుభవించాలి.

అదే విధముగా త్యాగరాజు. తాను బాధలకోర్వలేక పోయాడు. తనయింటి

నుండి రాములు వెళ్లిపోయాడు. ఆ రాములను వెతుకుతూపోయాడు. ఎక్కడా చిక్కలేదు. ఓ చెట్టు క్రింద కూర్చున్నాడు. రామా! నిన్ను సర్వకాల సర్వావస్థలందు భజించి స్మరించినందుకు ఇదా ఫలితము. నిన్ను ఏమి కోరినాను ఏ కొండలు గానీ, ధనముగానీ, ధాన్యముగానీ కోరలేదు. నిన్నే కోరాను. యింత మాత్రము దయ లేదా? నీకు దయలేదా? లేక నాలో భక్తిలేదా? ఇందులో సందేహము తీరిపోవాలి అని అనుకొని నిర్ణయము చేసుకున్నాడు. నాలో కాలి మొదలు తల వరకు ''రామ, రామ'' అనే చింత సర్వత్రా ప్రసరిస్తున్నది. నాలో భక్తి లేదని చెప్పుటకు వీలులేదు. చూస్తే నీలోనే శక్తి లేదు. చేతకాని వారికి చేష్టలు జాస్తి. చెప్పుతున్నాడు. రామా! నీలో శక్తి ఉంటే నన్ను ఎందుకు రక్షించుకోలేకపోయావు? నీలో శక్తి లేదన్నాడు. తక్షణమే మనోభ్రాంతి అభివృద్ధి అయింది. నిజంగా అతనికి శక్తి లేదా? Self enquiry ప్రతిమానవునికి అత్యావసరము. నాలో ఆ పవిత్రత ఉందాలేదా అనే దృఢమైన విచారణ చేయాలి.

**రామశక్తి :**

*కపి వారధి దాటునా? కలికి మింట లేచునా?*
*లక్ష్మీదేవి వలచునా? లక్ష్మణుండు కొలచునా?*
*సూక్ష్మ బుద్ధి గల భరతుడు చూచి చూచి మ్రొక్కునా?*
*అబ్బ! రామ శక్తి ఎంతో గొప్పరా!*

ఓ రామా! నీ శక్తి ఎంత గొప్పది. ప్రపంచమంతా ప్రార్థిస్తే కూడా లక్ష్మీదేవి ఎవరికీ చిక్కటంలేదు. ఆమె మీ పాదాలు వత్తుతూ కూర్చుందే, ఆమెకు బుద్ధిలేదా! అలాంటి లక్ష్మీదేవే నీ పాదాక్రాంతురాలైనప్పుడు నేనెవరు. నీలో శక్తి లేకపోతే ఆమె నీ పాదములు ఎట్లావత్తుతుంది? కపి వారధి దాటునా? చంచలత్వమునకు పుట్టినిల్లు, పెట్టింది పేరు కోతి. సముద్రాన్ని దాటుతాడా! కేవలం నమ్మరాని విషయము. నీ శక్తియే దాటించింది. ఆ శక్తి ఎట్లా వచ్చింది హనుమంతునికి?

రోమరోమము రామనామమే. ''సర్వదా సర్వకాలేషు సర్వత్ర రామ చింతనమే''. ఎలాంటి పరిస్థితిలోనైనా అహంకారము, ఆడంబరము ప్రదర్శించినవాడు కాదు హనుమంతుడు. నిరంతరము రాముని చెంత చాలా దీనుడే! కానీ రావణుని దగ్గర పోయినప్పుడు వీరుడే. రాముల దగ్గర నిరంతరం దాసుడుగానే ఉంటున్నాడు. అశోకవనములో యిష్టానుసారము సంచరిస్తున్నాడు హనుమంతుడు. అనేకమంది రాక్షసులు కోతిని ఏనాడు చూడలేదు. ఈ కోతిని చూడడానికని ఆశ్చర్యముగా వస్తున్నారు గుంపులు గుంపులు. ఒక రాక్షసుడు ప్రశ్నించాడు ఎవరు నీవు? ఎంత వినయంగా చెబుతున్నాడు. 'దాసోహం కోసలేంద్రస్య' నేను రామచంద్రుని దాసుడను. ఆ సమయమునందు మనసుకు ఎంత మృదు మధురమైనదిగా తోచింది. రామ విషయములో సర్వము లీనమైనవాడు. అలాంటి రామునికి బలము లేకుండా పోలేదు. సర్వశక్తిమయుడు రాముడు. ఇలాంటి శక్తి ఎలా తెలుస్తుంది? తన భక్తిలోనే తెలుస్తుంది. తన విశ్వాసము అంత గాఢముగా ఉండటం చేత రాముని శక్తి గాఢంగా విశ్వసిస్తూ వచ్చాడు. తనలో ఆత్మ విశ్వాసము లేక పోతే దైవముపై పూర్తి అవిశ్వాసము వస్తుంది. ''యద్భావం తద్భవతి''. ఇదంతా నీలోని భావములు గానీ దైవములోనివి కావు. నీలోని లోపముతోగానీ దైవములో లోపమేలేదు. మనము అన్ని విధాల బుద్ధి చెప్పవలసిన చోట చెప్పాలి. అనుభవించవలసిన దగ్గర అనుభవించాలి. అదే హనుమంతుడు ఎంత శాంతముగా, ఎంత ప్రీతిగా, ఎంత సౌమ్యముగా, ఎంత ఆనందముగా అన్ని విధముల రామసేవ చేశాడు? కట్టకడపటికి రాక్షసులచేత చిక్కాడు. ఆ రాక్షసుల చేత చిక్కినపుడు రావణుని దగ్గరకు పట్టుకొనిపోయారు. రావణుడు హనుమంతుని చూచి ఒరే! క్రిందకూర్చో అన్నాడు. రావణుడు పెద్ద సింహాసనముపై కూర్చున్నాడు. ఛీ! ఈ దుర్మార్గుడు పైన కూర్చోటము రామదాసునైన నేను క్రింద కూర్చోటమా! తగినదికాదు. తన తోకను పెంచాడు - పెంచాడు; చుట్టాడు - చుట్టాడు. రావణుని కంటె పైకిపోయి కూర్చున్నాడు.

రావణుడు ప్రశ్నించాడు :

''కోతి జాతివి వనమెల్ల చెరిచితివి నిన్నెవడు పంపించెరా!

కోతి జాతివి నిన్నెవడు పంపించెరా!''

నవ్వుతూ చెబుతున్నాడు హనుమంతుడు :

''నీ చెల్లి ముక్కు చెవులు కోసిన రాచదొర నన్నంపెరా''

అతనే నన్ను పంపించాడు అన్నాడు. ఎంత చక్కని సూటి అయిన మాటలు. ఈ హనుమంతునిలో పూర్తిగా రాముడే లీనమైపోయినాడు. "బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి." అదే సాయుజ్య తత్త్వము. భక్తులలో భగవంతుడు లీనమై ఉంటున్నాడు. రాక్షసులంతా తిరుగుతున్నారు అటు యిటూ లంకంతా అగ్గిపెట్టాడు. కేకలు వేస్తు తిరుగుతున్నారు.

*ఏదన్నా? ఈ కోతి నెవరు పంపిరి?*

*అది మామీద గోదాడ చేసెనే!*

కానీ విభీషణుని భార్య సరమా, బిడ్డలు రెండు చేతులు జోడించి నమస్కరించారు హనుమంతునికి. వారికి యిలాంటి పవిత్రమైన దర్శనం లభ్యమైంది. రాములను మేము చూడలేము. రామదాసుని ద్వారా చూస్తున్నాము. రామదాసు ఒక పరిశుద్ధమైన అద్దము వంటి వాడు. ఆ అద్దములోనే రామచంద్రుని మేము చూడగలుగుతున్నాము. దాసుడు ఎట్లా ఉండాలంటే పవిత్రమైన పరిశుద్ధమైన అద్దము వలె తయారు కావాలి. ఏ విధమైన అహంకార ఆడంబర మాలిన్యములు యిందులో ప్రవేశించకూడదు. అలాంటి వాడే నాకు భక్తుడు నాప్రియుడు అన్నాడు కృష్ణుడు.

### దుష్టభావాలు వీడుటే త్యాగం, అహంకారం వీడుటే యోగం :

మొట్టమొదట అనపేక్ష. ఈ అపేక్షలను తగ్గించుకొనుటకు

ప్రయత్నించేయాలి. అప్పుడే మనలో తగిన శక్తి ప్రారంభమవుతుంది. దీనినే **less luggage more comfort** అన్నారు. వైరాగ్యమంటే ఇల్లు, వాకిలి వదలి వెళ్లమని కాదు. ఆస్తి, ఆలి వీడి అడవి కేగుట కాదు. భావమందు దుష్ట భావము వీడుటే త్యాగమగును అదియే యోగమగును.

త్యాగము, యోగము అంటే అడవికి పోవటంకాదు. దుష్ట భావములు వీడుటే త్యాగము. అహంకారము వీడుటే యోగము. రెండూ ఉండినప్పుడే అదే నిజమైన త్యాగము. అందువల్లనే త్యాగము ప్రతిసాధనకునకు అంత్యస్థితి. వేదము కూడా చెబుతుంది. ''నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానసుః''. ఈ కర్మల ద్వారాగానీ, సత్సంపత్తి వల్లగానీ, ధనము వల్లగానీ కాదు. త్యాగము వలననే అమృతత్త్వము ప్రాప్తిస్తుంది. త్యాగమునకు ప్రతి ఒక్కరు సిద్ధంగా ఉంటుండాలి. అన్నీ త్యాగము చేయనక్కరలేదు. నీకు చేతనైనది త్యాగము చేయి, త్యాగ భావము నీలో రావాలి, పిసినారిభావము పెట్టుకోకూడదు. పిసినారుల జన్మ సార్థకము కాదు. మనకు శక్తి ఉన్నంతలో త్యాగము చేసి పదిమందికి ఉపకారము చేయాలి. పట్టెడన్నము పెట్టి ఒకని పొట్టనైనా నింపాలి. సంపాదించి సంపాదించి ఏమి తీసుకుపోతున్నాము. వెంట ఏమీ రాదు. ఏ మాత్రం మట్టికూడా తీసుకు పోవటానికి వీలుకాదు. ఎవడైనా పోయేవాడు పిడికెడు మట్టి తీసుకుపోతే మన భారతదేశములో మట్టికి కూడా రేషను వచ్చేది. ఏమీ తీసుకుపోవటానికి వీలుకాదు. ఎంత మందిని చూస్తున్నాము.

కారే రాజులు రాజ్యముల్ కలుగరే

*గర్వోన్నతింబొందరే! వారేరి?*

పేపర్లో చూస్తున్నాం. సంపాయించినవారు, ఏమేమో ప్లానులు వేసుకున్న వారు, కట్టకడపటికి ఏమీ తీసుకుపోవటం లేదు. ఏదీ మన వెంట రాదు.

అలాంటి పరిస్థితిలో మనం త్యాగ భావము పెంచుకుంటూ రావాలి. త్యాగమే లేకపోతే అదే మనకొక రోగంగా ఉంటుంది. ఈ రోగము కల్గినవారికి భగవద్భావము రాదు. భగద్భావము రావాలంటే త్యాగము కావాలి. ఈ త్యాగముతో అంతో యింతో పరులకు ఉపకారము చేయాలి. యిదే పద్దెనిమిది పురాణముల సారము. ''పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం'' Help ever hurt never. ఇదే మనము ఈనాడు నేర్చుకోవలసినది.

తేది :10-10-1997 సాయికుల్వంత్ హాల్

★★★★★

# యజ్ఞరహస్యం : త్యాగమే యోగం

సర్వే వైసుఖిన స్సన్తు సర్వేసంతు నిరామయాః
సర్వేభద్రాణి పశ్యంతు మా కశ్చిత్ దుఃఖమాప్నుయాత్

ప్రేమస్వరూపులారా!

ప్రాచీన కాలము నుండి భారతదేశము ఆధ్యాత్మిక సిరిసంపత్తుల చేత అన్ని దేశములకు సుస్థిర శాంతి భద్రతలు చేకూర్చుచూ వచ్చుచున్నది కనుకనే నాటికి నేటికి లోకాఃసమస్తాః స్సుఖినో భవంతు' అంటున్నారు. భారతీయ సంస్కృతి, దాని ప్రభావము దాని ఫలితము అనుభవజ్ఞులకే అర్థమవుతుంది. కాలముచే మారక, చరిత్రచే మాయక, ప్రళయముచే తరగక, సృష్టిచే పెరగక ఏ సత్యమైతే ఉన్నదో, ఆ సత్యమునకు సాక్షాత్ స్వరూపమే భారతీయ సంస్కృతి. ఆ సంస్కృతి యొక్క ప్రతిబింబమే భారతీయ సనాతన ధర్మము. ఈ సనాతన ధర్మ స్వరూపము యొక్క బాహ్య స్వరూపమే నీతి. ఈ నీతిని ఆధారము చేసుకొనే మానవుడు తన జాతిని పోషించుకుంటూ వస్తున్నాడు. ఇట్టి మానవ జాతి నైతికముగా కొంతవరకు మార్పు చెందినప్పుడే సమానత్వము, సోదరత్వము, స్వేచ్ఛ అనే ఆదర్శములు ఆచరణలో వస్తాయి. మానవుడు

ఇంద్రియ నిగ్రహము గావించుకున్నప్పుడే ప్రపంచములో సంఘర్షణలు సమాప్తి అవుతాయి. ఇట్టి దివ్యత్వముతో కూడిన భారతీయ సంస్కృతిని ఈనాడు భారతీయులు విస్మరించారు. కారణము స్వార్థము, స్వప్రయోజనమే మానవునకు మూలాధారమై తన యొక్క దివ్యత్వము విస్మరింపచేసి కేవలము మానవత్వమునే మరపింపచేస్తుంది. మానవునినుండి ఆవిర్భవించే సమరసము, సమన్వయము సరైన మార్గములో ప్రవేశపెట్టాలి. ఈనాటి మానవుడు తన సమన్వయమును సమరసమును సాత్విక భావములను తగిన మార్గములో అనుభవించటం లేదు. ప్రకృతికి, మానవునకు ఎట్టి ద్వేషము లేదు. తల్లిపాలు బిడ్డలుగ్రోలినట్లుగా పూవులోని మకరందము తేనెటీగలు త్రాగినట్లుగా, ప్రకృతిలోని సర్వసంపదలు మానవుడు అనుభవించుటకు అధికారమున్నది.

## హక్కులుకావు - కర్తవ్యం ముఖ్యం

మానవాళి కంటె అత్యంత విశాలమైనది ఈ సృష్టి. ఈ సృష్టిరహస్యము చక్కగా గుర్తించి వర్తించటమే మానవుని ప్రధాన కర్తవ్యము. అయితే ఈ సృష్టికి, భగవంతునకు ఉండిన సంబంధ బాంధవ్యము ఏమిటి అనే విషయము మనము విచారణ చెయ్యాలి. చెయ్యి, ముక్కు, కన్ను, నోరు, కాలు, కడుపు యివన్నీ అంగములు. ఇవన్నీ దేనికి అంగములు? శరీరమునకు అంగములు. ఈ శరీరములు సమాజమునకు అంగములు. ఈ సమాజము మానవతకు అంగము. మానవత ప్రకృతికి అంగము. ప్రకృతి పరమాత్మకు అంగము. ఈ విధంగా మనం విచారణ చేసుకుంటూపోతే శరీరము మొదలుకొని పరమాత్మతత్త్వము వరకు అంగాంగ భావము చేత కూడిన ఆనందస్వరూపమే మానవుడు. ఇట్టి ఆనంద స్వరూపమైన మానవుడు ఆనందమునకై అనేక విధములుగా అల్లాడులు చాస్తున్నాడు. ఎక్కడ చిక్కుతుంది ఈ ఆనందము? బయట ప్రపంచములోచిక్కుతుందా? చిక్కదు. కానీ మానవుడు నిజంగా

గుర్తించవలసినది ఒక్కటి తనయందున్న దివ్యత్వము తాను గుర్తించుకున్నప్పుడే సర్వము గుర్తించిన వాడు కాగలడు. ఇలాంటి మానవత్వములో ప్రకృతిని కేవలము భగవంతుడు ఉపభోగ నిమిత్తమై ఏర్పరచినాడని భావిస్తున్నాడు మానవుడు. ఉపభోగ నిమిత్తమై ఏర్పడినది కాదు ఈ సృష్టి. ఈ సృష్టిలో నుండిన వనరులను ఒక పరిమితములో నీవు అనుభవించమని కోరాడు.

చూడండి! ఈనాటి సైంటిస్టులు ప్రకృతి శక్తిలో నున్న భాగములను అనేక విధములుగా స్వే[illegible] అనుభవించుటకు ప్రయత్నిస్తున్నారు. ఇదియే ప్రకృతి యొక్క వైపరీత్యమునకు, వికృతమునకు మూలకారణమైంది. ఈనాడు ఉప్పెనలు, కరువు కాటకములు, అతివృష్టి, అనావృష్టులు యివన్నీ ఏర్పడడానికి ఏమి కారణము? ప్రకృతిలోని వనరులను తగిన రీతిలో మనం అనుభవించటం లేదు. మితిమీరి అనుభవించుటకు ప్రయత్నిస్తున్నాము. ప్రకృతి ఒక బ్యాలెన్సుతో కూడినది. ఇది ఒక గ్లోబు. ఏ వైపున భారము ఎక్కువ అవుతుందో ఆవైపు యిది మరలుతుంది. కనుక ప్రకృతిలో శక్తులను పరిమితముగా అనుభవించాలి. కానీ మితిమీరి అనుభవించుటకు ప్రయత్నిస్తున్నాము. అది సరియైనది కాదు. ఈ కారణం చేతనే మానవుడు ప్రతిరంగమందు హక్కు హక్కు అంటున్నాడు. హక్కులంటే నాకు అర్థము కావటం లేదు. హక్కు ఎక్కడ నుండి వచ్చింది? హక్కు అనేది మనకు లేనేలేదు. నిజముగా మనము విచారణచేస్తే కర్తవ్యమును మనము చక్కగా నిర్వర్తించినప్పుడే, ఆకర్తవ్యము నుండే హక్కు ఆవిర్భవిస్తుంది. కర్తవ్యమును విస్మరించి, హక్కు కోసమని పోరాడితే లాభించేది ఏమిటి? ఏమి లాభించదు. అశాంతియే లభిస్తుంది. మనకు వర్షము కురిసినప్పుడే వంకలు ప్రవహిస్తాయి. వర్షము నాకు అక్కరలేదు. వంకలు కావాలంటే ఎలా వస్తాయి? రావటానికి వీలుకాదు. కాన మొట్టమొదట వర్షమునకు ప్రార్థించాలి. వర్షము కురిసిన తరువాత వంకలను మనం అనుభవించాలి. అదే విధంగా మనకర్తవ్యమును నిర్వర్తించినప్పుడే హక్కు లభ్యమవుతుంది. ఈనాడు మానవునకు హక్కు

హక్కు - ఇది అర్థము తెలియని మాటగా గోచరిస్తున్నది మనము దినములు ఎట్లా గడుపుతున్నాం. తెల్లవారి లేచినది మొదలు రాత్రి పరుండునంత వరకు ఏదో కొన్ని రకములైన చింతలచేతను చికాకులచేతను వునకాలవు గడుపుతున్నాము. కాలము చాలా పవిత్రమైనది. కర్మలు మరింత పవిత్రమైనవి కర్తవ్యములు యింకనూ పవిత్రమైనవి. ఒక్క కార్యమున విజయము సాధించినంత మాత్రమున మనము విజయులము కాము. కట్టకడపటికి ప్రాణము పోయేంత వరకు ఈ కర్మల యందు మనం విజయమును సాధిస్తూపోవాలి.

ముఖ్యమంత్రి చెప్పినట్లుగా మనము ఏ పనిచేసినా ఆదర్శవంతమైన పనిగా ప్రజలకు నిరూపింపచేయాలి. అట్లు లేకుండా పుట్టినాము, తిన్నాము మరణించాము. యిదేనా మానవత్వమునకు విలువ? 'జంతూనాం నరజన్మ దుర్లభం', కర్తవ్యమును నిర్వర్తించే బాధ్యత మనం తీసుకోవాలి. పాపభీతి, దైవభీతి ఈరెండింటితోను సంఘనీతి చేర్చుకోవాలి. పాపమునకు ఏ మాత్రము ముందంజ వేయకూడదు.

పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవః
నపాప ఫలమిచ్ఛంతి పాపం కుర్వంతియత్నతః

**సాధనమున పనులు సమకూరు**

పుణ్యఫలము కావాలని ఆశిస్తున్నాము కానీ పుణ్య కార్యములు చేయడానికి ముందంజ వేయటంలేదు. పాప ఫలము నాకు వద్దని వెనుకకు నెట్టుతున్నాము. కానీ పాపకార్యములకు ముందంజ వేస్తున్నాము. ఇది ఏ విధంగా లభ్యమవుతుంది. **The proper study of mankind is man. Thoughts, words, action.** ఈ త్రికరణ శుద్ధి కలగినప్పుడే అన్నీ మనకు కలుగుతుంటాయి. ఒక్క త్రాగు నీటి విషయ మొక్కటే సమస్య కాదు. అన్నింటియందు మానవునికి అనేక సమస్యలుంటున్నాయి.

పుట్టుట ఒక చింత, భూమినుండుట చింత,

సంసారమొక చింత, చావు చింత,

బాల్యమంతయు చింత, వార్ధక్యమొక చింత,

జీవించుటొక చింత, చెడువు చింత,

కర్మలన్నియు చింత, కష్టముల్ ఒక చింత,

సంతసమొక చింత, [illegible] చింత!

ఏది చింతలేదు? అన్నీ చింతలే! ఒక బిడ్డకు కళ్యాణము చేయాలనుకొని ఆ సంతోషమైన మంగళకార్యము జరిపించాలంటే అక్కడకూడను చింతపడాలి. చింతలేకుండా ఈ కార్యము సాధించలేము. కనుక జీవితమే ఒక చింత.

సర్వ చింతల బాపు సర్వేశుకృపను

పొందుడికనైన నరులార కోర్కె మీర

ఈ సర్వేశ్వరుని కృపను పొందితే సర్వచింతలు నివారణైపోతాయి. కనుక మనలో భగవద్విశ్వాసము గట్టిగా పెంచుకున్నప్పుడు ఎలాంటి కష్టతరమైన కార్యమైనా సులభముగా విజయమును సాధించవచ్చు. ''సాధనమున పనులు సమకూరు ధరలోన'' అన్నాడు. సాధన లేక పని చేయటానికి వీలుకాదు. తట్టలో నున్న పదార్థము పొట్టలో చేరాలంటే నోటికి చేతికి పనిపెట్టాలి. నేను ఏ మాత్రము రెండింటికి పనిపెట్టనంటే తట్టలోని పదార్థము పొట్టలోచేరుతుందా! లేదు. ప్రతిమానవుడు కర్తవ్యకర్మలు నిర్వర్తిస్తూ పోవాలి. ప్రభుత్వము దీనిని చూచుకోవాలని గానీ, లేక అధికారులు దీనిని చూచుకోవాలనిగానీ మనము యితరులను వత్తిడి పెట్టకూడదు. మనము చేయవలసింది మనము చేయాలి చేసిన తరువాత సక్రమమైన రీతిగా అనుభవించేటట్లుచేయాలి. అప్పుడే ఈ కార్యము సాధించనందుకు సరైన

ఫలితము దక్కుతుంది. ఈనాటి మానవునియందు ఇట్టి ఓపిక కానీ, దీక్షగానీ ఎక్కడా కనిపించటంలేదు. అన్నీ త్వరగా మనకు రిజల్టు కావాలి, ఎట్లా వస్తుంది? ఒక్కొక్క దానికి తగిన ప్రయత్నము, కాల కర్మ కారణ కర్తవ్యాలు కలసిరావాలి. అట్లు లేక మనము భగవంతుని పై వేసినగానీ, లేక ప్రభుత్వము పైన వేసినగాని మంచిది కాదు. భగవంతుడు చేయగలడుగానీ, దీని కోసము భగవంతుడు నీ కిచ్చిన శక్తిని నీవు సద్వినియోగపరచుకో ఆ తరువాతే నీకు తగిన ఫలితము నందించగలడు. శక్తిని పెట్టుకొని యే మాత్రము వినియోగము చేయకుండా తగిన శక్తి భగవంతుడందించాలంటే ఏ మాత్రము వీలు కాదు.

మనము ఈ పాప భీతిని కొంత వరకు పెంచుకోవాలి. పాప భీతి మనలోపెరిగినప్పుడే దైవ ప్రీతి మనలో అభివృద్ధి అవుతుంది.

*పాపభీతి లేని పామరత్వము బట్టి*
*దైవ ప్రీతి లేని దాని బట్టి*
*మానవత్వమణగె మానవులందున*
*విశ్వశాంతి కిదియె విప్లవంబు*

ఈ విశ్వశాంతికి ఏమిటి విప్లవము? పాపభీతి అనేది లేకుండా, దైవ ప్రీతి లేకుండా మనము యిష్టానుసారము ప్రవర్తించుకుంటూ, మానవత్వపు విలువ పోగొట్టుకోవటానికి ప్రయత్నిస్తుంటే దైవము ఏ రీతిగా అనుగ్రహిస్తాడు? కనుక మానవుడుకూడా తాను చేయవలసిన కర్తవ్యకర్మలు చేస్తూపోవాలి.

## ప్రేమను పెంచుకో

ఇటువంటి మానవత్వములో ముఖ్యంగా ప్రేమను పెంచుకోవాలి. ప్రేమ కంటె మించిన శక్తివంతమైనది మరొకటి లేదు. ప్రతి మానవుని యందు ప్రేమ సహజంగానే ఉంటుంది. ఈ సహజమైన ప్రేమను నీవుసరియైన రీతిగా వినియోగించుకొనకుండా, సార్థకమైన మార్గములో ప్రవేశ పెట్టకుండా నీవు

మానవత్వమునే మరచిపోయి, అహంకారము చేతానీ, అడంబరము చేతానీ, అసూయ చేతానీ జీవితాన్ని అభివృద్ధి చేసుకుంటూపోతే ఏ విధంగా శాంతి లభ్యమవుతుంది?

హస్తమున అణుబాంబు ఉంచుక
అరచుచుందురు శాంతి శాంతియని
చంద్రు చేరగలిగికూడను
చెందజాలరు శాంతి సుఖములు.

చేతిలో పెట్టుకొనేవి బాంబులు. శాంతి శాంతి అంటే ఎక్కడ నుంచి వస్తుంది శాంతి. అదే విధముగా మన చుట్టూ వాతావరణము భయంకరమైన వాతావరణము పెట్టుకొని మధ్యలో శాంతి శాంతి అంటే ఎక్కడ మనకు శాంతి లభ్యమవుతుంది. కనుక మన వాతావరణము పరిశుద్ధమైన వాతావరణముగా మార్చుకోవాలి. పవిత్రమైన వాతావరణముగా మార్చుకోవాలి. ప్రశాంతమైన వాతావరణముగా మార్చుకోవాలి.

ఈనాడు కలి ప్రభావముచే ఎవరు మంచి పనులు చేస్తుంటారో, వారికి అన్నీ ఆటంకాలే తగులుతుంటాయి. **The pleasure is an interval between two pains** మంచికి అన్నీ ఆటంకములే. దాని స్వభావము యిది. వారు చేయరు. చేసే వారికి అవకాశమందించరు. ఇలాంటి వారు లోకములో అనేకమంది అభివృద్ధి అవుతున్నారు. ఏ విధంగా ఉంటున్నారు? అంటే తాము చేయక చేసే వారికి నిరుత్సాహాన్ని కలిగిస్తారు. ఇలాంటి వారివలననే లోకములో అభివృద్ధులన్నీ క్షీణించిపోతున్నాయి. లేకపోతే ఒక గ్రామము అభివృద్ధిలోకి రావాలంటే ఆ గ్రాములోని ప్రజలంతా ఏకమైతే, మన స్పీకరు చెప్పినట్టు, ఎంతైనా చేయవచ్చు. చిమ్మెట సంతతి వారు, దోమ సంతతి వారు, నల్లి సంతతి వారు కొంతమంది ఉంటారు. చిమ్మెట మీకు తెలుసు పెద్ద నూరువందల రూపాయల పట్టు చీరను మసిగుడ్డను కొట్టినట్టు కొట్టటం

దాని స్వభావం. ఈ విధంగా మంచివారిని, పెద్దవారు ఏదో ఒక విధంగా నిందించటము వారి స్వభావము. అలా నిందించేవారు ఏమైనా మంచిపని చేశారా? అని విచారిస్తే ఏమీ ఉండదు. అలాంటి వారికి విమర్శ చేసే అధికారము ఎక్కడనుంచి వచ్చింది? వారికి అధికారమే లేదు ఈ విధంగా ఎవరికి వారు ఆత్మపరీక్ష చేసుకుంటే తమ మేలు తామే చేసుకోగలరు. మనం చేయవలసింది ఒక్కటే. ఎవరేమైనా అనుకున్నా ఫరవాలేదు మేము చేసేది మంచిపని అనే విశ్వాసము ధృఢముగా ఉంటున్నప్పుడు ఎవరికీ మనము వెరవనక్కర లేదు. అదే ముఖ్యమంత్రికి చెప్పాను

**మనస్సే సాక్షి**

మనస్సుకు మనస్సు సాక్షి
దేహమునకు గుణము సాక్షి
సర్వముకు స్వామి సాక్షి
మూఢులకు మూర్ఖం సాక్షి.

ఇలాంటి మూఢులంతా ఎంతోమంది ఉంటారు. కానీ మనం లెక్క చేయనక్కరలేదు. మన హృదయానికి మంచిదనిపించినప్పుడు చేయటంలో తప్పులేదు. ఎవరేమనుకున్నా మనకు భయంలేదు. కారణం ఏమిటి? మనం చేసేది మంచిది. ఆ ఆత్మ విశ్వాసము మనం ధృఢముగా పెంచుకోవాలి.

ఈనాడు భారతదేశములో నీటి కొరకు బాధపడే వారిని కోట్లకొలది మనం చూస్తున్నాము. ఎందుకోసం ఈ విధంగా వస్తుందంటే మానవులలోని ప్రవర్తనలో దోషమే మూలకారణముగా ఉంటున్నది. మానవుడు మానవుడుగా పుట్టినందుకు మానవత్వాన్ని తగిన రీతిలో అనుభవిస్తున్నాడా? లేక పశుత్వమును అనుభవిస్తున్నాడా? అనే విచారణ చేసుకుంటే మానవత్వములో మూడుంటున్నాయి. దైవత్వము, మానవత్వము, పశుత్వము. పశుత్వము పెరిగిపోతున్నది; మానవత్వం తరిగిపోతున్నది. ఈనాడు మానవత్వంలో

ఆశయాలు తరిగిపోతున్నాయి; ఆశలు పెరిగిపోతున్నాయి. స్వార్థము పెరిగిపోతున్నది పరార్థము తరిగిపోతున్నది; కుతంత్రము పెరిగిపోతున్నది. పరతంత్రము తరిగిపోతున్నది; దేహాభిమానం పెరిగిపోతున్నది. దేశాభిమానం తరిగిపోతున్నది. దీనివల్లనే మానవత్వములో వికృతమైన భావాలు విజృంభించిపోతున్నాయి. పూర్వీకులు ఎట్లా ఉండేవారు? ఆనాడు ఎట్టి దినము గొప్ప దినము అనుకునేవారు?

సద్భక్తులందరు భగవంతుడా యంచు
　　చెవుల కింపుగ స్మరణచేయు దినము
బీదల వెతలన్ని ప్రీతితో నెరవేర్చి
　　అన్నదమ్ముల మాడ్కి నున్నదినము
దైవ చింతన చేయు దాస బృందములకు
　　ప్రీతి మృష్టాన్నంబు పెట్టు దినము
మహనీయులెవ్వరైన మన కడకే తెంచి
చెలిమి భగవత్కథలు చెప్పు దినము
దినము గానీ తక్కినవన్ని దినములగునె

దినాలనే కాదు. మనము చేయవలసిన సక్రమమైన మార్గాన్ని మనం అనుభవించాలి. ఆ విధంగా ఉండినప్పుడే మానవులై పుట్టినందుకు తగిన కీర్తిని సాధించిన వారమవుతాము. ఎవరికోసమో కాదు. నీకోసమే నీకీర్తి నీవు సాధించుకో.

## త్యాగమే యోగము భోగమే రోగము

పూర్వము భారతీయులందరు త్యాగానికి పట్టం కట్టారు. న్యాయానికి కంకణం తొడిగారు. ధర్మాన్ని అందల మెక్కించారు. సత్యానికి స్వాగతం చెప్పారు. ఈనాడు జరిగేది ఎంత విరుద్ధంగా ఉంటున్నది. త్యాగము లేక జీవితమునకు

ఏమున్నది చెప్పండి. మన దేహములోనే క్షణ క్షణము త్యాగము చేస్తున్నాము పీల్చిన గాలిని తిరిగి విడవకుండాపోతే మన Lungs పాడైపోతాయి. తిన్న అహారము మరొక వైపున విసర్జించకపోతే పొట్ట చెడిపోతుంది. రక్తము ప్రసరించకుండా ఒకే ప్రదేశములో ఉంటే అక్కడ boil తయారౌతుంది. కాబట్టి త్యాగము ఎంత క్షేమాన్ని అందిస్తున్నది! ''న కర్మణా, న ప్రజయా, ధనేన త్యాగే నైకే అమృతత్వమానసుః''. త్యాగము చేసినప్పుడే నిజమైన యోగముగా తయారౌతుంది. భోగమే రోగముగా మారుతుంది. కనుక ప్రతిమానవుడు తన శక్తి కొలది ఏదో కొంచెం త్యాగం చేసి తోటి మానవులకు తగిన సహాయము చేసి వారిని తనసాటికి తెప్పించుకొనుటకు తగిన సహాయము చేయాలి. ఎంత మందినో చాలా బాధలు పడే వారిని చూస్తున్నాము. చూచి జాలి పడుతున్నాము. ప్రయోజనం ఏమిటి? జాలిని ఆచరణ రూపంలో నిరూపింపచేయాలి. అప్పుడే ఇది సార్థకమవుతుంది.

ప్రేమస్వరూపులారా! ఈనాడు మినిష్టర్సు అందరు వచ్చారు. వారిబోధలు హృదయానికి హత్తుకునేటట్లు చెప్పారు. వారి అనుభూతులు అందించారు. ఇలాంటి మాటలేకాక, క్రియలే కాక కొన్ని కర్మలు ఆచరించినప్పుడే మనము యింకా ఎంతయో అభివృద్ధి పొందుతాము. ఇలాంటి వారు అప్పుడప్పుడు చేరి హెచ్చరిక లందించి దీనిని ఉత్తేజింప చేయటానికి తగిన ఉత్సాహ ప్రోత్సాహములను కలిగింప జేసేవారుగా ఉంటారు. మన ముఖ్యమంత్రి, స్పీకరు, ఢిల్లీ మంత్రి వీరందరు ఉత్సాహాన్ని అందిస్తూ వచ్చారు. ఉత్సాహమునే కాక ప్రోత్సాహము కలిగింపచేశారు. ఈ ఉత్సాహ ప్రోత్సాహములు ఇప్పటికి మాత్రమే ఉంటే ప్రయోజనం లేదు. హృదయములో నాటుకొనిపోవాలి. అవి కార్యరూపము ధరించాలి. ఈ చెవితో విని ఆ చెవితో వదలి ప్రయోజనము లేదు. మన హృదయములో చేర్చుకోవాలి.

ఈనాడు ప్రపంచములో అనేక సమస్యలు అభివృద్ధి అవుతూ వస్తున్నాయి.

దినదినమునకు సమస్యలు పెరిగిపోతున్నాయి. సమస్యల తోరణముగా కనిపిస్తున్నది భారతదేశము. భారతదేశమే కాదు ప్రపంచమంతా యిదే సమస్యలతో కూడి ఉంటున్నది అయితే కొన్ని కనిపించవచ్చు. కొన్ని కనిపించకపోవచ్చు. వీటన్నింటికి మూల కారణము ఏమిటి? మానవుడు బాగుపడాలి. మానవుడంటే ఏమిటి? శరీరము బాగుపడితే ప్రయోజనం లేదు. శరీరాన్ని మార్చుకుంటే ప్రయోజనం లేదు. మనస్సు మారాలి. మానవత్వము లోని దివ్యత్వము కొంతవరకు విచారణ చేయాలి. ఆ దివ్యత్వము, మనస్సు రెండింటి ఏకత్వము చేత దైవత్వము ప్రాప్తిస్తుంది. దైవత్వము ప్రత్యేకంగా లేదు. నీవే దైవము. నీవే సర్వస్వము. శాంతి నీలోనే ఉంటుంది. దయ నీలోనే ఉంటున్నది. దయగల హృదయమే దైవమందిరము. అలాంటి దయాహృదయుడైన మానవుడు దయారహితుడుగావటం చేత ఎంత కఠినమైనవాడుగా అవుచున్నాడు! కనుక ప్రేమతో ఉండినంత వరకు అందరిని వర్ణిస్తాము. ఆ ప్రేమ ఏమైనా విరిగెనా అన్నింటిని విమర్శిస్తాము.

**కువిమర్శలను నెట్టి, పట్టినదానిని సాధించాలి :**

కూరిమిగల దినములలో నేరములెన్ని
కలుగనేరవు మరి ఆ కూరిమి
విరసంబైనను నేరములే దోచుచుండు.

మన స్నేహము మంచిగా ఉందంటే ఏమి చేసినా మంచే అనుకుంటాం. నీవు, నన్ను కొట్టినప్పుడు కూడా ఓ! కొట్టటం వల్ల చాలా మంచిదైంది! ఇక్కడ నొప్పిగా ఉన్నది; నా నొప్పిపోయింది అని ఎంతో విచారించుకుంటాం. ఒక విధమైన ద్వేషము ఏర్పడెనా! ఒక గులాబి పుష్పము వేసినా గులాబి పుష్పములో ముల్లు నావంటిలో చేరిపోయి అది పాయిజన్ అయిపోయి నేను చెడిపోవాలని చేశాడని చెడ్డదిగా భావిస్తూపోతుంటాం. ఇదిమానవుని బలహీనత.

ఈ ప్రేమ ప్రేమగా ఉండాలి. ఎలాంటి పరిస్థితిలోను ఈ ప్రేమమారకూడదు. వ్యక్తిగత విషయములో, భేదము వచ్చిందని అన్నింటిలో భేదము తీసుకోవటం మూర్ఖత్వము. ఇలాంటి మూర్ఖత్వము ఉన్నవారే అభివృద్ధులకు అడ్డుపడుతూ ఉంటారు. ఇలాంటి వారిని నమ్ముకొని మన అభివృద్ధి కార్యక్రమములను విరమించుకోవటం మంచిది కాదు. మనము చేయవలసింది చేయాలి. ఎన్ని కష్టములైనా, ఎన్ని నష్టములైనా మనము పట్టినదానిని సాధించాలి.

*పట్టిన పట్టేదో పట్టనే పట్టితివి*
*పట్టునెగ్గెడు దాక అట్టె ఉండు*
*కోరిన దేదియో కోరనే కోరితివి.*
*కోర్కె చెల్లెడు దాకపోవకుండు*
*అడిగిన దేదియో అడగనే అడిగితివి*
*అడిగిన దిడుదాక విడువకుండు*
*తలచిన దేదియో తలచనే తలచితివి*
*తలపుతీరెడు దాకపోవకుండు*

ఇదియే నిజమైన ఒక ప్రతిజ్ఞ అలాంటి ప్రతిజ్ఞ చేత మన మానవత్వం సార్థకముచేసుకోవాలి.

## ప్రతివ్యక్తి శ్రమదానం చేయాలి

దివ్యాత్మ స్వరూపులారా! ఈనాడు చక్కగా ఈ ప్రశాంతి నిలయములో యజ్ఞము సమాప్తి అయిన దినము 'విజయదశమి'. ఈ రోజున మన బాధ్యతలు ముఖ్యమంత్రి స్వీకరించి; ఇది తన బాధ్యతగా వహించి, ''ఏ విధమైన అనుమానము లేకుండా తప్పక సరిదిద్దుకుంటానని మాట యివ్వటము'' జరిగినది.

అంతే కాక యింకా మున్ముందు జరుగవలసిన కార్యక్రమములెన్నో ఉంటున్నాయి. ''ఇది నేను చెప్పాను. నా కాలిగోరు మొదలుకొని తల వెంట్రుక

వరకు ఉపకారమే- ఉపకారమే''. దేశానికి చేయవలసిన ఉపకారములు మానవులు కాక ఎవరు చేయాలి? ఎన్నో! చేయాలని ఆశపడుతున్నాను; ఎవ్వరికీ చెప్పను. చెప్పి చేసేవి చేసినట్లు కాదు. చెప్పకుండా చేయాలి. మన స్పీకరు చెప్పాడు. వారి ప్రాంతములో కూడా మంచినీటి సమస్యలు అధికంగా ఉంటున్నాయి. మనకు కొన్ని నదులైనా ఉంటున్నాయి. కోలారు వైపు ఏమీ లేవు. అక్కడ కూడా చాలా ఇబ్బంది పడుతున్నారు. ఇలాంటి సమస్యలు తీసుకొని వాటిని పరిహారము గావించి సర్వులను సంతృప్తిపరచాలి! 'లోకాఃసమస్తా స్సుఖినోభవంతు', యిదే మన ప్రధాన కర్తవ్యమని ప్రతి మానవుడు తన హృదయముపై ముద్రించుకోవాలి.

తాను పుట్టింది దేనికోసం? నా కోసం కాదు; సమాజం కోసం పుట్టాను. సమాజము యొక్క సమస్యలను మనము తీర్చినప్పుడే సమాజములో పుట్టినందుకు సార్థకమవుతుంది. అంతే కానీ సమాజములోని సమస్యలు తీర్చకుండా మానవత్వము మనుగడసాగించాలంటే వీలుకాదు. దాన్ని తీర్చినప్పుడే సమాజ సంక్షేమము తీర్చిదిద్దిన వారౌతారు. వ్యక్తులు తమలో తాము గుంపులుగా చేరుకొని, కమిటీగా పెట్టుకొని తద్వారా ప్రభుత్వమునకుగానీ; ఏ సంఘముపైగానీ, బాధ్యత పెట్టకుండా సాధ్యమైనంత వరకు తామే చేసుకుపోవాలి.

యువకులు అనేక మంది ఉంటున్నారు. ఏ పనిలేక యింటిలోతిని తిరిగేవారు; కాలమును వ్యర్థము చేసేవారు; అమితంగా ఉంటున్నారు. శ్రమదానము ముఖ్యమంత్రి చేస్తున్నాడు. ఆవిధంగా ప్రతి వ్యక్తి శ్రమదానం చేయాలి. మన గ్రామానికి రోడ్డు లేదు. రోడ్డు వేసుకోవాలి. మన గ్రామానికి రావటానికి ఏ గ్రామములోని వారో వచ్చి రోడ్డు వేస్తారా! రోడ్డు వేస్తే గౌరవము కానేకాదు. మనకు మనమే వేసుకోవాలి. మన గ్రామములో సమస్యలు మనమే పరిహారము గావించుకోవటానికి ప్రయత్నం చేయాలి. అలాంటి ప్రయత్నమునకు

అధికవ్యయమైనప్పుడు యింకొకరు బాధ్యత తీసుకోవచ్చు.

**ప్రజాక్షేమమేకావాలి :**

''నేను ఎప్పటికీ సిద్ధముగానే ఉంటున్నాను. ఏ గ్రామము వారైనా, ఏ స్టేటు వారైనా, ఏ జిల్లావారైనా గానీ జాతి మత భేదములూగానీ, స్థాన భేదములూగానీ లేనేలేవు. మీరు నమ్మినా నమ్మకపోయినా నాకు అందరూ ఒక్కటే caste of humanity, religion of love, language of heart ఏ రాష్ట్రమున్నకైన, ఏ గ్రామమున్నకైనా సహాయము చేయటానికి ఎప్పుడూ సిద్ధముగానే ఉంటాను - 'ఇదికాదు' అనేది నానుండి రాదు. ఏది ఏమైనా సరే, ఇంకేమైనా పెద్ద కార్యము చేయాలనుకుంటే ఎవరైనా కొనేవారుంటే ప్రశాంతినిలయమునైనా అమ్మి చేస్తాను'' దీనికన్నింటికి నేను సిద్ధమే, నాకు కావలసింది ప్రజా క్షేమమే, ప్రజల ఆనందమే, ప్రజలు దైవానుగ్రహమునకు పాత్రులు కావటమే, దీనికే నేను పాటుపడుతున్నాను. ఈ సత్యము ఎవరు గుర్తించటంలేదు. ఎన్ని సంవత్సరములు చెంత నుండి నప్పటికి మీరు కూడ నా సత్యమును గుర్తించటం లేదు. ఎట్లా అవుతుంది గుర్తించుకోవటానికి? సాధ్యం కాదు! కనుక దైవము యొక్క తత్త్వాన్ని, పవిత్రత యొక్క తత్త్వాన్ని తెలుసుకోవటం కష్టము.

మీరు అందరు ఎవరికి తగిన శ్రమలు వారు చేసుకుంటూ భగవద్విశ్వాసము పెంచుకొని దాని ద్వారా మీరు మీకార్యములు సాధించుకుంటే ఏ అభ్యంతరములు లేక అన్నీ సులభంగా జరిగిపోతాయి. పూర్వీకులంతా ఎట్లా చేశారు. వారందరు యీ మార్గమునే అనుసరిస్తూ వచ్చారు. ఆనాడు ఈ పార్టీలని, ఈ ద్వేషాలని, ఈ విధమైన సమస్యలు లేవు అందరు ఏకమనస్సుతో ఉండేవారు. ఆనాడు వేదము అదే బోధించింది.

కలసిమెలసి తిరుగుదాం. కలసిమెలసి పెరుగుదాం

కలసి మెలసి తెలుసుకున్న తెలివిని పోషించుదాం
కలసిమెలసి కలత లేక చెలిమితో జీవించుదాం.

ఋగ్వేదములో చెప్పిన మంత్రమదే. ఈ విధంగా ఆనాడు మంత్ర ద్రష్టలైన వారి యొక్క స్వరములే వేదములు. ఇట్టి వేదముల ప్రమాణములే మానవుని ప్రవర్తనలు. ఈ ప్రవర్తనలు సక్రమముగా లేనప్పుడు మానవుని తత్త్వము యింకేమని చెప్పవచ్చును. మానవుడు అని అనుకున్నందుకు ఒక ఆదర్శము చూపించాలి. తనకు ఇష్టము లేదని మంచిని కూడా చెడ్డగా మార్చుకోకూడదు. చాల పొరపాటు, వాడు మానవుడే కాదు.

***మంచికార్యానికి సందేహించకూడదు:***

ఎవ్వరు ఏ విధమైన సందేహాలు లేకుండా గాఢ విశ్వాసము పెంచుకొని ఏ కార్యమునైనా మనము చేయగలమనే ధైర్యసాహములతో ముందంజ వేయాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నా, మన ముఖ్యమంత్రిగారు ఎన్నో కార్యాలు చేబడుతున్నారు. యిలాంటి కార్యములలో ఏ విధమైన భయమునకు మనము అవకాశమునందించకూడదు. మనం మంచి చేస్తున్నప్పుడు ఎవరి కోసం భయపడాలి. వారు ఏమైనా భూతములా! పిశాచములా! వారికి భయపడనక్కరలేదు. మనము మంచి కార్యము చేసినప్పుడు ధైర్యంగా సాహసముతో చేయాలి. ధైర్యమే సర్వసాధకం; సాధనలో ధైర్యము మనకుండాలి. అయితే కొంత మంచితనము మనం పెంచుకోవాలి. ట్యాంకులో మంచినీరుంటే ట్యాపులో మంచినీరే వస్తుంది. ట్యాంకులో చెడ్డనీరుంటే ట్యాపులో చెడ్డ నీరు వస్తుంది. ట్యాంకును మంచినీటితో నింపుకోవాలి. హృదయమనే ట్యాంకు మంచిగా ఉంటున్నప్పుడు ఎవరేమి తలచినా మనకు భయము లేదు. చక్కగా మనము దాహము తీర్చుకొని ఆనందముగా ఉండవచ్చు. శాంతి, శాంతి, శాంతి! ఈనాడు అనంతపురం జిల్లా మాత్రమే అనుకోకూడదు. ముమ్ముందు

యింకా యితర జిల్లాలను కూడా పట్టుకోవాలని ఆశిస్తున్నాను.

ఒక్క విషయం మీరు గుర్తించాలి. భారతదేశమునందుగానీ ఇంకే దేశమందైనా మంచి కార్యము చేయాలనుకుంటే తక్కువలేదు; కావలసినంత ఉంటున్నది. కానీ ఆ సంకల్పమే రావటంలేదు. ఆ మంచి సంకల్పమే వస్తే మానవులు సాధించనిది లోకములో ఏమీలేదు. లక్షల మైళ్లు అంతరిక్షములోకి పోతున్నాడు; కానీ అరయించి హృదయాంతరాళములో చేరడంలేదు. ఇది వారికి సాధ్యము కాదు. కనుక మంచి మనస్సుతో ఏ కార్యము చేసినా సందేహము లేదు. మా ట్రస్టు వారు చెప్పారు. ''ఇది బృహత్కార్యము; బ్యాంకులో ఏమీలేదు; ఎట్లా జరుగుతుందని'' మీరు అనుకోవద్దు; నేను చూచుకుంటాను. మంచి కార్యమునకు సందేహించనవసరంలేదు. తప్పక జరిగిపోతుందన్నాను. తప్పక జరిగిపోయింది. ఏ విధమైన ఇబ్బందులూ లేవు.

**విద్య, వైద్యం, జలసదుపాయాలకు సహాయం చేయండి :**

స్పీకరు చెప్పినాడు పుట్టినది మొదలుకొని గిట్టునంత వరకు నీటితో ఎన్నో పనులుంటున్నాయి. పుట్టినప్పుడు మనం నీటితో పుట్టాము, మరణించే సమయంలోను నీటితోనే పోతున్నాం. నీరు ప్రాణము. ప్రాణ సమానమైన నీరు అందరికి అందించాలి. అదే నా సంకల్పము. మొట్టమొదటి నుంచి అనుకున్నాను. మన భారతదేశములో ప్రాచీన కాలము నుండి విద్య ఉచితంగా చెబుతూ వచ్చారు. ఆ గ్రామస్థులు ఆ ఉపాధ్యాయునికి అనుకులాలు ఏర్పరచి ఆ విద్యను అభ్యసిస్తూ వచ్చారు. కాబట్టి భారతదేశములో విద్య ఉచితమే. ఆ ఉచితభావాన్ని నేను సంకల్పించుకున్నాను. మన Institute లో ఒక్క నయాపైస ఎవరిని ఏమి అడగటం లేదు. కానీ టీచర్సుకి స్కేలు ప్రకారము జీతాలిస్తున్నాము. గవర్నమెంటు ఏమీ యివ్వటం లేదు. యథార్థము

నేను చెబుతున్నాను. మేము అడుగలేదు. విద్య శిరస్సుకు, ఆరోగ్యము heart కు, జలము దేహానికి - ఈ మూడింటిని ఉచితము చేస్తే జీవితమే అంకితము చేసినట్టవుతుంది. ఇంతకంటె మహాభాగ్యము ఏముంది? విద్య ఉచితముగా అభ్యసించుటకు మీరు ప్రయత్నం చేయండి. ఆరోగ్యమునకు బీదవారికి మందులు సహాయముచేయండి. ఇంక జలము విషయములో - కొన్ని స్థానములలో సరైన జలము చిక్కటం లేదు, రాయలసీమలో ఎక్కడ చూచినా ఫ్లోరైడు ఉంటున్నది. దీనివల్లనే తరతరముల నుండి కాళ్లు చేతులూ వంపులు తిరిగి వారి జీవితము చాలాపాడైపోయింది. జరిగినది జరిగిపోయింది. రాబోయే పిల్లలనైనా ఆరోగ్యవంతులుగా ఉంచండి, ఆనందవంతులుగా ఉంచండి. జీవితమును అభివృద్ధిపరచి, ఆదర్శము నిరూపిస్తారని యిలాంటివి జరగకుండా ఉండాలని ఆశిస్తున్నాను. దానికి తగిన ప్రయత్నం తప్పక చేస్తాను. ఏ మాత్రం సందేహించనక్కర లేదు. స్పీకరు చెప్పినట్టుగా ఎవరికివారే తోడుగా ఉంటుండి యిలాంటి కార్యక్రమములో పాల్గొని విజయము సాధించాలని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ, నా దీర్ఘ ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

తేది : 11-10-1997 సాయికుల్వంత్ హాల్



# శ్రీసత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,


ప్రశాంతినిలయం - 515 134 అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా


దిగుమతిదారు / ఎగుమతిదారు కోడ్ నెంబరు 0990001032


రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా ఎగుమతి దారుల కోడ్ నెంబరు. 2001198


ప్రస్తుతం మా వద్ద లభ్యమవుతున్న పుస్తకముల జాబితా

| వ.నెం. | పేరు | | ధర |
|---|---|---|---|
| 1. | ఉపనిషత్ వాహిని | .. | 8-50 |
| 2. | గీతా వాహిని | .. | 18-00 |
| 3. | ధర్మ వాహిని | .. | 8-50 |
| 4. | ప్రశాంతి వాహిని | .. | 11-00 |
| 5. | ప్రశ్నోత్తర వాహిని | .. | 10-00 |
| 6. | భాగవత వాహిని | .. | 18-00 |
| 7. | రామకథారస వాహిని (1వ భాగం) | .. | 35-00 |
| 8. | రామకథారస వాహిని (2వ భాగం) | .. | 18-00 |
| 9. | లీలాకైవల్య వాహిని | .. | 4-50 |
| 10. | సత్యసాయి వాహిని | .. | 14-00 |
| 11. | జ్ఞాన వాహిని | .. | 11-00 |
| 12. | ధ్యాన వాహిని | .. | 15-00 |
| 13. | ప్రేమ వాహిని | .. | 9-00 |
| 14. | విద్యా వాహిని | .. | 12-00 |
| 15. | సూత్ర వాహిని | .. | 8-50 |
| 16. | అద్భుతమూర్తి | .. | 37-00 |
| 17. | ఆత్మారామమ్ | .. | 34-00 |
| 18. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1978) | .. | 18-00 |
| 19. | నీలగిరి వేసవి వెన్నెల (1976) | .. | 14-00 |
| 20. | భజనావళి | .. | 27-50 |
| 21. | మనస్సు - మర్మము | .. | 14-00 |
| 22. | సందేహ నివారిణి | .. | 24-00 |
| 23. | చిన్నకథ (1వ భాగం) | .. | 17-00 |
| 24. | చిన్నకథ (2వ భాగం) | .. | 18-00 |
| 25. | చిన్నకథ (3వ భాగం) | .. | 23-00 |
| 26. | సత్యం శివం సుందరం (1వ భాగం) | .. | 40-00 |
| 27. | సత్యం శివం సుందరం (2వ భాగం) | .. | 43-00 |
| 28. | సత్యం శివం సుందరం (3వ భాగం) | .. | 38-00 |
| 29. | సత్యం శివం సుందరం (4వ భాగం) | .. | 29-00 |
| 30. | మణిమాల | .. | 20-00 |
| 31. | వచనామృతము | .. | 18-50 |

| వ.నెం. | పేరు | | ధర |
|---|---|---|---|
| 32. | శ్రీసత్యసాయి దివ్యబోధ (1993) | .. | 27-00 |
| 33. | వాక్యవిభూతి | .. | 6-00 |
| 34. | ప్రేమసుధా స్రవంతి | .. | 52-00 |
| 35. | శ్రీసత్యసాయిగీతామృతము | .. | 46-00 |
| 36. | సాయిబాటలో నా పయనము | .. | 55-50 |
| 37. | ప్రబోధ పంచామృతము | .. | 17-00 |
| 38. | సనాతన సారథి 70వ జన్మదిన ప్రత్యేకసంచిక | .. | 25-00 |
| 39. | శ్రీసత్యసాయి గీతా | .. | 30-00 |
| 40. | శ్రీకృష్ణుడు - శ్రీసత్యసాయి | .. | 28-00 |
| 41. | భక్తోద్ధారక శ్రీసత్యసాయి | .. | 25-00 |
| 42. | మూఢమతి - ముక్తమతి | .. | 23-50 |
| 43. | ప్రేమజ్యోతి | .. | 45-00 |
| 44. | మాతృశ్రీ ఈశ్వరమ్మ | .. | 44-00 |
| 45. | భక్తి రసాయనం | .. | 18-00 |
| 46. | జయభేరి | .. | 17-00 |
| 47. | శ్రీసత్యసాయి విన్నపములు | .. | 17-00 |
| 48. | పరమానంద శ్రీసాయి సన్నిధి | .. | 5-00 |
| 49. | శ్రీసత్యసాయి అనుగ్రహం | .. | 5-00 |
| 50. | మూలపురుషుడు శ్రీ సత్యసాయి | .. | 5-00 |
| 51. | శ్రీసత్యసాయీశోపనిషత్ | .. | 5-00 |
| 52. | బాబా జీవితమే జగతికి సందేశం | .. | 65-00 |
| 53. | పూర్ణావతారి భగవాన్ శ్రీ సత్యసాయిబాబా | .. | 45-00 |
| 54. | నాలో నిండిన వెలుగు | .. | 20-00 |
| 55. | శ్రీ సాయిరామ శతకం | .. | 5-00 |
| 56. | సాయిరామ స్తుతిమాల | .. | 3-00 |
| 57. | భగవాన్ శ్రీ సత్యసాయికి జన్మదిన కానుక | .. | 5-00 |
| 58. | స్మృతి పథంలో శ్రీమతి ఈశ్వరమ్మ | .. | 5-00 |
| 59. | శ్రీసాయి మంజీరాలు | .. | 10-00 |
| 60. | బృందావనంలో శ్రీసాయిసన్నిథి | .. | 10-00 |
| 61. | సుగుణానిధి శ్రీ సత్యసాయి | .. | 5-00 |
| 62. | శ్రీ సత్యసాయి శిష్యవాణి | .. | 5-00 |
| 63. | నామస్మరణ విశిష్టత | .. | 18-00 |
| 64. | ప్రేమబంధం | .. | 25-00 |
| 65. | శ్రీ సత్యసాయి మహిమామృతాము | .. | 20-00 |
| 66. | శ్రీ సత్యసాయి సూక్తులు | | 40-00 |
| 67. | దసరా యజ్ఞ సప్తకం | .. | 27-00 |

పుస్తకాలను రిజిష్టర్డ్ పోస్టులో మాత్రమే పంపడం జరుగుతుంది. **"కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్, ప్రశాంతి నిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, ఇండియా, పిన్ - 515 134"** అనే చిరునామాకు ముందుగా మీకు కావలసిన పుస్తకాల ధర ఇండియన్ లేక ఇంటర్నేషనల్ మనియార్డరు ద్వారాగాని, డ్రాఫ్టు ద్వారాగాని పంపిన మీదట మా వద్ద లభ్యమౌతున్న పుస్తకాలను పంపుతాము. పుస్తకాలను వి.పి.పి. ద్వారా పంపించటం జరుగదు.

**పోస్టు ఖర్చుల వివరాలు (మనదేశంలో)**

ప్రతి వంద గ్రాములకు **0.50** పైసల చొప్పున **3** నుండి **5** పుస్తకాలు (సుమారు ఒక కేజి బరువుగల ప్యాకెట్) పంపడానికి పోస్టు ఖర్చు రూ. లు **5/-** రిజిస్ట్రేషన్ ఖర్చులు రూ.లు **10/-** మొత్తము రూ.లు **15/-, 4** నుండి **8** పుస్తకాలు (సుమారు రెండు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు **20/-, 7** నుండి **10** పుస్తకాలు (సుమారు మూడు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు **25/-, 9** నుండి **15** పుస్తకాలు (సుమారు నాలుగు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు **30/-, 15** నుండి **20-** పుస్తకాలు (సుమారు ఐదు కేజీల ప్యాకెట్) పంపడానికి రూ.లు **35/-** అగును. ప్యాకింగ్ మరియు ఫార్వార్డింగ్ ఉచితం.

**పోస్టు ఖర్చుల వివరాలు (విదేశాలకు)**

**3** నుండి **5** పుస్తకములు (ఒక కిలో ప్యాకెట్) ఓడలో పంపడానికి రూ.లు **59/-**, విమానంలో పంపడానికి రూ.లు **209/-, 4** నుండి **8** పుస్తకములు (రెండు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి రూ.లు **78/-**, విమానంలో పంపడానికి రూ.లు **378/-, 7** నుండి **10** పుస్తకములు (మూడు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి రూ.లు **110/-**, విమానంలో పంపడానికి రూ.లు **560/-, 9** నుండి **15** పుస్తకములు (నాలుగు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి రూ.లు **140/-**, విమానంలో పంపడానికి రూ.లు **740/-, 14** నుండి **20** పుస్తకములు (ఐదు కిలోల ప్యాకెట్) ఓడలో పంపడానికి రూ.లు **172/-** విమానంలో పంపడానికి రూ.లు **922/-** అగును.

